ప్రకాశకుడు:-

వేదుల రామమూర్తి

సర్వస్వామ్యములు - ఆంధ్రీకృతికర్తవి

ప్రేరకుడు

అయలసోమయాజుల చిట్టిసోమయాజులు.

*

ప్రథమ ముద్రణము

ప్రతులు : ఆరువందలు

దుర్మతి-శ్రావణము.

*

ప్రాప్తిస్థానము:-

పంతుల లక్ష్మీనారాయణశాస్త్రి

అధ్యాపకుడు, శ్రీ మహారాజ ప్రభుత్వసంస్కృతకళాశాల

పత్తిపాటివారివీధి - విజయనగరము

# శ్రీవాసిష్ఠ గణపతిముని సమారాధనము

కాయముచేత అల్పుఁడయి గౌరవబుద్ధి ననల్పుఁడై ప్రజా
శ్రేయముఁ గోరి - లోకశుభసిద్ధికి అద్భుతమంత్రయోగ ని
ష్ఠాయుతుడై అపూర్వనిజశక్తిఁ దపించిన పుణ్యమూర్తి మా
నాయన - శ్రీగణేంద్రమునినాథుఁడు మాకు స్ఫురించుగావుతన్.

నిగమార్థ ప్రతిపాదనైకనుగా నిత్యాత్మమహోల్లసద్
భగవద్ దివ్యకటాక్షపాత్రునిగ సత్ పాండిత్య సాహిత్య పూ
ర్ణగుణస్తుత్య కవిత్వమూర్తిగ అపర్ణాదేవి ఏకావ్యకం
ఠగణాధ్యక్షు ననుగ్రహించె నతనిన్ ధ్యానింతు మెల్లప్పుడున్.

అలఘుగుణుండ వీవొక మహాత్ముఁడ వన్నతలంపుకన్న ఏ
తెలివియులేని- మమ్ము భవదీయపదాంబుజ భక్తులన్, కృపా
విలసిత వాఙ్మరంద శుభవీక్షల నేలిన నాయనన్, నినున్
దలతుము దేశికాగ్రణీ! గణాధిపమౌని! అనుగ్రహింపవే.

కావ్యకంఠమహాముని కథితమగుచు
వర్తిలు ఉమాసహస్రి కావ్యమిది సకలము
ఆంధ్రభాషానువాద సమన్వితముగ
వెలసి తదనుగ్రహస్ఫూర్తి నలరుగాత.

ఇట్లు
శ్రీగణపతిముని చరణసేవకులు

1. వేదుల రామమూర్తి
2. అయలసోమయాజుల చిట్టిసోమయాజులు
3. భక్తబృందము.

★

ఓం నమో భగవతే శ్రీ రమణాయ.

శ్రీ భారతీ దేవ్యై నమః.

# శ్రీ గణపతి ముని చరిత్ర సంగ్రహము.

సకలవేద శాస్త్రార్థసంగ్రథితమును, నిగూఢార్థతత్త్వ వివరణచాతురీ సమన్వితమును, అపూర్వవిషయకవనోల్లసితమును, గంభీరభక్తియోగ సమున్మీలితమును శ్రీరమణ భగవత్పాద శుభానుగ్రహప్రబోధోచ్చాలితమును, ఉమాస్తోత్రరూపమును, నగు నీమహాకావ్యము - ఉమాసహస్రమను పేరఁ బ్రసిద్ధమగుచున్నది.

"ఉమ - పురాణప్రసిద్ధయు దేశకాలాది పరిచ్ఛిన్నయునగు పార్వతిమాత్రమే కాదు. ఆమె అజరయు, నమరయు, ననిర్వాచ్యయు, నపరిచ్ఛిన్నయునగు పరమేశ్వర మానశక్తి" అని యిందు గ్రుడింపఁ బడుటవలన పరమేశ్వరశక్తియే ఉమ. అను నంశ మిందు స్పష్టీకరింపఁబడినది. ఉమాభిధయగు నామహాశక్తినిగూర్చి రచింపఁ బడిన సహస్ర (వేయి) శ్లోకములను గలిగియుండుటచేత నీమహాకావ్యము 'ఉమా సహస్ర' మగుచున్నది.

స్తోత్రసాహిత్యరూపమగు నీమహాకావ్యమును రచించిన భగవంతుఁడగు వాసిష్ఠగణపతిముని, కావ్యకంఠ పదలాంఛనుఁడు, మహాచార్యుఁడు, తపశ్శాలి. నైష్ఠికశిఖామణియును, మాననీయచరితుఁడునునగు నీమహాశయుని మేధామయియగు జీవితప్రభ-సర్వతోముఖి. కావుననే బహుమార్గములఁ బ్రసరించి ప్రతిమార్గము యొక్కయు నవధినధిగమించినది.

వేదములు, శాస్త్రములు, తపము, జపము, కవిత్వము, అనునవి నిసర్గజ్వలిత మగు నీమహాత్ముని ప్రజ్ఞను సముజ్వలింపఁజేసి జీవితమును సార్థకము నొనర్చినవి. కావుననే రాష్ట్రీయవిషయములు, లోకవార్త, సంఘక్షేమము, ధర్మోద్ధారము, అస్పృశ్యత, ఇత్యాది విషయములం దితనిచిత్తము తగులువడిననుగూడ నందుఁ గొంత కాలమే ప్రసరించి సంఘకైంకర్యముఁజేసి తదుపరి నిరంతరమును జపతపోనిష్ఠమే యగుచుండెడిది.

ఉమాసహస్ర వ్యాఖ్యాతయగు బ్రహ్మశ్రీ కపాలిశాస్త్రిగారిచే నిటీవల నిబంధింపఁబడిన వాసిష్ఠవైభవమను సంస్కృతగ్రంథమునం దీతని చరిత్రాంశము కొంతవిపులముగ నున్నది. అందు ప్రకటింపఁబడని జీవితవిశేషము లింకను గొన్ని కలవని కొందరుమిత్రులు చెప్పుచున్నారు. అవికూడ నేపుణ్యపురుషునిచేనైనఁ బ్రకటింపఁబడుఁగావలెనని యాశించుచున్నాను.

ఆజన్మసిద్ధయు, అసాధారణీయు, లోకోత్తరకవితా ప్రకాశకీయునగు నీతని ప్రతిభ- పాఠకమహాశయుల కించుకైనను గోచరింపఁ గలుగునను నాశయమున నాంధ్ర లిపియందుఁ బ్రకటితమైన ఏతన్మూలమును మహామహోపాధ్యాయ బ్రహ్మశ్రీ కపాలి శాస్త్రిగారిచేఁ బ్రదర్శింపఁబడినరీతి నించుక యనుసరించి శ్రీవాసిష్ఠగణపతిముని చరిత్రాంశము నించించుక స్పృశించుచున్నాను.

ఈమహాకవి జన్మస్థల మాంధ్రరాష్ట్రమునందలి విశాఖపట్టణజిల్లాయందలి బొబ్బిలి సంస్థానమునందున్న 'కలవరాయి' (కుముదోపల.) తత్పూర్వులు చోళదేశీయ కుంభఘోణనగరోపాంతమునందున్న 'వలంగిమాన్' అగ్రహారవాసులు. ఋగ్వేదులు. కౌండిన్యసగోత్రులు. రెండువందల సంవత్సరములక్రిందటనే వారీయాంధ్ర దేశమున కరుదెంచిరి. వీరియింటిపేరు అయ్యలసోమయాజులవారు. ఇతనితండ్రి అయ్యలసోమయాజుల నరసింహశాస్త్రి, సద్గృహస్థుఁడు. కాశీక్షేత్రమునఁ గరిగిన యితనికి దేవతాప్రసాద సూచకమగు నొక దివ్యదర్శనము కలిగెను. అచట నీయన విఘ్నేశ్వరసన్నిధియందుండునపుడు, ఒకశిశువు గణాధిపతి విగ్రహమునుండి యితని సమీపమున కరుదెంచి తిరుగ వెంటనే యావిగ్రహమునం దంతర్హితించెనట.

తరువాత వారణాసినుండి యితఁడు కలవరాయికి రాఁగానే మధ్యమపుత్రుఁడగు నితఁడు జన్మించెను. మఱియు ననేకములగు నిదర్శనములచేత నితఁడు గణపత్యంశ సంజాతుఁడను దృఢనిశ్చయముగల నరసింహశాస్త్రి యితనికి గణపతియను నామము నిడెను.

ఆఱేండ్లవయస్సు వచ్చువఱకు నితనిశరీరము రోగాక్రాంతమై యుండెను. ఆఱవయేడు రాఁగానే నిమిత్తమాత్రమగు చికిత్సావిశేషముచేత రోగనిర్ముక్తుఁడగు నీబాలుని ధీప్రకాశము వెంటనే వ్యక్తమై విలసిల్లుట కారంభించెను. ఏతద్వంశీయులగు పూర్వులవలెనే యితనితండ్రికూడ ఆయుర్వేదమునందును, దైవజ్ఞతంత్రమునందును, తంత్రశాస్త్రమునందునుగూడ విశారదుఁడై యుండెను. శ్రీవిద్యోపాసన ఏతత్కులజుల కులధనము. నానాశాస్త్రజ్ఞమగు వీరికులమున నుదయించిన గణపతిని ప్రాక్తనసంస్కారములవలెనే జ్యోతిషాదివిద్యలుకూడ స్వయముగా వరించినవి. పదవయేటను గణపతి పంచాంగమును గుణించెను. పండ్రెండవయేట మేఘసందేశ కావ్యము ననుసరించి భృంగసందేశకావ్యమును రచించెను.

నిరంతర కవితోపాసకుఁడగు నీబాలకవి పదునాల్గవయేటనే కవితను వశీకరించుకొని, వయోనురూపమును, రమణీయమునునగు కవితౌద్ధత్యమును బ్రదర్శింపఁ దొడఁగెను.

ఓం నమో భగవతే శ్రీ రమణాయ.

శ్రీ భారతీ దేవ్యై నమః.

# శ్రీ గణపతి ముని చరిత్ర సంగ్రహము.

సకలవేద శాస్త్రార్థగర్భితమును, నిగూఢార్థతత్త్వ వివరణచాతురీ సమన్విత మును, అపూర్వవిషయకథనోల్లసితమును, గంభీరభక్తియోగ సమున్మీలితమును శ్రీరమణ భగవత్పాద శుభానుగ్రహప్రబోధోచ్చాలితమును, ఉమాస్తోత్రరూపమును, నగు నీమహాకావ్యము - ఉమాసహస్రమను పేరఁ బ్రసిద్ధమగుచున్నది.

"ఉమ - పురాణప్రసిద్ధయు దేశకాలాది పరిచ్ఛిన్నయునగు పార్వతిమాత్రమే కాదు. ఆమె అజరయు, నమరయు, ననిర్వాచ్యయు, నపరిచ్ఛిన్నయునగు పరమే శ్వర మానశక్తి" అని యిందు గ్రహింపఁ బడుటవలన పరమేశ్వరశక్తియే ఉమ. అను నంశ మిందు స్పష్టీకరింపఁబడినది. ఉమాభిధయగు నామహాశక్తినిగూర్చి రచింపఁ బడిన సహస్ర (వేయి) శ్లోకములను గలిగియుండుటచేత నీమహాకావ్యము 'ఉమా సహస్ర' మగుచున్నది.

స్తోత్రసాహిత్యరూపమగు నీమహాకావ్యమును రచించిన భగవంతుఁడగు వాసిష్ఠగణపతిముని, కావ్యకంఠ పదలాంఛనుఁడు, మహాచార్యుఁడు, తపశ్శాలి. నైష్ఠికశిఖామణియును, మాననీయచరితుఁడునునగు నీమహాశయుని మేధామయియగు జీవితప్రభ-సర్వతోముఖి. కావుననే బహుమార్గములఁ బ్రసరించి ప్రతిమార్గము యొక్కయు నవధినధిగమించినది.

వేదములు, శాస్త్రములు, తపము, జపము, కవిత్వము, అనునవి నిసర్గజ్వలిత మగు నీమహాత్ముని ప్రజ్ఞను సముజ్జ్వలింపఁజేసి జీవితమును సార్థకము నొనర్చినవి. కావుననే రాష్ట్రీయవిషయములు, లోకవార్త, సంఘక్షేమము, ధర్మోద్ధారము, అస్పృశ్యత, ఇత్యాది విషయములం దితనిచిత్తము తగులువడినను గూడ నందుఁ గొంత కాలమే ప్రసరించి సంఘకైంకర్యముఁజేసి తుదపరి నిరంతరమును జపతపోనిష్ఠమే యగుచుండెడిది.

ఉమాసహస్ర వ్యాఖ్యాతయగు బ్రహ్మశ్రీ కపాలిశాస్త్రిగారిచే నిటీవల నిబంధింపఁబడిన వాసిష్ఠవైభవమను సంస్కృతగ్రంథమునం దీతని చరిత్రాంశము కొంతవిపులముగ నున్నది. అందు ప్రకటింపఁబడని జీవితవిశేషము లింకను గొన్ని కలవని కొందరుమిత్రులు చెప్పుచున్నారు. అవికూడ నేపుణ్యపురుషునిచేనైనఁ బ్రక టింపఁబడుఁగావుతమని యాశించుచున్నాను.

ఆజన్మసిద్ధయు, అసాధారణియు, లోకోత్తరకవితా ప్రకాశికయునగు నీతని ప్రతిభ- పాఠకమహాశయుల కించుకైనను గోచరింప వలయునను నాశయమున నాగరిక లిపియందుఁ బ్రకటితమైన ఏతన్మాలికను ఉమాసహస్రమున బ్రహ్మశ్రీ కపాలి శాస్త్రిగారిచేఁ బ్రదర్శింపఁబడినరీతి నించుక యనుసరించి శ్రీవాసిష్ఠగణపతిముని చరిత్రాంశము నించుక స్పృశించుచున్నాను.

ఈమహాకవి జన్మస్థల మాంధ్రరాష్ట్రమునందలి విశాఖపట్టణజిల్లాయందలి బొబ్బిలి సంస్థానమునందున్న ‘కలవరాయి’ (సముద్రోపల.) తత్పూర్వులు చోళదేశీయ కుంభఘోణనగరోప్రాంతమునందున్న ‘వలంగిమాన్’ అగ్రహారవాసులు. ఋగ్వేదులు. కౌండిన్యసగోత్రులు. రెండువందల సంవత్సరములక్రిందటనే వారీయాంధ్ర దేశమున కరుదెంచిరి. వీరియింటిపేరు అయ్యలసోమయాజులవారు. ఇతనితండ్రి అయ్యలసోమయాజుల నరసింహశాస్త్రి, సద్గృహస్థుఁడు. కాశీక్షేత్రమున కరిగిన యితనికి దేవతాప్రసాద సూచకమగు నొక దివ్యదర్శనము కలిగెను. అచట నీయన విఘ్నేశ్వరసన్నిధియందుండునపుడు, ఒకశిశువు గణాధిపతి విగ్రహమునుండి యితని సమీపమున కరుదెంచి తిరుగ వెంటనే యావిగ్రహమునం దంతర్భవించెనట.

తదుపరి వారణాసినుండి యితఁడు కలవరాయికి రాఁగానే మధ్యమపుత్రుఁడగు నితఁడు జన్మించెను. మఱియు ననేకములగు నిదర్శనములచేత నితఁడు గణపత్యంశ సంజాతుఁడను దృఢనిశ్చయముగల నరసింహశాస్త్రి యితనికి గణపతియను నామము నిడెను.

ఆఱేండ్లవయస్సు వచ్చువఱకు నితనిశరీరము రోగాక్రాంతమై యుండెను. ఆఱవయేడు రాఁగానే నిమిత్తమాత్రమగు చికిత్సావిశేషముచేత రోగనిర్ముక్తుఁడగు నీబాలుని ధీప్రకాశము వెంటనే వ్యక్తమై విలసిల్లుట కారంభించెను. ఏతద్వంశీయులగు పూర్వులవలెనే యితనితండ్రికూడ ఆయుర్వేదమునందును, దైవజ్ఞతంత్రమునందును, తంత్రశాస్త్రమునందుకూడ విశారదుఁడై యుండెను. శ్రీవిద్యోపాసన ఏతత్కులజుల కులధనము. నానాశాస్త్రజ్ఞమగు వీరికులమున నుదయించిన గణపతిని ప్రాక్తనసంస్కారములవలెనే జ్యోతిషాదివిద్యలుకూడ స్వయముగా వరించినవి. పదవయేటను గణపతి పంచాంగమును గుణించెను. పండ్రెండవయేట మేఘసందేశ కావ్యము ననుసరించి భృంగసందేశకావ్యమును రచించెను.

నిరంతర కవితోపాసకుఁడగు నీబాలకవి పదునాల్గవయేటనే కవితను వశీకరించుకొని, వయోనురూపమును, రమణీయమునునగు కవితౌద్ధత్యమును బ్రదర్శింపఁ దొడఁగెను.

ఆనాటి పద్యము నొకదానిని జూడుడు

ఇహ కేషాంచి దేషా చేన్న సన్తోషాయ కా క్షతిః
కిమానన్దాయ కాకానాం బాలకోకిల కాకలీ॥

బాలకోకిల కాకలి— కాకుల కానందదాయికము కాకున్నను నాయీకవిత కొందఱు లోకులకు, సంతోషదాయకము కానిచో మాకు లోపమేదియును లేదు. కావ్యాభ్యాసమును ముగించి, వ్యాకరణ - అలంకారములను నేర్చుకొనుచుండు నపుడే, వాల్మీకి - వ్యాసుల, రామాయణ - మహాభారతములను సవిమర్శముగఁ దిలకించెను. మహాభారతమును మాత్రము పలుసారులు పఠించెను. తత్పఠనము చేతనే యీ బాలకవి ధీవిశేషము సువ్యక్తమయ్యెను. అప్పటికే యీతనికి వివాహమయ్యెను. తపస్సే సర్వమును సాధించునను దృఢనిశ్చయమున, మహత్త్వము నభిలషించి, తపోభిలాషియగు నితఁడు తండ్రియనుమతిఁగొని తీర్థయాత్ర నొనర్చుట కారంభించెను.

పదునెనిమిదియేండ్ల యీడుగల యీకవికుమారుఁడు భువనేశ్వరము మొదలగు క్షేత్రములకరిగి తపస్సు నొనర్చుచుండెను. తదుపరి కాశీక్షేత్రమునందు విశ్రుతపాండిత్యులగు శివకుమార పండితులతోడి పరిచయభాగ్య మీతనికిఁ గలిగెను. గౌడ (వంగ) దేశమున విఖ్యాతమగు నవద్వీపనగరమున పాండిత్య పరీక్షకై పండితసభ జరుగునని విని సుహృత్ప్రేరణమున శివకుమారపండితదత్తమును, పరీక్షాప్రవేశ లాభసమభ్యర్థన పరమును, నగు పత్రమునుగొని నవద్వీపమున కరిగెను.

అచట పరిషత్ కార్యనిర్వాహకుఁడగు శితికంఠవాచస్పతి కాపత్రము నొసఁగెను. పత్రికచివరను లిఖింపఁబడిన 'దేవాసురసమీకేషు బహుశోదృష్టవిక్రమః' అను హనుమత్కీర్తన పరమగు రామాయణ శ్లోకార్థమును సమీక్షించి తృప్తుఁడయిన వాచస్పతి మిశ్రుఁడీతనికి పరీక్షాప్రవేశమునకై యనుమతినొసంగెను.

పరిషద్ - దివసము - వచ్చెను.

ఏకవింశతి వర్ష వయస్కుఁడగు మన యువకవి శరీరముచేఁ గృశించియున్నను, సాహితీసంపదచే బలిసియుండెను. కావుననే లోకమునంతను తృణీకరించుచున్నట్లున్న దీప్తదృష్టులతోఁగూడ సభాభవనమునఁ బ్రవేశించెను.

అందు సముపవిష్టుఁడును, గంభీరాకృతియునగు నొక వృద్ధపండితుని జూచి పార్శ్వవర్తిని బిలిచి

"ఈమహాశయుఁ డెవఁడు"

అని యడిగెను.

ఆతఁడే పరీక్షకుఁడు - ఆశుకవి, అంబికాదత్తుడు. కావున నాపశ్నము నాలకించి తానే ప్రశ్నోత్తరమును జెప్పుమిషతో పరీక్ష కారంభించెను.

ఆబాల్యసిద్ధకవితాస్ఫురి విలసితుఁడగు నీతనిమహానుభావము నావిష్కరించు నీకథాఘట్టము నొకించుక నివేదింతును.

అంబికాదత్తుఁడు :—

సత్వరకవితాసవితా గౌడోహం కశ్చిదమ్బికాదత్తః

(నేనాశుకవితాజనకుఁడను (సూర్యుఁడను) గౌడుఁడను నాపేరు అంబికాదత్తుఁడు

గణపతి:—

గణపతి రితికవికులపతి రతిదక్షో దాక్షిణాత్యోహమ్॥

(నేను కవికులమున కధిపతిని. అతిదక్షుఁడను, దాక్షిణాత్యుఁడను, నన్ను గణపతి యని పిలుతురు.)

అని పద్యమును బూరించి—

'నీవు అంబికకు దత్తుఁడవు మాత్రమే. నేనో ఔరసుఁడను.' అని చమత్కరించెను.

విశే: - నీవు దత్తపుత్రుఁడవు. నేను - అంబికాసంభవుఁడను, అని భావము. అంబికాదత్తుని పద్యమున "కవితాసవితా" అనుచోటనుమాత్రమే శబ్దాలంకారము గలదు.

గణపతిపద్యమున పతిరితి, పతిరతి, దక్షోదాక్షి, అనుచోట్ల శబ్దాలంకారములు గలవు.

తరువాత పరీక్ష - ఉపక్రమింపఁబడియెను. పద్యపూరణమునకై కొన్ని సమస్య లీయఁబడినవి. వానిలో రెంటినిమాత్రము ప్రదర్శించి గణపతికల్పితములగు పూరణములను నివేదించెదను.

(1) స్తనవస్త్రం పరిత్యజ్య వధూః శ్వశురమిచ్ఛతి (కిం త్వనవద్యచరితా)
కోడలు పయ్యెదనువిడిచి మామను గోరుచున్నది,
(కులటకాదు)

(2) పిపీలికా చుమ్బతి చన్ద్రమణ్డలమ్.
చీమ-చంద్రమండలమును స్పృశించుచున్నది.
గణపతి యిందు మొదటిదాని నిట్లుపూరించెను.

(1) హిడిమ్బా భీమదయితా నిదాఘే ఘర్మపీడితా (స్తన)
భీమదయితయగుటవలన కోడలగు హిడింబ, వేసవియందు స్వేదపీడితయగుటవలన పయ్యెదను తొలఁగించి, వాయువును (మామను) గోరుచున్నది.
రెండవసమస్య నిట్లు పూరించెను.

శ్లో॥ సతీవియోగేన విషణ్ణచేతసః
ప్రభోర్నిషణ్ణస్య హిమాలయే గిరౌ
శివస్య చూడాకలితం సుధాశయా
పిపీలికా చుమ్బతి చన్ద్రమండలమ్॥

సతీవియోగమున విషాదమునొందిన మనస్సుగలవాడును, హిమాలయపర్వతమునందు గూర్చుండియున్నవాడును, ప్రభువగు శివుని శీర్షమునందున్న చంద్రమండలము నొకచీమ - అమృతమునందలి యాశచేత స్పృశించుచున్నది.

ఇట్టి శీఘ్రముగు సమస్యాపూరణమున నిరర్గళకవితాధారచే విద్వత్సమాజమును సమ్మోహింపఁజేసి,

తరువాత

పరీక్షకులొసంగిన శ్లోకములను- అద్భుతమగు గీర్వాణ వాగ్వీర్యామృతము నావిష్కరించుచు, వ్యాఖ్యానించి, సభాసదుల హృదయములను రసార్ద్రములనొనర్చెను.

తదుపరి సంవాదమున నొకరివాక్యాలయం దగుదోషముల నింకొకరధిక్షేపించుచు, పరీక్షక - పరీక్షిష్యమాణులిరువురును సభ్యులకు సాహితీవినోదమును సంఘటించి, పిదప శాంతించిరి. పిమ్మట నచటి విద్వత్ పరిషత్తుచే నీమహాకవికి కావ్యకంఠోపహారయుక్తమగు క్రింది ప్రశంసాపత్ర మీయఁబడెను.

## —॥ ప్ర శం సా ప త్ర మ్ ॥—

శ్రీమద్గణపతి శాస్త్రిన్!

సంసారే ఖల్వస్మిన్ కవిత్వమిత్యసముద్ర సముత్థమమృతమ్। సుదుర్లభంచ తత్ లోకాధిక సౌభాగ్యవశాత్ సుప్రసన్న దైవానుకమ్పయా వా, యః కశ్చిదిహ సమధిగచ్ఛతే, స చభూస్తోపి స్వర్గీయ ఇతి సస్పృహ మాలోక్యమానో గుణపక్షపాతిభి ర్విద్వద్భిర్నితరామాద్రియతే. అతో యదద్య శ్రీమద్భిరసాధారణ కవిత్వమిహ ప్రకటయ్య, సుధియః, సర్వే, సన్తోష మాపాదితాః. తేనైవ చరితార్థా నవద్వీపవాసినః కోవిదా వయమశేష గుణధామ్నే విశాఖపట్టణ ప్రదేశాన్తర్గత "కలవరాయి" గ్రామవసతయే శ్రీమద్ గణపతిశాస్త్రిణే తుభ్యమాశీర్వాద పూర్వక మిమం శ్లోకముపహరామః॥

ప్రాచీనైస్తైః కవికులవరైః కాలిదాసాదిభిర్యా
లబ్ధాకీర్తి ర్భవదనుగతా సైవభూయా దిదానీమ్।
సద్భిర్దత్తో యఇహరుచిరః కావ్యకణ్ఠోపహారః
తేన [illegible] ||

౧౮౫౩ శకాబ్దీయ సౌరజ్యేష్ఠస్యాష్టమదివసే
శ్రీయుత రాజకృష్ణ తర్క పఞ్చాననః.

ఈ యుపహార పత్రముక్రింద పదునాల్గురు పండితుల స్వహస్త లిఖితములగు నామములు కాన్పించుచున్నవి.

ఇరువది మొదవయేడు రాఁగానే ద్రవిడదేశమునకు వెళ్ళి అయిదాఱేండ్లు యాత్రలను సేవించెను. మొదట కాంచీక్షేత్రమును సేవించి యచటనుండి అరుణాచలక్షేత్రమున కరిగెను. అచ్చట నొకసంవత్సర ముండెను. అచటనున్నప్పుడు ఆ యరుణాద్రియందు వసించిన బ్రాహ్మణస్వామిని ప్రసంగవశమున రెండుమారులు వీక్షించెను. తరువరి, అరుణాచలమునుండి వెడలి తత్సమీపప్రదేశములందుఁ గొంతకాల ముండెను. తరువాత ద్రవిడక్షేత్రములకు వెళ్ళుచు అచ్చట నచ్చట, పండితగోష్ఠులయందును, ఆస్థానపరిషత్తులయందును తన యష్టావధాన నైపుణిని బ్రదర్శించెను. ఈ కాలమునందే "అగ్నిమీళే" అను మంత్రము నుండి "సుసహాసతి" అనునంతవఱకునుగల ఋగ్వేదమును స్వరయుక్తముగ నధ్యయనమునొనర్చి, సాయణీయమగు భాష్యమునుగూడ సమాలోకించెను. మఱియును తపఃప్రభావమువలన గూఢములగు మాంత్రవర్ణికభావముల నాకళించి, గహనములగు దేవతాతత్త్వములనుగుఱించి, సహృదయులగు నంతేవాసులకు నిరూపింపసాగెను. జైమినీయ తర్కవార్తికము మొదలగు శాస్త్రగ్రంథములను తరువాతనే రచించెను. ఈసమయమునందే యీమహానుభావుని ప్రభావము బహుముఖముల విజృంభించెను. భగవంతుఁడగు రమణమహర్షి యొక్క కరుణాకటాక్షమున కాస్పదము గూడనయ్యెను. స్వయముగా ననేకులగుశిష్యులకు మంత్రదీక్ష నొసగెను.

ఒకానొకప్పుడు జరుపఁబడిన యష్టావధానమున గంటకొక శతకము నిర్మింపవలసియుండ నాఱు నిమిషములకాలమునందే యిరువదియైదు పద్యములను రచించెను. లేఖకులుకూడ లిఖింపశక్తులుకారైరి. కీర్తిశేషుఁడును మహాశయుఁడునగు వి. కృష్ణస్వామ్యార్యుఁడు అదృష్టపూర్వమగు నావాగ్విక్రమము నాలోకించి ఆశ్చర్యపరవశుఁడై ఈమహాకవిని బహువిధముల బహుమానించెను.

క్రీ॥ శ॥ 1907 సంవత్సరమునకు ముందే యష్టావధానక్రీడను ముగించిన యీతనిచిత్తము గాఢతపఃపరతంత్రమయ్యెను.

అవధానములయందీ కవిసార్వభౌముఁడా యాసభలయందు రచించినపద్యములయందు ఖండకావ్యములు రెండును, ఒక (తత్త్వ) ఘంటాశతకమును లభ్యములై సురక్షితములగుచున్నవి. ఇది కవి వైభవఘట్టము.

# X

—♦ భగవంతుఁడగు రమణమహర్షి దర్శనము – ఉపదేశలాభము ♦—

క్రీ. శ. 1907 సంవత్సరమున నీయాచార్యుఁడు – అరుణాచల క్షేత్రమునఁ దపస్సొనర్చుచుండెను. ఇట్లుండ నొకదినమున నితనిచిత్తము సంశయార్తమ్ము వలె నొకముహూర్తము మాత్రము చలితమయ్యెను.

“బాల్యమునుండియు శతలక్షసంఖ్యాకమగు జపమున పంచాక్షర పురశ్చర్యనొనర్చితిని. స్త్రీ విద్యాద్యములగు మంత్రములను జపించితిని. ఏకవారాశన – ఉపవాసాది కృచ్ఛ్రవ్రతముల నాచరించితిని. అయిన నింతకజకును భగవంతుఁడు ప్రసన్నుఁడు కాకున్నాఁడు. శాస్త్రములు స్పష్టపడఁగానేరవు. నేనొనర్చుచున్న సాధనవిధానమునందేదయిన లోపముండి యుండవలయును. ఏమిచేయుదును? అయ్యో! వేదశాస్త్రపురాణేతిహాసములను చక్కఁగ విచారించినను శ్రద్ధావంతుఁడనైననుగూడ నాకు తపస్స్వరూపమే తెలియదయ్యెనే” అని ధ్యానించుచుండ నితనికి ప్రజ్వలితమగు నొకానొక ధీవిశేషముదయించెను.

“ఈ యరుణాద్రియందుఁగల గుహలోనున్న బ్రాహ్మణస్వామి బహుకాలమునుండియు మౌనమవలంబించి, తీవ్రతపఃపరతంత్రుఁడై యున్నాఁడు. ఆతనికి తపస్స్వరూపము తెలిసియేయుండవచ్చును. కావున నిప్పుడే యాతనిని సందర్శించి యడుగుదును” అని తత్క్షణమే జపమునొనర్చుచున్న స్థలమునుండి బయలువెడలెను.

అది – సోమవారము కార్తిక శుద్ధ చతుర్దశీదివసము. (క్రీ॥ శ. 18 11–1907). రవి–ఆకాశమధ్యమునుదాఁటి రెండుగడియలు పశ్చిమాభిముఖముగఁ బయనించెను.

కవి — పర్వతము నారోహించి, గుహకువెలుపల సముపవిష్టుఁడయిన బ్రాహ్మణస్వామి నవలోకించెను.

అది – అరుణాచలమున కృత్తికోత్సవము జరుగురోజులు– ఆయుత్సవదివసములయందు బ్రాహ్మణస్వామి నివసించిన ప్రదేశముగూడ జనసంకులమై యుండెడిది. కాని యీదినమునందుమాత్రము నిర్మానుష్యమై యుండెను. దైవమనుకూలమనితలంచి, ధైర్యమునవలంబించి, యుత్సాహవంతుఁడగు నీయాచార్యుఁడు ఆస్వామి సన్నిధికి వినయముతోనరిగెను. సమీక్షించినవెంటనే సమీపమునకువెళ్ళి ఆమౌనీంద్రుని దక్షిణచరణమును దక్షిణహస్తముతోడను వామచరణమును వామహస్తముతోడను పట్టుకొని, సాష్టాంగప్రణామమునొనరించి. యిట్లు విజ్ఞాపించెను.

‘గీ॥ తపము – బహుళశ్చరితము. శాస్త్రములు – అధీత
ములు. మహామంత్రములు – జప్తములు. తపస్స్వ
రూప మెఱుఁగ నట్లుంటి, తద్రూప మెఱుఁగు
దీవు, ననుసత్కృపననుగ్రహింపుమయ్య!

సర్వమును పరీక్షగాఁ జూచు నా మునిపుంగవుఁ డప్పుడు 'ఇతఁడు ఆంధ్రుఁడు, విద్వాంసుఁడు, కావ్యకంఠగణపతిశాస్త్రి' అని గుర్తించెను. రెండు మూఁడు సంవత్సరములకు ముందిచట నీయాచార్యుఁడు నివసించియున్నపుడు రెండుమార్లు మౌనస్వామిని దర్శించియుండెను, అప్పుడొకసారి 'శుక్లాంబరధరమ్' అను గణపతి ధ్యానశ్లోకమును ఈ బ్రాహ్మణస్వామి పరముగ వ్యాఖ్యానించియుండెను. ఈయంశమును ఆగుహావాసి యప్పుడు స్మరించెను. ఆ కాలమునందే 'హరసహస్రి' యను పేరుగల స్తోత్రమును రచించి, అరుణాచలేశ్వరుని సన్నిధియందు గానమొనర్చిన యీ కావ్యకంఠుని మధురవిచిత్రమగు వాణీవిహారము తత్క్షేత్రవాసులకు పూర్వపరిచితమే యగుటవలన నాబాలవృద్ధమగు నచటిజనమంతయు నతని కావ్యవైభవమును గీర్తించుచుండెడిది.

ఇట్లు గుర్తించిన పిమ్మట

చాలకాలమునుండియు, అంతర్బహిర్మౌనియగు స్వామి కొంతకాలము కరుణార్ద్రదృష్టిసేచనమున నితని ననుగ్రహించుచు నట్లే చూచుచుండెను. తరువాత నీయుభయుల జీవితములకునుగూడ నూతనాధ్యాయమును సంప్రవర్తింపఁజేయునది, యగు ఉపదేశభారతి – కావ్యకంఠునికొఱకు ముక్తకంఠకవాటమై మౌని సార్వభౌముని హృదయమునుండి ద్రవిడభాషారూపమున బయలువెడలెను. దానిసంస్కృతానువాదమున కిది యాంధ్రానువాదము.

'నేను, నేను' అనునది (స్మృతి) యెక్కడనుండి యుదయించును, అనివిచారించుచు, (మనస్సు) పుట్టినచోట లీనమగును. అదియే తపము. 'జపింపఁబడుచున్న మంత్రముయొక్క ధ్వని యెచ్చటనుండి పుట్టుచున్నది' అని విచారించినయెడల (మనస్సు) అది పుట్టినచోట లయమునొందును. అదియే తపము.

ఈ గురూపదేశమును తరువాత నీకవి

'అహమితిస్మృతిః క్వనువిభాసతే

ఇదమనుస్మరన్త్సపది లీయతే'

అనుగీతమున నిబంధించెను.

ఈయుపదేశమును గ్రహించి సంతృప్తుఁడగు మహాకవి యానందమగ్నుఁడై యిప్పుడు బాహ్యమౌనము నుడిగియున్న స్వగురువగు బ్రాహ్మణస్వామియొక్క ప్రత్యగ్రలబ్ధములగు పాదపద్మములయొద్ద కొన్నిగడియలవఱకు ధ్యాననిష్ఠయందుండిలేచి బయలుదేరెను. వెడలుచున్నప్పుడు పార్శ్వవర్తియగు నొకపురుషుని 'ఈతని నామధేయమేమి' అని యడిగెను. పూర్వాశ్రమమునం దితనిపేరు "వేంకటరామార్యుఁడు" అని యతఁడొసగిన ప్రత్యుత్తరమును విని సంక్షేపరమణీయమగు రమణనామమును వినిర్మించెను. మఱియు "ఇతఁడు – పరతత్త్వమును జూచిన గొప్పమహర్షి" అని తన యనుచరవర్గమునకుఁ దెలియఁజేసెను.

ఆనాటినుండియే "రమణమహర్షి" అను ప్రసిద్ధి ప్రపంచమునఁ బ్రసరించి వెలయుచున్నది.

తరువాత దేవీప్రసాదమువలననే సిద్ధుఁడగు గురువు లభించెనని కృతజ్ఞుఁడై భక్తిపరవశతనొంది దేవిని కీర్తించిన పద్యసహస్రముచేత "ఉమాసహస్రము" అను నీస్తోత్రకావ్యమును రచించెను. ఆచార్యుఁడగు నితఁడు ఇరువది దినములకు సమాప్తి నొందింపవలయునను వ్రతముధరించి యీగ్రంథరచన నారంభించెను. కానియిరువదవనాటికి రెండువందలకంటె నెక్కువపద్యములు రచింపవలసినవి మిగిలియుండెను.

గణపతిమహాకవి ఆనాటిరాత్రి ముహూర్తద్వయము దాటినపిదప అరుణాచలాంకమున ఆశ్రమగుహకు వెలుపల – స్వగురువగు మహర్షి సన్నిధియందు సముపవిష్టుఁడై పద్యరచన నారంభించెను. నలుగురుశిష్యులు వానిని వ్రాయఁదొడఁగిరి. అర్ధరాత్రమగుసరికి పద్యరచన ముగిసెను. అచట నిమీలితనేత్రుఁడైయున్న భగవంతుఁడు మహర్షి వెంటనే ఉన్మీలితనేత్రుఁడై 'నేను పలికినదంతయు వ్రాయఁబడియెనా!' అని యడిగెను. మహర్షి కావించిన యీప్రశ్న ఆచార్యునకును, తదితరులకునుగూడ నాశ్చర్యమును గలిగించెను. "కరుణామూర్తియగు రమణభగవానుఁడు ఆగారమగు నంతస్థ్సానమునుండి యప్పుడేనిర్గమించి బాహ్యాంతర్భువనములకుఁగల భేదమునుజూపక యిట్లనుచున్నాఁడు. ఈమహర్షి యనుగ్రహము వలననే ప్రేరితమగు దివ్యావేశమే అర్ధరాత్రమగులోపలనే గ్రంథసమాప్తి యగుటకు కారణమయినది' అని భగవత్ప్రశ్నయొక్క భావము నెఱిఁగి అంతేవాసియగు గణపతి "చిత్తము" భవదనుగృహీతమునంతయు గ్రహించి యిప్పుడీగ్రంథమును సమాప్తినొందించితిని. అని యుత్తరమునొసఁగెను. కావుననె మొదట ప్లవంగిసంవత్సరమున నిబంధింపఁబడిన, ఉమాసహస్రము చివరను లిఖింపఁబడిన శ్లోకములయందు

ఈ యంశమును, రచనాకాలమును, నిట్లు తెలుపఁబడినది.

శ్లో. "యదస్య మహతః కాలే, పారంయాతోఽస్మి కర్మణః।
అనుగ్రహోఽయమాచార్య రమణస్య మహాత్మనః"॥
ప్లవఙ్గే కార్తికేకృష్ణే, షష్ఠ్యాం మఙ్గలవాసరే
స్తోత్రమేతత్ సమారబ్ధం తటేశోణధరాభృతః॥
ఏకాదశ్యాం శుక్లపక్షే, మార్గశీర్షే రవేర్దినే
నీతం సమాప్తిం వింశత్యాదినానాం వృత్తినామయా॥

(పావనమగు నీగ్రంథమును కాలాంతరములయందేడు మార్లకవికులేశ్వరుఁడు సంస్కరించెను.)

తదుపరి నచటఁ గొన్నినాళ్ళుండి తదితరక్షేత్రముల కరుగఁగోరి "అహం మూలాన్వేషణమే" ఇష్టార్థసిద్ధ్యుపాయమను నంశమును మహర్షివలనఁ దెలిసికొని, బయలువెడలి దక్షిణదేశమున కన్యాకుమారీక్షేత్రమువఱకునుగల తీర్థములకువెళ్ళి ఆయా దేవతామూర్తులను స్తోత్రమొనర్చెను. పశ్చిమసముద్రతీరమునందున్న గోకర్ణమునందుఁ గొంతకాలముండెను. మంత్రసాధనమున నచట భువనేశ్వరి నారా

ధించెను. అచ్చటనే స్వప్నమున ఒకానొక స్త్రీకన్యకౌ యితనిజిహ్వయందు మధువునుంచి యంతర్ధానము నొందెనట! అటుపిమ్మటనే తనకు కవిత్వశక్తియయ్యె నని యీయాచార్యుడు శిష్యులకు దెలిపెను.

ఆంధ్రోత్కల మధ్యమునందున్న మహేంద్రపర్వతమున నడిమివయస్సున తప మొనర్చెను. మరల నరుణాచలమునకువచ్చి భగవత్సన్నిధియందు జాలకాలముం డెను. అచ్చటనే గొప్పదగు యోగానుభవములను సంపాదించెను.

అచ్చటనే యాశ్రమగుహయందు తపస్సొనర్చుచుండ నీమహానుభావుని శీర్షకపాలములు శిరోగ్రంధిభేదముచేత భిన్నములయ్యెను.

తరువాత- ఇతనిజీవితముయొక్క- అపరార్ధము- ఋగ్వేదార్థవిచారాదికముచే గృతార్థత నొందెను.

ఈ యాచార్యుడు పూర్వోత్తర మీమాంసావిమర్శము నొనరించుచు గ్రంథ ములను నిబంధించెను. జ్యోతిషాయుర్వేద తంత్రశాస్త్రీయములగు గ్రంథములను గూడ రచించెను. చరిత్ర విమర్శనిపుణుడగు నితడు "భారతసంగ్రహము" అను విమర్శగ్రంథమును అత్యంతసరళమగు రీతితో రచించెను. పూర్ణాఖ్యమగు నొక కథను సర్వగుణశోభితము, హృద్యము నగునటుల (సాంధ్ర) భాష నాశ్రయించి నిబంధించెను. మఱియు ఉమాశతకము, శివశతకము, ఇంద్రాణీ సప్తశతి, ప్రచండ చండీత్రిశతి, అగ్నివాయ్వాదిగీతమాల, ఇత్యాది స్తోత్ర కావ్యములను రచించెను.

ఆచార్యుడగు గణపతి - గణాధిపతియొక్క యంశమున తానుజనించినట్లుస్వయ ముగానె ఉమాసహస్రమునందును, తదితరగ్రంథములందునుగూడ చెప్పియున్నాడు.

ఆంధ్రభాషానువాద సహితమగు నీగ్రంథమును ప్రకటించుచున్న బ్రహ్మశ్రీ వేమల రామమూర్తి ప్రభృతులచేత ఖడ్గపుర సమీపమునందలి "నింపూరాలో" నిర్మింపబడిన ఆశ్రమమున నివసించుచు తనచరమదశయందీయాచార్యుడు శిష్యుల ననుగ్రహించుచుండెను.

అతిమానుష వాగ్వైభవసమృద్ధుడు, బహువిద్యావిలాసి, తపోధనుడు - ఆచార్యుడు - ముని, భగవంతుడు వాసిష్ఠగణపతి, నిజవిజ్ఞాన విలాసలాంఛనము లను తన భక్తబృందమునందును, గద్యపద్యాత్మకమగు వాఙ్మయమునందును, నిలిపి ధాతృసంవత్సర శ్రావణ శుద్ధ సప్తమీ (15-7-1936, దివసమున నింపూరానుండి స్వస్థానమున కరిగెను. ఉమాసహస్రస్థితమగు నొకపద్యమున గణపతి జయవాదమును బ్రకటించుచు నీయంశము నింతటితో విరమించెదను.

శ్లో. జయతు భరతక్షోణీఖణ్డం విషాద వివర్జితమ్
జయతు గణపస్తస్య క్షేమం విధాతుమనాముని:
జయతు రమణస్తస్యాచార్యో మహర్షికులాచలో
జయతు చ తయోర్మాతా పూతా మహేశవిలాసినీ.

(ఉమా 34 స్త 24 శ్లో)

ఓంనమో భగవతే శ్రీరమణాయ

ఉమాసహస్రము నందలి 2, 3, 4. శతకములను (అనగా300 శ్లోకములను) ద్వితీయ భాగముగా ముద్రింపించుటకు తోడుపడిన

# భక్తమహాశయుల నామావళి

| సంఖ్య | చందాదారుని పేరు | ఊరి పేరు |
|---|---|---|
| 1. | మహారాజశ్రీ వేదుల రామమూర్తి పంతులుగారు | తగరంపూడి |
| 2. | ,, చేంబోలు శ్రీరామశాస్త్రిగారు | స్టేషన్ మాస్టర్, మండలా |
| 3. | ,, చేంబోలు సూర్యనారాయణ శాస్త్రిగారు | డిటో లాంమటా |
| 4. | ,, చెల్లపిల్ల గుంపస్వామిగారు | ,, కటంగీ |
| 5. | ,, వడ్లమాని రామసుబ్రహ్మణ్యంగారు | ,, తలోడి |
| 6. | ,, గోవిందు అనంతపద్మనాభంగారు | ,, మూలు |
| 7. | ,, అక్కినపల్లి జోగారావుగారు | ,, వాడెగామ్ |
| 8. | ,, బులుసు వెంకటరామ కృష్ణారావుగారు | ,, ఘన్‌సోరు |
| 9. | ,, జడితల ముఖ్యప్రాణమూర్తి రావుగారు | ,, సోవంగీ |
| 10. | ,, ధవళ సన్యాసిరావునాయుడుగారు | ,, నైనాపూరు(రిలీవింగు |
| 11. | ,, కె. బుచ్చిరెడ్డి నాయుడుగారు | ,, పెంద్రై |
| 12. | ,, కాసిరెడ్డి రామారావు నాయుడుగారు | అసిస్టెంటుస్టేషన్ మాష్టరు ఉమరానల్లా |
| 13. | ,, పంతుల విశ్వనాధరావు పంతులుగారు | డిటో సోవంగీ |

ఓం నమో భగవతే శ్రీరమణాయ.

# విజ్ఞాపిక

ఉమాసహస్రము – శ్రీమద్గణపతిముని కావ్యకంఠసముద్గీతము. ఈ స్తోత్ర సాహిత్యప్రబంధము – వైదికవిజ్ఞాన సమలంకృతము. వివిధదర్శనగర్భితము. లలిత మధుర సమర్థపద గుంఫితము.

శ్రీ గణపతి మునిశిష్యులును, నాకు బంధువులును, భక్తులును అగు బ్రహ్మశ్రీ వేదుల రామమూర్తి మహాశయుల నిరంతరమగు ప్రోత్సాహమువలనను, అపూర్వమగు నీపవిత్రగ్రంథమునందలి గౌరవమువలనను, నాయసమర్థతను గణింపక, ఏతదనువాద మహాకార్యభారమును వహించుటకు నిమిత్తమాత్రుడను కావలసివచ్చినది. శ్రీ స్వభాను నామ సంవత్సరమున శ్రావణ శుద్ధ పంచమీ శుభదివసమున (1943 సం) ఏతదాంధ్రీకరణమునకు ప్రారంభించి ఒక నెలదినములలో విందలి మొదటిశతకమును మాత్రము ముగించితిని. మూలశ్లోకములను ఆంధ్రపద్యరూపమున ఆంధ్రీకరించి శ్రీ T. V. కపాలిశాస్త్రి మహాశయులు రచించిన ప్రభా వ్యాఖ్యానము ననుసరించి ఆంధ్రవ్యాఖ్యా వివరణములను సంఘటించితిని. తదుపరి మూడేండ్లు గడచిన పిమ్మట 8-5-1946 తేదీని తిరువణ్ణామలైయందు (అరుణాచలమునందు) కృపాసముద్రుడును శాంతిపూర్ణుడును భక్తజనపరివేష్టితుడును అగు భగవంతుడు శ్రీరమణ మహర్షిని సందర్శించి తత్కటాక్షమున అశ్రుప్రచలితమై వెనువెంటనే విలిఖితమగు పద్యవింశతిని (ఆత్మాభీష్టనివేదనమును) శ్రీవారిసన్నిధిని పఠించి సమర్పించితిని. భక్తమిత్రుల యభిమతము ననుసరించి దానినిందు ప్రకటించితిని. ఆనాడు సాయంకాలమున శ్రీరమణ భగవానుడు నాయందు కటాక్షించి అనూదితమును, ఆంధ్రపద్యరూపమును, అగు ఉమాసహస్రమునందలి ప్రథమశతకమును, దాని సంస్కృత మూలమునుగూడ సమగ్రముగా విని యామోదించి నన్ననుగ్రహించెను. ద్వితీయదివసమున శ్రీమదరుణాచలేశ్వరుని సందర్శించుకొని ఆనాటిసాయంకాలమున 1939లో ఆంధ్రీకృతమై అముద్రితమగు "అధ్యాత్మోపనిషత్తును" శ్రీ భగవానునికి వినిపించి– తదామోదభాగ్యమును బడసితిని. తరువాతనే అది ముద్రితమయినది. తృతీయదినమున గేయానువాదమగు "వేదాంతడిండిమమును" ఆంధ్రధ్వన్యాలోకమునందలి "బ్రాహ్మీవరివస్యాంజలిని" శ్రీరమణభగవానుడు

విని- కటాక్షించెను. మూడవనాటిరాత్రి అరుణాచలమునుండి చిదంబరము వెళ్ళి శ్రీ నటరాజస్వామిని సందర్శించి విజయనగరమునకు వెళ్ళఁగోరిన నేను- తదాదేశబలమున నాకు తెలియకుండగనే పాండిచ్చేరికిఁగూడ వెళ్ళి శ్రీగణపతి మునిశిష్యులును ఉమాసహస్ర వ్యాఖ్యాతలునగు శ్రీ టి. వి. కపాలిశాస్త్రి గారికిఁగూడ ఈగ్రంథమును వినిపించి వారియామోదమునుగూడ బడయఁగలిగితిని. అదియిందు ప్రకటితము. తదుపరి భగవదిచ్ఛా ప్రసాదబలమువలన తిరుగ అరుణాచలమునకు వచ్చి శ్రీరమణ భగవానుని సందర్శించితిని. ఆపవిత్ర దినమున తత్కటాక్షప్రసాదప్రసారమహిమమున తిరుగ శ్రీభగవానుని దివ్యసన్నిధియందు 2 గం. కాలము ఉపన్యసించుటయు 1 గం॥ కాలము సంస్కృతాంధ్రములయందు ఆశుధారారూపమున పద్యరచనము నొనర్చుటయూ, సంభవించెను. కాని ఆపద్యములకు పారమార్థికాక్షరస్వరూపమే కలిగినదికాని లౌకికాక్షరస్వరూపము కలిగినది కాదు. తరువాత శ్రీరమణ భగవానుఁడు నేనర్థించిన "ఉపదేశాక్షరమును" గూడ సంస్కృతాంధ్రద్రవిడభాషా పద్యరూపమున ప్రసాదించి- నన్ను కృతార్థునొనర్చెను. ప్రశ్నోత్తరరూపమగు నీక్రింది పద్యమునదానియందలి యర్థమును నిబంధించితిని.

**"స్వామీ! అక్షరమొండొనంగు, ముపదేశశ్రీ స్వరూపమ్ము నా,**
**కేమీ సర్వము నీవెఱుంగుదువు నీకింకేటి కర్థింపఁగా;**
**నేమూఢుండ నెఱుంగనేమియును, తండ్రీ! అక్షరమ్మీవె; వ్యా**
**ర్థామస్థుండవు, దానివ్రాయఁగలవే? "ధన్యోఽస్మి ధన్యోఽస్మ్యహమ్॥"**

తదుపరి స్వగ్రామమగు చిట్టాయవలస వెళ్ళి- ఇందు ప్రకటింపఁబడిన కృతిసమర్పణమును - గురుదేవ ప్రార్థనమును|- నాకొదవిన శ్రీరమణాశ్రమానుభూతిని స్మరించునదియగు క్రిందిపద్యమును- గూడ శ్రీభగవానునికి నివేదించుకొంటిని.

"అమృతశీతల తాపహారి శాంతి తరంగ
ములు పొంగె (అందు) సకలాంగములు మునింగె
ప్రణవమంత్ర విశిష్టపావన శ్రుతిపాత
శబ్దంబు నిగిడె- నిశ్చలత నెగడె
విమలహృద్వనజ భక్త, మునీంద్ర, యోగి, సం
గత్వమ్మొలసె - ఆసంగత్వమెలసె
బ్రహ్మవిత్ ప్రభు, సరూపబ్రహ్మ, రమణ ద
ర్శనమబ్బె - పారవశ్యమెద ప్రబల్బె

సత్కటాక్షమొప్పలెసె- యోగశక్తి వెలసె
అక్షరాత్మోపదేశ భాగ్యానుభూతి
గలిగె అపుడే నెవండనో తెలియనైతి
నశ్రమంబగు శ్రీరమణాశ్రమమున.''

అటుపిమ్మట శ్రీరమణానుగ్రహమున ఏతద్గ్రంథ సర్వస్వామ్యముగల ‘శిరసి’వకీలును, శ్రీవాసిష్ఠముని ప్రవరానుచరాగ్రగణ్యులును అగు శ్రీయుత డి. యస్. విశ్వామిత్రగారిని శ్రీకపాలిశాస్త్రి మహాశయుల సహాయమున ప్రార్థింప శ్రీవిశ్వామిత్ర మహాశయులు ఈసత్కార్యము నందాదరము వహించి- ఈ ఉమాసహస్రమును సమూలముగ ఆంధ్రలిపియందును భాషయందునుగూడ ప్రచురించుకొనుటకు తే 1-8-1946దీగల అనుమతిపత్రమూలమున బ్ర॥ శ్రీ॥ వేమల రామమూర్తిగారికి అధికార మొసంగియున్నారు. తరువాత- 8-5-1946 తేదీని శ్రీరమణభగవానునికి వినిపింపఁబడి- సమర్పింపఁబడి- తదాశీర్భాగ్యమును బడసిన ఉమాసహస్రమునందలి ప్రథమశతకము 1-4-1950 తేదీకి ఉమాకటాక్షమున వెలువడినది, పిమ్మట శ్రీమహారాజ సంస్కృతకళాశాలనుండి కొంతకాలము సెలవుఁగైకొని మిగిలిన తొమ్మిది శతకములుగూడ 1-2-51 తేదీనాటికి గద్యరూపమున నాంధ్రీకరించితిని, కాని శ్రీ గణపతి మునిశిష్యులగు బ్ర॥ శ్రీ॥ వే॥ రామమూర్తి బావగారికి మిగిలిన గ్రంథమును ప్రకటించుటకు తగినంత యవకాశము కలుగకుండుటవలన తరువాతి గ్రంథమును ప్రకటించుటకు వీలుకలిగినది కాదు. ప్రకటితమైన ప్రథమశతకమును సమీక్షించి ఆమోదించిన భక్తులలో శ్రీరమణ-గణపతి-మునులయందు ప్రపూర్ణమగుభక్తి కలిగిన యొకానొక సత్పురుషుని ఆకస్మికసహాయమున ఈద్వితీయభాగమును ప్రకటించుటకు నవకాశము లభించినది. ప్రస్తుతము మధ్యప్రదేశమునందలి "బాలఘాట్" జిల్లాయందున్న పాద్రిగంజ్ యందు మలేరియా ఇన్స్పెక్టరుగా నుద్యోగము నొనర్చుచున్న భక్తమహాశయులగు శ్రీ అయ్యలసోమయాజుల చిట్టిసోమయాజులుగారు విజయనగరమునందు మాయింటికివచ్చి- ఈగ్రంథముయొక్క మిగిలినభాగములను ప్రకటింపవలెనను తలంపును తెలిపి పాద్రిగంజ్ వెళ్ళి భక్తులసహాయమునుగొని ఈద్వితీయభాగమును ముద్రింపించుటకు వలసిన ధనసహాయమును గావించిరి. శ్రీమదుమాకటాక్షమునను, శ్రీరమణ- గణపతిమునీంద్రుల అనుగ్రహమువలనను శ్రీ అయ్యల సోమయాజుల చిట్టిసోమయాజులుగారికిని, ఈగ్రంథప్రచురణమునకు తోడ్పడిన శ్రీయుత వేమలరామమూర్తి ప్రభృతులగు తదితరభక్తులకును ఆయురారోగ్య భాగ్య విజ్ఞాన సంపత్తి కలుగవలయు నని భగవానుని ప్రార్థింతును. ఏతత్ గ్రంథప్రచురణమునకు తోడ్పడిన భక్తుల పవిత్రనామావళిని ఈగ్రంథమునందు ప్రక

టించుచున్నాము. భగవదనుగ్రహపాత్రులగు శ్రీయుత సోమయాజులుగారి ఉత్సాహపూర్ణమగు కృషివల్లను, భక్తమహాశయుల తోడ్పాటువల్లను, మిగిలిన యారు శతకములనుగల తృతీయభాగముగూడ, శ్రీమదుమాగణపతి-శ్రీగురురమణ-భగవదనుగ్రహమున శీఘ్రముననే ప్రకటితము కాగలుగునని దృఢముగా విశ్వసించుచున్నాను.

1-4-1950 సంవత్సరమున ప్రకటితమైన ప్రథమశతకమున మూలశ్లోకములను పద్యరూపమున నాంధ్రీకరించియుంటిని. కొందఱు పాఠకుల యభీష్టము ననుసరించి మిగిలిన తొమ్మిదిశతకముల యందునుగల మూలశ్లోకములను ఆంధ్రగద్యరూపమున మాత్రమే అనువదించియుంటిని. ప్రభావ్యాఖ్యానమును మఱికొంత విపులీకరించితిని. ప్రకటితమయిన ప్రథమశతకమునుగూర్చి శుభాశయులగు కొందఱు పండితవరేణ్యులును ప్రసిద్ధములగు కొన్ని పత్రికలును ప్రసాదించిన సదభిప్రాయములను దీని తృతీయభాగమున ప్రకటింపగలనని యాశించుచున్నాను. ఏతద్గ్రంథముద్రణము ముగియుచున్నపుడు నాశరీరమునందయిన అస్వస్థతవలన ఈభాగమునందు ప్రమాదవశమున దొరలిన ముద్రణస్ఖాలిత్యములను పరిశీలించి. పరిశోధనపత్రికను ప్రకటించుట కవకాశము గలిగినది కాదు. ఈవిషయమున పాఠకులు నన్ను క్షమింపప్రార్థింతును. శ్రీ రమణ భగవానుని స్మరించుచు నిప్పటికీవిజ్ఞాపికను ముగింతును.

పత్తిపాటివారివీధి
విజయనగరము
1-8-1956

ఇట్లు
సజ్జన భక్త విధేయుఁడు
**పంతుల లక్ష్మీనారాయణశాస్త్రి**
శ్రీభారతీతీర్థ-శ్రీకౌముదీపరిషత్ - సాహితీసమితి-సభ్యుఁడు.

బ్రహ్మశ్రీ తి. వి. కపాలిశాస్త్రిగారి అభిప్రాయము.

T. V. KAPALI SASTRI Sri Aurobindo Asram.
*Pondicherry.*

శ్రీ విజయనగర మహారాజ కళాశాలాంధ్ర పండితులును, సాహిత్యవిద్యాప్రవీణులును, ఉభయభాషాప్రవీణాది పట్టములం బడసినవారునగు బ్రహ్మశ్రీ పంతుల లక్ష్మీనారాయణశాస్త్రి గారొనర్చిన నవ్యాఖ్యాన - ఉమాసహస్ర ఆంధ్రానువాదమునఁ గొన్ని భాగములను – నాకే చదివి వినిపించిరి. నేనపేక్షించిన పద్యములను వ్యాఖ్యలతో పఠించి శ్రావించిరి.

వృత్తఖండముం జూచి వృత్తముయొక్క పూర్తి నెఱుంగుట దుర్లభముకాదు. అర్ధేందువును అపేక్షించి మండలము నెఱుంగుట సర్వసాధారణమేగదా !

వీరి గద్యములుగాని, పద్యములుగాని, అనాయాసప్రవృత్తములై మూలానుసారులై సహజములై, అందువలన ప్రశంసనీయములై యున్నవి. కావున ఈ యనువాదము నాకత్యంతసంతృప్తి నిచ్చెను.

'ఈయనువాదము – అసమానము' అనుట ఒకవేళ సందిగ్ధ వచనము గాఁబోలు.

అనభ్యధికమనుట మాత్రము – అసందిగ్ధము.

శ్రీ అరవిందాశ్రమము
పాండిచేరి.
10–7–1946

ఇట్లు,
ఉమాసహస్ర వ్యాఖ్యాత.
తి. వి. కపాలిశాస్త్రి.

శ్రీ విజయనగర మహారాజ సంస్కృత కళాశాలా ప్రధానోపాధ్యాయులగు

బ్రహ్మశ్రీ శేరి వేంకటేశ్వర శాస్త్రులవారి

## — అభిప్రాయము. —

శ్రీ వసిష్ఠకులావతంసులును, మహర్షికల్పులును, అపారమేధాశక్తిసంపన్నులును, ఉత్తరవిశాఖ మండలాంతర్గత కలవరాయి గ్రామవాస్తవ్యులును అగు బ్రహ్మశ్రీయుత అయలసోమయాజుల గణపతిశాస్త్రులవారిచే రచియింపబడిన ఉమాసహస్రమనునమూల్యగ్రంథమునకు - తన్మండలాంతర్గత చిట్టాయవలస అగ్రహార వాస్తవ్యులును శ్రీ విజయనగర మహారాజ సంస్కృత కళాశాలోపాధ్యాయులును, సాహిత్య విద్యాప్రవీణులును, ఉభయభాషాప్రవీణులును అగు బ్రహ్మశ్రీయుత పంతుల లక్ష్మీనారాయణశాస్త్రిగారిచే రచియింపబడిన ఆంధ్రానువాదమున నేను కొంతవరకు చూచితిని. శ్రీ గణపతిశాస్త్రులవారు ద్రావిడాంధ్రదేశములందు విశేషప్రఖ్యాతులు. ఋగ్వేదమునందు విశేషపరిశ్రమచేసి అందలి గూఢాశయములను బాగుగ నవగాహనము చేసికొన్నవారు. అద్వైత వేదాంతమునందు విశేష పాండిత్యముగలవారు. సాంఖ్యయోగాది దర్శనములయందును, అలంకార శాస్త్రమునందునుగూడ విశేషపరిజ్ఞానముగలవారు- అంతర్ముఖులు.

వీరు సహజసిద్ధమగు కవితాశక్తిగల్గి బాల్యమునుండియే సంస్కృతభాషయం దసంఖ్యాకములుగా గద్యపద్య రూపములగు కావ్యములను రచించిరి. వానిలో నీయుమాసహస్రము భావపూర్ణమై మృదు మధుర గంభీర శైలితో నలరారుచున్నది.

తపోలోకాదులు, అదితిదక్షులు, పార్వతీ జననము, మొదలగు వానిని గూర్చి శ్రీ శాస్త్రులవారు వ్రాసిన యంశములు పురాణ వాఙ్మయమును మాత్రమే చూచువారలకు కొంత అభూతకల్పనలుగ

కాన్పించును, కాని వైదికవాఙ్మయమునుగూడ బాగుగ పరిశీలించి విమర్శక దృష్టితో నాలోచించినచో శ్రీ శాస్త్రులవారి సమన్వయములు మిక్కిలి సమంజసములుగనే యుండునని భావించెదను.

ప్రకృతమున- ఈ గ్రంథరాజమున కాంధ్రానువాదకులగు శ్రీ లక్ష్మీనారాయణశాస్త్రిగారు కూడ ఆంధ్ర గీర్వాణ భాషలలో మంచి పరిజ్ఞానము గల్గి భగవత్ ప్రసాదితమైన కవితాశక్తిచే బాల్యము నుండియు మృదుమధురశైలిలో ననేకములగు సరస కావ్యములను, సంస్కృతాంధ్రములలో రచియించుచున్నవారు. వీరికి బాల్యము నుండియు ఆధ్యాత్మిక చింతనమున నాసక్తి మెండు. అందుచే వీరు కొన్ని ఉపనిషత్తులకును, ఇతరములైన ఆధ్యాత్మిక గ్రంథములకును ఆంధ్రానువాదములను, టీకా తాత్పర్యములను రచించి యాంధ్ర లోకమున కత్యంతోపకృతి నొనరించిరి.

ప్రకృతమునఁగూడ నీయుమాసహస్రము-ఉమాస్తుతిరూపమున సర్వజగదుపాదానమగు విశిష్ట చిద్రూపమునే బోధించుచుండుటచేత వీరు దీనిని అన్యూనానతి ప్రసక్తముగ ననువదించి, అందలి గూఢార్థములను బాలకులు గ్రహించుటకై సుస్పష్టమగు భాషతో చక్కని వివరణమును గూడ చేసిరి. [ఇటులనే పైతొమ్మిది శతకములను గూడ ననువదించి] ఆంధ్రలోకమునకు మహోపకృతిని శ్రీ శాస్త్రిగారు చేయఁగలరని విశ్వసించుచున్నాను.

పరమేశ్వరుడు శ్రీ లక్ష్మీనారాయణశాస్త్రిగారికి ఆయురారోగ్యములను, శుభ పరంపరలను కలుగఁజేసి అట్టి యవకాశమును ప్రసాదించుఁగాక! అని భగవంతుని ప్రార్థించుచున్నాను.

విజయనగరము
తే 1-8-1949

ఇట్లు
విద్వజ్జన విధేయుఁడు,
పేరి వేంకటేశ్వర శాస్త్రి.

# బ్రాహ్మీప్రశంస

అమ్మ, పరేశశక్తి - పృథగాత్మ ధరించె విసృష్టి-నాదరూ
పమ్మున వాణియయ్యె, విభవమ్మున నిందిరయయ్యె, భోగభా
గ్యమ్మున గౌరియయ్యె, పరమామృతమూలతపస్స్వరూపచో
ద్యమ్మునసర్వహేతువు వుమయయ్యె, తదంబ-భజింతునిత్యమున్!

ఇట్లు

భక్తజనవిధేయుఁడు

పంతుల లక్ష్మీనారాయణశాస్త్రి

★

పరిఫుల్ల రాజీవ విలోచనాత్వం
పరిపశ్చ భర్తుర్న యనాన్యహార్షీః.　　౧౦

దివ్యలోకమునం దుదయించినదియు, తెల్లనిదియు అగు వస్త్రమును ధరించి నాగేంద్రునితో సాటియగు వాల్జడతోఁ బ్రకాశించుచు, వికసించిన కమలములవంటి కన్నులుగల నీవు జగత్పతియగు ముక్కంటి నయనములను సమాకర్షించితివి.

ప్ర భ:— శివునియొక్క సోమ- సూర్య- అగ్నినేత్రములను హరించి (దొంగిలించి) జయించిన నీకరోజనేత్రముల సౌభాగ్యమునిర్వచనీయమని భావము. 'నయనాని' అను బహువచనము చేత పార్వతిసందర్శనమువలన హరుని జ్వలననేత్రము కూడ నిర్వీర్యమయినదని చెప్పఁబడినది. ఇచట నైల్యము- మసృణత్వము- మొదలగు సమానధర్మములవలన. వేణీబంధ- భోగీంద్రులకు ఔపమ్యము చెప్పఁబడినది. పార్వతిధరించిన పరిధానముయొక్క- ధవళిమ- వేణీనీలిమయొక్క-లావణ్యము పోషించునని గ్రహించునది.

ప్రత్యఙ్గబన్ధం జ్వలదుత్తమం తే
భుజఙ్గ రాజోపమవేణి-రూపమ్
ఆత్మైకనిష్ఠస్యచ విశ్వభర్తు
రారాధయామాస 'విలోచనాని.'　　౧౧

ముఖ - వక్షోజ - భుజలతాద్యంగములయందు పరిస్ఫుటమును సర్వలక్షణ లక్షితమును, సర్పరాజోపమవేణియు నగుచు అంగసౌష్ఠవసంపన్నమగు నీరూపము- స్వాత్మయందే కేవలమగు దృఢస్థితిగలవాఁడయినను గూడ విశ్వభర్తయొక్క విలోచనములను (మూఁడింటిని)గూడ నారాధించినది. (తృప్తినొందించినది.)

ప్ర భ:— లోకోత్తరమగు సౌందర్యమును జూచుటచేతఁ గలిగిన చల్లఁదనము చేత, అగ్నిరూపమగు తృతీయనేత్రమునకుఁగూడ శాంతికలిగెను. నీయొక్క-రూపము చేతఁ జేయబడిన యారాధనము- తథావిధమగు శాంతిజనకమని భావము.

మీఁది శ్లోకమున అప్యర్థకమగు ('కూడ' అనునర్థముగల) చకారమువలన ఆత్మైకనిష్ఠుఁడగుటచేత- అన్యవిషయము లేకుండుట- అనిర్వాచ్యమగు ధీరత- విశ్వ

భర్తయగు శివునికి సిద్ధించుచున్నను, తన్నయనాకర్షకమగు లావణ్యసౌభాగ్యమువలన ఉమాదేవీరూపము- భగవంతుఁడగు హరునిహృదయమునఁబ్రవేశించి, యతనిధీరతను పెకలించి తన్నయనముల నారాధించెనను నంశము మీఁదిశ్లోకమున స్ఫురింపఁజేయఁబడుచున్నది.

విషయవిముఖుఁడును కామదాహియునగు పరమేశ్వరుని నేత్రత్రయమును తృప్తి నొందించుట అర్థసిద్ధి. నయనత్రయతర్పణ రూపపదార్థనిష్పత్తి కిచట అసంభావనీయత్వమును వర్ణించుటవలన నిది అసంభవాలంకారమగునని యెఱుంగునది. "అసంభవోఽర్థనిష్పత్తే రసం భావ్యత్వవర్ణనమ్" (అర్థసిద్ధికి అసంభావ్యత్వమును జెప్పుడుమేని అసంభవాలంకారమగును) అనునది తల్లక్షణము.

**అభూస్త్వ మాద్యస్య మనోమదాయ**
**నచాపి తే ప్రీతిపదం బభూవ**
**న కేవలం వాం సకలస్య చాసీద్**
**దామ్పత్య బన్ధస్య తదమ్బ! బీజమ్. ౧౨**

**అమ్మా! నీ వాదిపురుషుని మనస్సును హరింపఁజేసితివి. అతఁడు కూడ నీయొక్క ప్రీతికి స్థానమయ్యెను. ఇట్లు పరస్పరమగు మీప్రేమ ప్రభావము (కేవలమును) మీ యిరువురియొక్కయు దాంపత్యబంధనము నకేగాక లోకములందున్న సర్వ ప్రాణులయొక్కయుఁగూడ దాంపత్య బంధనమునకు బీజమై (కారణమై) యున్నది.**

ప్ర భ:— సర్వమునకును మూలభూతుఁడును, సర్వపురుషులకును ప్రథముఁడును, అగుటచేత సర్వేశ్వరుఁ డాదిపురుషుఁడైయున్నాడు. జాయా చపతిశ్చదమ్పతీ, తయోర్భావః=దామ్పత్యమ్" అను వ్యుత్పత్తిచేత . భార్యాభర్తృభావము దాంపత్య మని చెప్పబడును.

ఒండొరుల కెడబాటులేని దాంపత్యమే దాంపత్యబంధమని చెప్పఁబడును. బీజశబ్దమునకు కారణము, విత్తనము, అను నర్థములుగలవు.

ఉమా- మహేశ్వరుల కొకరియందొకరి కొదవిన ప్రేమబంధము, మొదట, తద్ దాంపత్యసంపాదకమయి, తదుపరి, తత్ఫలితమును జగద్రూపమును అగు అపత్య మునుండి యేర్పడిన స్త్రీ- పురుష రూపలోకగతమగు దాంపత్యమున కంతకును గారణమయ్యెనని భావము. (శివా) శివులకొదవిన అన్యోన్యప్రేమ-బీజమని చెప్పఁ

బడుటచేత వారి దాంపత్యము- వ్యంతము తో డిమ)అను నంశము బంధశబ్ద ప్రయో గములవలన ధ్వనింపఁజేయఁ బడుచున్నది.

"ప్రసవ బన్ధనము వృంత"మని చెప్పఁబడును. వారి దాంపత్యమునకు ఫలము జగద్రూపమగు నపత్యమని యూహింపఁదగియున్నది.

జగద్రూపమగు సంతతిలేనియెడల జగదీశ్వర దాంపత్యమునకు స్థైర్యము గాని శైథిల్యముగాని సంభవించెడిని.

భవభూతి యీయంశము నిట్లు చెప్పియున్నాఁడు.

శ్లో॥ "అన్తఃకరణతత్త్వస్య దమ్పత్యో స్స్నేహసంశ్రయాత్
ఆనన్దగ్రన్థి రేకోఽయమపత్యమితి పఠ్యతే".

(జాయాపతుల హృదయమునకు, స్నేహమును అవిశ్లేషమును ఫలముగాఁ గలిగిన ఆనందమయమగు గ్రంథి- అపత్యమని చెప్పఁబడును)

ఇచట పరమేశ్వరీ- పరమేశ్వరులకు పరస్పరప్రేమాధాన రూపమగు నుప కారమువలన అన్యోన్యమను నలంకారమగుచున్నది.

తవాతికాన్తా నయనాన్తవృత్తి-
ర్హాసః పురారేశ్చ సపేన్దుహారీ
ఉభౌ వివాహోత్సవ పూర్వరఙ్గం
నిర్వర్తయామాసతురాదిరామే ! ౧౩

ఆదిసుందరీ ! నీ నయనాంతవృత్తి- (కడకంటి చూపులవిలాసము) **అత్యంతము**ను కమనీయ. పురారియగు శివునిహాసముకూడ బాలచంద్రుని వలెమనోహరము. ఈరెండును (ఈయిద్దఱును) మీవివాహోత్సవము నకు పూర్వరంగమును నిర్వర్తించినవి. [నిర్వర్తించిరి.]

ప్ర భ:— సుఖమును పుట్టించునది ఉత్సవము.

"పూర్వమ్ రజ్యతే అస్మిన్నితి పూర్వరఙ్గః" అను వ్యుత్పత్తిగల పూర్వరం గము విఘ్నములను శమింపఁజేయు కర్మవిశేషమైయున్నది.

ఉమాదేవియొక్క- కమనీయకటాక్ష విలాసరూపయగు వృత్తియు, అర్ధేందుని వలె రమణీయమగు శివుని మందహాసమును మిళితములై నిర్విఘ్నమగునట్లు పాణిగ్ర హణమహోత్సవమును నిర్వహించినవని భావము. పూర్వరంగమను పదముచేత- పార్వతీ- ప[illegible] మేశ్వ[illegible] హో [illegible] నా[illegible] సు[illegible] పఁ జేయబడుటచేత నిచట

రూపకాలంకారము, ధ్వనించుచున్నదని తెలియనగును. నాట్యశాలయు, ఆనాట్యశాలయందగు రంగవిఘ్నములను తొలఁగించుటకు చేయబడు నాందీపాఠ- గీత- వాదిత్రాది వివిధాంగకర్మ విశేషమునుగూడ- పూర్వరంగమని చెప్పఁబడును.

మీఁది శ్లోకమున "నయనాన్తవృత్తిః" అను స్త్రీలింగముయొక్కయు 'హాసః' అను పుంలింగముయొక్కయు స్వారస్యమువలన పూర్వరంగము నొనర్చు నటీనటులు ధ్వనింపఁ జేయఁబడుచున్నారు.

వివాహకాలమున లజ్జనొందిన నవవధువునకు నయనాంతవృత్తియు, వరునకు మందహాసమును వర్ణించుట ఔచిత్యపోషక మగుచున్నది.

ఉత్తరభాగమునఁజూడఁబడు "బ్రహ్మణ్ణ రజ్గభాజోనట్యాః" శివసూత్రధార సహచర్యాః" అను శ్లోకముగూడ ఏతత్సజాతీయమని గుర్తించునది.

దాతుం ప్రభుః సాన్త్వయితుం సమర్థః,
కర్తుం క్షమ, స్తర్జయితుంచశక్తః
సంరక్షతాన్మాం తవసర్వవన్ద్యే!
కరస్తుషారాంశుభృతా గృహీతః. ౧౪

**సర్వ ప్రాణివంద్యవగు జననీ! భక్తలోకమున కభీష్టమును దానముచేయుటకు ప్రభువును, ఆశ్రితులను సంతోషింపఁజేయుటకు సమర్థమును, సర్వతంత్ర స్వతంత్రమగుటవలన దేనినయినను స్వేచ్ఛననుసరించి భేదముచేనైనను సాధించుటకు తగినదియు, శత్రువులను భయపెట్టుటకు శక్తిగలిగినదియు చంద్రధరునిచేత గ్రహింపబడినదియు నగు నీహస్తము నన్ను సంరక్షించుగాత!**

ప్ర భ:— మీఁది విశేషణములవలన ఉమాహస్తము- సామ- దాన- భేద- దండోపాయ దక్షమను నంశము తెలియఁజేయఁబడినది. వివాహమున గ్రహింపఁబడుటవలనను, రక్షణపరాయణముగా ప్రసిద్ధమగుటవలననుగూడ నిచట విశేషింపబడినది- దేవీదక్షిణహస్తమే యగుచున్నది- సర్వేశ్వరునిచేత గ్రహింపఁబడిన హస్తమునకు సామాది సామర్థ్యము స్వారస్యావహమని యెఱుంగునది. ఒక్కటియే యగు హస్తమునకిట్లు దాన- సాంత్వన- కర- తర్జనములు సుశ్లేషించుటవలన నిచట సుశ్లేషాలంకారమని గ్రహింపనగును.

స్ప్రష్టుం నశక్యా పరమేపరైస్త్వం
నచాన్య యాచిన్తయితుం నశక్యః
త్వమేవశర్వస్య సఏవ తేఽస్య
దాంపత్యమేవం యువయోస్తు సత్యమ్॥ ౧౫

అమ్మా ! నీవే ఉత్తమురాలవు. ఈశ్వరునికంటె నితరులు నిన్ను స్పృశింపఁజాలరు. నీకంటె నితర లతనినిగూడ చింతింపఁజాలరు. శర్వునకు నీవే యున్నావు. (అన్యస్త్రీ లేదు)నీకతఁడే యున్నాఁడు. (అన్యుఁడు లేఁడు) కావున ఇట్లు- మీయొక్క (శివశక్తులయొక్క) దాంపత్యమే సత్యము. (తదితరమగు దాంపత్యము సత్యముకాదు)

ప్ర భ:— ఇచట శివ- శక్తుల దాంపత్యము- అన్యోన్యాత్మకము-అవియోజ్యము (ఎడబాటులేనిది) అని చెప్పఁబడినది.

కావున సత్యమగు నీదాంపత్యము- అవికారి (మార్పులేనిది) అగును. తదితరము- అవికారి కానేరదు.

పరమార్థమున శివశక్తుల దాంపత్యమొక్కటియే సత్యము. పుం, జాతియంతయు శివమూలము.

స్త్రీజాతియంతయు శక్తిమూలము. కావున లోకమునందు తదితరములగు దాంపత్యములన్నియునుగూడ తద్వివర్తములే (సత్యమగు నాదాంపత్యమునందు కల్పితములే)యని తెలియునది.

నిజాద్ వతంసేన్దుత ఇన్దుమన్య
ముత్పాద్య తేశమ్భు రదాద్వతంసమ్
మూర్తామివాసౌ శుభగాత్రి! రాత్రిం
ప్రాప్య త్వదీయాం కబరీం చకాసే. ౧౬

శుభగాత్రివగు (మంగళాంగివగు) జననీ! శివుఁడు నిజశిరోఽలంకారభూతమగు చంద్రునినుండి వేరొకచంద్రుని సృజించి నిన్నలంకరించెను. భూషణరూపుఁడగు నాచంద్రుఁడు నీకేశవేశముగ రూపొందిన రాత్రినివలె నాశ్రయించి మిగులఁ బ్రకాశించెను.

ప్రభ:—వివాహ కాలమున నవవధువునకలంకారము నొసంగుట సంప్రదాయ సిద్ధము. కావుననే పరిణయ సమయమున వరుఁడగు శివుఁడు స్వాత్మశిరోభూషణము నుండి వేఱొకభూషణమును సృజించి వధువగుపార్వతికి శిరోభూషణముగాఁ జేసె నని భావము.

ఇచట నైల్యసాధర్మ్యమువలన పార్వతీకబరికి నిశా-తాత్పర్యము సంభావింపఁ బడినది. కావున నిది స్వరూపోత్ప్రేక్ష యగును. చకాసే (బభాసే) అను చోట, శివుని పిశంగ జటాగతభూషణముకంటె, పార్వతీ నీలకబరీగత భూషణము యొక్క— 'భాసనాతిశయము' స్ఫురింపఁజేయఁబడుచున్నది.

బభూవిథాగేన్ద్ర గృహే యదా త్వం
సచేశ్వరస్తత్ర చకార వాసమ్
విలోకమానస్తవ దేవి! విద్యుత్
పాఞ్చాలికాయాః కమనీయభావమ్. ౧౪

దేవీ! (బాల్యమున) పర్వతరాజగు తండ్రియింట నీవునివసించు చున్నపుడు విద్యుత్పాంచాలికవగు (జాజ్వల్యమానమగు మెరుపుతోఁ జేయఁబడిన యాటబొమ్మవలెనున్న) నీయొక్క రామణీయకమును విలోకించుచు, నాయీశ్వరుడుకూడ నచ్చటనే నివసించియుండెను.

ప్రభ:— ఇందలి విద్యుత్పదముచేత- జ్యోతిరుజ్వలరామణీయక సంపన్నము- హారనయనాకర్షకమును అగు- తన్వీత్వమును(సూక్ష్మస్థితి) గమింపఁ జేయఁబడుచున్నది. ఇది స్వతస్సంభావితమగు వస్తుధ్వని.

సిద్ధం స వాం సాధయితుం ప్రవృత్తో
యోగం ప్రదగ్ధో మదన శ్చకల్పే
'వశీతి'కీర్తిం గిరిశస్య భర్తుం
తుభ్యం 'త్వపర్ణే'తి [illegible]. ౧౫

ప్రసిద్ధుఁడగు నామన్మథుఁడు, నిత్యసిద్ధమగు యోగమును అనఁగా శివ-శక్తి దాంపత్యరూపమగు సంబంధమును సాధించుట కుపక్రమించి శివనేత్రాగ్నిచేత భస్మముగాఁ జేయబడి-శివునకు వశి (జితేంద్రియుఁడు) అనుకీర్తిని పోషించుటకును, శివునందలి ప్రణయమువలన తపస్సు నాచరించునపుడు, పర్ణములను (ఎండిన యాకులను) గూడ భుజింపకుండుట వలన నీకు 'అపర్ణ' అను యశమును గలుగఁ జేయుటకును సమర్థుఁడయ్యెను. ప్రియలాభముకొఱకు మిక్కిలి కష్టమగు తపస్సు నాచరించిన పార్వతికి 'అపర్ణ' అనునామము ప్రసిద్ధము.

మహాకవియగు కాళిదాసు —

"స్వయం విశీర్ణ ద్రుమపర్ణవృత్తితా
పరాహి కాష్ఠా తపస స్తయాపునః
తదప్యపాకీర్ణమితి ప్రియంవదాం
వదన్త్యపర్ణేతి చ తాం పురావిదః"

స్వయముగా రాలి-యెండిన యాకులను భుజించుట- తపస్సునకు పరాకాష్ఠ యగుచుండును. అట్టి పర్ణములను (ఆకులను) గూడ విడుచుటవలన ప్రియంవదయగు పార్వతిని- పురావిదులు- ,అపర్ణ, అని చెప్పుదురు."

అని స్వకృతకుమార సంభవమున పంచమసర్గమందలి పదునెనిమిదవశ్లోకమునఁ జెప్పియున్నాఁడు.

ఇచట సిద్ధమగు పార్వతీ-పరమేశ్వరయోగమును సాధించుటకయిన మన్మథుని ప్రవృత్తి-హేతువు. శివునకు వశియనుకీర్తిని సంధించుటయు, ఉమకు- అపర్ణ యను యశమును గలిగించుటయు ననునవి హేతుమంతములు (కార్యములు).

ఇట్లు హేతుమంతముతోఁగూడ హేతువును వర్ణించుటవలన నిది హేత్వలంకారమగుచున్నది. చంద్రాలోకమునందిట్లు చెప్పబడినది.

,,హేతోర్హేతుమతా సార్ధం వర్ణనం హేతురుచ్యతే
అసావుదేతి శీతాంశుర్మానచ్ఛేదాయ సుభ్రువామ్''

హేతువును హేతుమంతముతోఁగూడ నొకేవాక్యమున వర్ణించుట హేత్వలంకార మనఁబడును. హేతువువలన నగుకార్యము హేతుమంతమని చెప్పఁబడును.

ఉదా:- "చక్కని కనుబొమలుగల కాంతలమానమును (కోపమును) ఛేదించుటకీచంద్రుఁ డుదయించుచున్నాఁడు.

ఘోరం తపశ్చేద్రచితంత్వయాఽపి
పాణిగ్రహభర్తుః సమనుగ్రహాయ
విహాయ యత్నం క ఇహాఖిలామ్బ
సమ్బద్ధమప్యర్ధ ముపైతుజన్తుః? ౧౯

ఓ సర్వలోక జననీ! పూర్వరూపమున (సతీదేవిగా నున్నపుడు) నీకు భర్తయగు నీశ్వరుఁడు నిన్నంగీకరించి యనుగ్రహించుటకొఱకు నీవుకూడ, నిరశనవ్రతసాధ్యమగు ఘోరతపము నొనర్చునెడల ఈ లోకమునందున్న జంతువెవ్వఁడైనను ప్రయత్నమును విడిచి- సిద్ధము గాని సాధ్యముగాని యగుచు సంబంధించియున్నను స్వాభీష్టవిషయము నెట్లు పొందును?

ప్ర భ:— పూర్వము సిద్ధించిన భర్తయొక్క అనుగ్రహముకొఱకు జగన్మాత యగు పార్వతికిఁగూడ తపశ్చరణ మావశ్యకమగునెడల ఆయమ్మకంటె వేరయిన అల్పజంతువునకు ఇష్టార్థలాభముకొఱకు ప్రయత్న మత్యంతావశ్యకమను నంశమును వేరుగా చెప్పనక్కఱలేదని భావము.

"కైముత్యేనార్థ సంసిద్ధిః కావ్యార్థాపత్తి రిష్యతే" ('కిముత' శబ్దముయొక్క భావము కైముత్యము. కైముతిక న్యాయముచేత నర్థసంసిద్ధి- కావ్యార్థాపత్తి యనబడును)

అనులక్షణముచేత నిచటి యలంకారము కావ్యార్థాపత్తియని తెలియునది.

ఈయంశమున క్రింది యుదాహరణ్ణమును గ్రహించునది.

"ప్రియసీ! నీముఖమాచంద్రునే జయించినది. పద్మములమాట చెప్పనేల"

వి వ:— ఆచంద్రుడన, పద్మములను జయించిన చంద్రుఁడనియర్థము.

పద్మములను జయించిన చంద్రునే నీముఖముజయి ంచినది. ఇఁక పద్మములను జయించెనని చెప్పవలయునా?" అనఁగా పద్మములను మిక్కిలి సులభముగానే జయింపఁగలదని యర్థము.

ఇట్లు కైముత్యముచేత అర్థసంసిద్ధివలన నిది కావ్యార్థాపత్తి యగుచున్నది.

మూ. రణే యేనాతిరస్కృత్య త్యక్తో రాక్షసజాత్యతః
చిరాయహారిదీశేషు కోణేశః ప్రాప్తవాన్ యశః. ౭

రాక్షసుఁడగు మహిషుఁడు యుద్ధమునందు దక్షిణ పశ్చిమముల నడుమనున్న కోణమున కధిపతియగు నిఋృతిని రాక్షసుఁడను హేతువు వలన అవమానింపక విడువఁగా నతఁడు దిక్పాలకులయందు గొంతకీర్తి నొందెను.

ప్ర భ:—రాక్షసుఁడను హేతువువలన=జాతి పక్షపాతమువలన.

ఇందు రాక్షసుఁడను సజాతీయ పక్షపాతమువలన మహిషునిచేత నిఋృతి తిరస్కృతుఁడు కాఁడయ్యెనని సంభావింపఁబడినది. కాని ఉత్ప్రేక్షావాచకమగు ఇవాదిశబ్దము ప్రయోగింపఁబడలేదు. కావున నిది గమ్యమగు ఉత్ప్రేక్షాలంకార మగుచున్నది.

మూ. యస్మిన్నియన్తు మశక్తస్య కుర్వాణ మసతీః క్రియాః
నియన్తు రసతామాసీత్ పాశినోమలినం యశః. ౮

దుష్కార్యముల నాచరించుచున్న మహిషుని నియమించుట కశక్తుఁ డగుటవలన పాపనియంతయగు వరుణునికీర్తి మాలిన్యము నొందెను.

ప్ర భ:—పాశయుక్తుఁడగు వరుణుడు- పశ్చిమ దిక్పాలకుఁడు. అతఁడు సర్వ పాపదమనుఁడని ప్రసిద్ధుఁడైయున్నాఁడు. మహిషుని నియమించుటయందశక్తుడగుట వలన నతనికీర్తికూడ మందమయ్యెనని భావము.

ఇందు "మహిషుని శిక్షించుటకు సామర్థ్యము లేకుండుట" అను హేతువు కవికల్పితము. (సంభావితము) ఆహేతువుచేత వరుణకీర్తికి మాలిన్యము సిద్ధించెనను వస్తువుచేత ఉత్ప్రేక్ష గమ్యమగుచున్నది. కావుననిది కవిప్రౌఢోక్తి సిద్ధమగువస్తువు చేత అలంకారము ధ్వనింపఁజేయఁబడుటకు లక్ష్యమగుచున్నది.

మూ. బాహువీర్యపరాభూతో యస్యప్రేణమారుతః
బభూవ క్షణదాన్తేషు రతాన్త పరిచారకః. ౯

మహిషభుజబల పరాజితుఁడగు వాయువు— క్షణదాంత (నిశాంత) సమయములందు ప్రాయశః, రతాంతపరిచారకుఁడగుచుండెను.

ప్ర భ:-వాయుదేవుఁడు పశ్చిమోత్తర (మధ్య) దిక్పాలకుఁడు. క్షణదాంతము లందు=రాత్రి ముగియు కాలములందు, రతాంతపరిచారకుఁడు = సురతశ్రమమును తొలగించు మందసంచారము గలవాఁడు.

మహిషపరాభూతుఁడగు వాయువు వానికి దాసుఁడై మెల్లగా వీవఁదొడఁగె ననుటవలన నిదియు గమ్యోత్ప్రేక్షయే యగును.

మూ. నిధీన్యేనజితోహిత్వా రాజరాజః పలాయితః ।
స్పష్టంబభాణ మాధుర్యం ప్రాణానా మఖిలాదపి. ౧౦

మహిషహతకునిచే జయింపఁబడిన రాజరాజు (మహాపద్మాదులగు) నిధులను వదలుకొని పలాయితుఁడై; అన్నిఁటికంటెనుగూడ ప్రాణములకుఁగల మాధుర్యమును (తీపిని) స్పష్టముగా వచియించెను.

ప్ర భ:-రాజరాజనగా; కుబేరుఁడు.ఉత్తరదిక్పాలకుఁడు. అల్పమో అధికమో యగుకష్టము కలిగినపుడెల్ల ఎట్లో ప్రాణములను రక్షించుకొనుటకు ప్రయత్నించు మనుష్యునిఅధైర్యమును దెలుపుటకు 'వానికిప్రాణములేతీపి'అనులోకోక్తికలదుగదా!

ఆలోకోక్తిననుసరించి మీఁదిశ్లోకమున 'ప్రాణానాంమాధుర్యమ్' (ప్రాణములకుఁగల మాధుర్యమును) అని ప్రయోగింపఁబడినది. సామాన్య జనునకువలె మహిషునియెదుట ఉత్తర దిక్పాలకుఁడగు రాజరాజునకుఁగూడ నవనిధులకంటెనుగూడ, మానముకంటెను గూడ ప్రాణములే ప్రియతరము లయ్యెనను నంశము ద్యోతితము.

మూ. యస్మిన్నుత్తరపూర్వస్యా దిశఏకాదశాధిపాః
కుణ్ఠాబభూవు రాత్మీయకణ్ఠోపమితకీర్తయః. ౧౧

ఉత్తరపూర్వ దిక్పాలకులగు ఏకాదశరుద్రులు వానియెదుట కుంఠులయి (వ్యర్థులై) తమతమ కంఠములతో పోల్పఁదగిన కీర్తిగలవారయిరి.

ప్ర భ:-ఉత్తరస్యాః పూర్వస్యాశ్చ యదన్తరాలం సా ఉత్తరపూర్వా అను వ్యుత్పత్తిచేత ఉత్తరపూర్వదిక్కనగా, ఉత్తరపూర్వదిక్కుల నడుమనున్న ఈశాన్య దిక్కగుచున్నది. తద్దిక్పాలకులు ఏకాదశసంఖ్యాకులగు రుద్రులు. రుద్రుఁడు నీలకంఠుఁడుగా ప్రసిద్ధుఁడై యున్నాఁడు. ఏకాదశరుద్రుల యశస్సు తెల్లఁదనమును విడిచి నీలిమనాశ్రయించి; ప్రకాశరహితమై తమోనిగ్న మయ్యెనని భావము.

మూ. నిజశుద్ధాన్తకాన్తానా మానన్తైరేవ నిర్జితమ్
లలజ్జే యః పునర్జిత్వా శూరమానీ సుధాకరమ్. ౧౨

శూరమానియగు మహిషుఁడు నిజాంతః పురకాంతల ముఖముల చేతనే జయింపఁబడిన సుధాకరుని (చంద్రుని) తిరుగజయించి లజ్జించెను.

ప్ర భ:–తననే శూరునిగాఁ దలచువ్యక్తి 'శూరమాని' అని చెప్పఁబడును, నిజసుందరీ ముఖముల చేత ఇంతకుముందే జయింపఁబడిన దౌర్భాగ్యుని మరల జయించుట శూరమానికి మిగుల లజ్జావహమని భావము.

మూ. బాలస్యేవ క్రీడనకైః ప్రవీరైర్యస్య ఖేలతః
లీలాకన్దుక ధీరాసీద్దేవే దీధితి మాలిని. ౧౩

క్రీడావస్తువులతో నాడుకొను బాలునికివలె ప్రకృష్టులగు వీరులతో నాడుకొనుచున్న మహిషునకు దీధితిమాలియగు దేవుడు సూర్యుని యందు క్రీడాకందుకము బుద్ధికలిగెను.

ప్ర భ:—క్రీడావస్తువన–ఆటవస్తువు. (బంతి మొదలగునది) బాలునకు బంతి మొదలగు ఆడుకొనువస్తువులందు, అది, తనది, వశపడినది, ఆడఁదగినది. అనుతలఁపు కలుగునట్లు ఆటవస్తువుల తోడనువలె మహావీరులతో నాడుచున్న మహిషునకు సూర్యునియెడల నది తనదియు, వశపడినదియునగు ఆటబంతి యనుతలఁపు కలిగెనని తాత్పర్యము. వాని పరాక్రమ–దర్పములు అట్టివని భావము.

మూ. త్రియామాచరశుద్ధాన్త భ్రూవిలాస నివారణమ్ ।
విష్ణోః సుదర్శనంచక్రం యస్యానాపశ్యదన్తరమ్. ౧౪

రాత్రించరులగు రాక్షసుల యంతఃపురమునందలి భ్రూవిలాసములను నివారించునదియగు విష్ణుసుదర్శనముకూడ మహిషునంతరమును జూడలేకుండెను.

ప్ర భ:—మహాప్రభావము, రక్షఃకులఘ్నము అగు విష్ణుచక్రముగూడ వానిని వధించుట కవకాశము నొందలేకపోయెనని తాత్పర్యము.

మూ. మహిషం తం మహావీర్యం యాసర్వాసుర దేహజా
అవధీద్దానవంతస్యై చణ్డికాయై నమోనమః. ౧౫

మహాపరాక్రముఁడగు దానవుఁడగు ఆమహిషుని సర్వసురదేహ సంభూతయగు ఏదేవత వధించెనో, ఆదేవతయగు చండికకు నమస్కారము. నమస్కారము.

ప్ర భ:—దితివంశ సంభూతుఁడు దైత్యుఁడనియు, దనువంశసంభూతుఁడు దానవుఁడనియు చెప్పఁబడుదురు. 'నమోనమః' అనుచో నున్నద్విరుక్తి - బహు నమస్కారార్థము.

హరాది సురల తేజఃపుంజముచేత— ఆవిర్భవించిన దేవి 'మహిషాసురమర్దిని' అనునంశము దుర్గాసప్తశతియందిట్లు చెప్పబడినది.

తతః సమస్తదేవానాం తేజోరాశి సముద్భవామ్
తాం విలోక్యముదం ప్రాపు రమరా మహిషార్దితాః.

(తరువాత సమస్తదేవతలయు తేజోరాశి సముద్భవయగు ఆదేవినివిలోకించి-మహిషునిచేత మర్దింపఁబడిన యమరులందఱును సంతోషము నొందిరి.)

మూ. ముఖం తవాసేచనకం ధ్యాయంధ్యాయం నిరన్తరమ్
మృగేన్ద్రవాహే కాలేనమృడస్త్వన్ముఖతాంగతః. ౧౬

సింహవాహనవగు మాతా! ఎంతచూచినను తనివితీఱని నీముఖమును నిరంతరమగునట్లు ధ్యానించి ధ్యానించి నీకాంతుఁడగు శంకరుఁడు కాలక్రమమున నీముఖమువంటి ముఖము గలవాఁడయ్యెను.

ప్ర భ—ధ్యాతకు (ధ్యానించువానికి) ధ్యేయ (ధ్యానింపదగినవస్తువుయొక్క) తాద్రూప్యసిద్ధియేగదా ధ్యానఫలము! కావుననే శివునిముఖమునందు అర్ధభాగము పార్వతీముఖమయ్యెనని ఉత్ప్రేక్ష గమ్యము.

మూ. కార్తికీచన్ద్రవదనా కాలిన్దీవీచిదోర్లతా
అరుణామ్భోజచరణా జయతిస్మితరుచిః శివా. ౧౭

కృత్తికానక్షత్ర యుక్తమగు పూర్ణిమనాటి చంద్రునిబోలిన ముఖముగలదియు, యమునాతరంగమునుబోలిన భుజలతగలదియు, అరుణాంబుజములఁబోలిన చరణములు గలదియు నగుచు- ఇట్లు స్మితరుచి యగు శివకాంత జయించుచున్నది.

ప్ర భ:—అరుణాంబుజములన- ఎఱ్ఱతామరపూవులు. శ్వేత- కృష్ణ- రక్త ప్రభలు గలదగుటవలన శివకాంత త్రిరుచి యగుచున్నది. చంద్రునితోఁబోల్పఁబడిన ముఖము తెల్లనిది. యమునా తరంగముతో సాటిచేయఁబడిన భుజలత- నల్లనిది. అరుణాంబుజముతో సరిచేయఁబడిన చరణములు ఎఱ్ఱనివి.

ఇట్లు లోహిత- శుక్ల- కృష్ణ యగుశివ-త్రివర్ణయు, త్రిగుణాత్మికయునగుచు "అజామేకాం లోహిత శుక్లకృష్ణామ్" అను శ్రుతిచేత ప్రతిపాదింపఁబడిన బ్రహ్మ స్వరూపిణి యగుచున్నదని చెప్పఁబడినది.

**మూ॥ యత్ తే కచభరః కాలో యద్బాహుర్లోకరక్షకః।**
**యుక్తం ద్వయం శివే మధ్యస్త్వసన్నాకో న నాకరాట్.౧౮**

**ఓ శివరమణీ! నీకచభరము కాలమును (కాలుఁడును) బాహువులోకరక్షకమును (విష్ణువును) అగుట యుక్తమైయున్నది. మధ్యము (అవలగ్నము) మాత్రము నాకరాజగుచున్నాఁడు. కాని యతఁడు అసన్నాకుఁడు(స్వర్గములేనివాఁడు)కాఁడు.(సత్ +నాకుఁడే.సన్నాకుఁడే).**

ప్ర భ:—కచభరము=కేశాతిశయము. దట్టమగుజుట్టు. కాలము=నీలవర్ణము. కాలుఁడు=యముఁడు, దుష్టలోకశిక్షకుఁడు. బాహువు=భుజము. లోకరక్షకము= లోకములను రక్షించునది. లోకరక్షకుఁడు=విష్ణువు. అసన్నాకుఁడు= (నసన్— అసన్,సనాకః-స్వర్గః, యస్యసః-అసన్నాకః) నాకములేనివాఁడు. (కాఁడు) సన్నాకుఁడే-స్వర్గముగలవాఁడే.

ఇచ్చట నీయంశము చెప్పఁదగియున్నది:- సర్వాంతకృత్తగు కృతాంతుఁడు దేవీ- కేశపాశముగను, లోకరక్షకుఁడగు విష్ణువు తద్బాహురూపముగను ఉండఁగా నాకరాజగు నింద్రుఁడు మాత్రము తదవలగ్న రూపుఁడగుటవలన శూన్యస్వరూపుఁడు కావలసియున్నది. కచభరమగు కాలునిచేత నిగ్రహమును బాహువగు విష్ణునిచేత అనుగ్రహమును చేయఁబడుటవలన అవలగ్నమగు నాకరాజుచేత కావింపఁదగిన కార్యము శూన్యమేయగును. కాని స్వర్గరాజ్యభోగముమాత్రము మిగిలియున్నది. కావుననే, అతఁడు అసన్నాకుఁడు కాఁడని నాకముగలవాఁడేయని చెప్పఁబడినది.

ఈయంశము-ఏతత్కవిచేత మీఁదిభాగమున 'నాకోఽవలగ్నమీశ్వరి' అను శ్లోకమున గానముచేయఁబడెను. దానియర్థ మిట్లున్నది.

స్వర్లోక-భూలోక పాతాళలోకములు- పరమేశ్వరి కుక్షియందున్నవి. అయినను తత్కుక్షియందేకాక బహిశ్శరీరమునందుఁగూడ నవికలవు. అదెట్లనిన, నాకము—నడుము. భూమి-కటిప్రదేశము. భోగిలోకము నాభి-ఇందు నాకమే నడుముగాఁ జెప్పబడినది. నడుము సూక్ష్మమని స్ఫురింపఁజేయుటకు, ఆకాశమధ్య అనియు, మధ్యశూన్యయనియు సుందరియగు కాంతను వర్ణించుట కవిసమయము గదా. కావున నిచ్చఁటగూడ లేనిదివలె నతిసూక్ష్మమైయున్న నడుమే నాకమని చెప్పఁబడియెనని యెఱుఁగునది. నడుము శూన్యమగునెడల, దానియం దారోపితమయిన నాకముగూడ శూన్యమను శంకకలుగును. గావున, నాకరాజు- అసన్నాకుఁడు కాఁడని, ఆశంక-నిరసింపఁబడినది. నడుములేకున్నను-నాకరాజ్యము ననుభవించుటకు నాకరాజు లేనివాఁడు కాఁడు.

మూ॥ స్వదేహాదేవ యా దేవీ ప్రదీపాదివదీపికా।
ఆవిర్బభూవ దేవానాం స్తువతాం హర్తుమాపదః. ౧౯

ఏ దేవత (కౌశికి) స్తుతించుచున్న దేవతల యాపదలను తొలఁగించుటకు ప్రదీపమునుండి దీపికవలె స్వదేహమునుండి యావిర్భవించెనో, (కౌశికియనునామమున ప్రసిద్ధురాలగు ఆ యుమాదేవికి నమస్కరించుచున్నాను).

ప్ర భ:—మీఁది బ్రాకెట్టునందుఁ దెలిపిన యర్థము- ఇరువది మూఁడవశ్లోకమునఁగలదు. కావున మీదిశ్లోకార్థమునకును, 20, 21, 22 శ్లోకములకును దానితో నన్వయము గలదని యెఱుఁగునది. ఒక్కతెయే యగుదేవియొక్క శరీరమునుండి తద్దేవీమూర్తులగు శక్తులనేకములు, తద్విభూతినుండి సంభవించి, ఆమెయందే లీనములయ్యెనని తృతీయచరితమున నిట్లు స్పష్టీకరింపఁబడియెను. "తరువాత అతిభీషణయు, శతనినాదినియునగు చండికాశక్తి దేవీశరీరమునుండి బయలువెడలెను."

ఈయంశమునే దేవి శుంభునితో నిట్లుపలికెను. "ఈప్రపంచమున నేనొక్కతెనే యున్నాను. నాకంటె వేఱగు రెండవశక్తిలేదు. నేను నావిభూతిచే నిచట ననేకరూపములతో నుండి యిప్పుడు వానినుపసంహరించి మరల ఒక్కతెనే యయి యున్నాను. ఇప్పుడు నీవు స్థిరముగానుండుము."

మూ॥ ధైర్య, చాతుర్య, గాంభీర్య, వీర్యసౌన్దర్యశాలినీమ్
రత్నం నితమ్బినీజాతౌ మేనిరే యాం సురాసురాః. ౨౦

ధైర్యముచేతను, చాతుర్యముచేతను, గాంభీర్యముచేతను, వీర్యముచేతను, సౌందర్యముచేతను వెలయుచున్న యేదేవిని స్త్రీజాతి యందలి రత్నమని సురాసురులు తలఁచిరో, (కౌశికీనామమున ప్రసిద్ధురాలగు నాయుమాదేవికి నమస్కారము).

ప్ర భః—రత్నమన శ్రేష్ఠురాలని భావము.

మూ॥ యదీయహుఙ్కృత్యనలే ధూమ్రాక్షోఽభవదాహుతిః।
సమాప్తిం భీషణం యావన్నైవావాపవికత్థనమ్. ౨౧

భయావహమగు నాత్మపరాక్రమకీర్తనము సమాప్తము కాకుండఁగనే ధూమ్రాక్షుఁడను శుంభాసురసేనాని— యేదేవియొక్క హుంకారాగ్నియందు ఆహుతియయ్యెనో (కౌశికీనామమున ప్రసిద్ధురాలగు నాయుమాదేవికి నమస్కరించుచున్నాను).

ప్ర భః—దేవియొక్క క్రోధప్రకాశకమగు హుంకారాగ్నియందు, తన యాత్మశ్లాఘనము ముగియకుండు లోపలనే ధూమ్రాక్షుఁడు హోమముచేయఁబడియె నని భావము. ఆరాక్షసుని వికత్థనవాగ్జాలమునకు దేవీహుంకారము ప్రత్యుత్తర మయ్యెను. “లోకాతిశయ సమ్పత్తి వర్ణనోదాత్తముచ్యతే” అను తల్లక్షణము ననుసరించి ఇచట లోకాతిశయ సంపత్తి వర్ణనమువలన నుదాత్తాలంకారమగును.

మూ॥ యస్యాఃశూలే జగామాస్తం యశః శుమ్భ- నిశుమ్భయోః
నమామి విమలశ్లోకాం కౌశికీం నామ తాముమామ్. ౨౨

ఏదేవియొక్క శూలాయుధమునందు శుంభ- నిశుంభులకీర్తి యస్తమించెనో కౌశికీనామమున ప్రసిద్ధురాలగు ఆ యుమాదేవికి నమస్కరించుచున్నాను.

ప్ర భః—శుంభ నిశుంభులు సహోదరులు. శుంభ- నిశుంభహన్త్రియగు మూర్తి కౌశికి అనునది ప్రసిద్ధము. “కౌశికీనామ సా దుర్గా హన్త్రీ శుమ్భ- నిశుమ్భయోః” అని వెనుక చెప్పఁబడినదిగదా!

మూ॥ యశోదాగర్భజననాద్ యశోదాం గోకులస్య తామ్।
వన్దే భగవతీం నన్దాం విన్ధ్యాచల నివాసినీమ్॥ ౨౩

నందుఁడను గొల్లవానికి భార్యయగుయశోదయొక్క గర్భమున జనించుటవలన గోకులమునకు యశోదయు (కీర్తినొసగినదియు) వింధ్య పర్వతనివాసినియు భగవతియునగు నందాదేవికి వందన మొనర్చు చున్నాను.

ప్ర భ:—గోకులము=శ్రీకృష్ణుని బాలక్రీడలకు వాసస్థానమగు గొల్లపల్లె.

"కంసునివలని భయమువలన దేవకీపుత్రుఁడగు శిశువు (కృష్ణుడు) గోకులమునకును, నందునిశిశువగు నంద, దేవకీ గృహమునకును తీసికొని రాఁబడియెను. ఆమహామాయాస్వరూపిణియగు ఈనందాదేవి కంసుని వెఱపించి యదృశ్యయయ్యెను" అని భాగవతమునఁ జెప్పఁబడియున్నది. ఆయీనంద వింధ్యాచలాధిష్ఠాత్రియగు భగవతి యని గానము చేయఁబడినది. దేవీమహాత్మ్యమునందలిమూర్తి రహస్యమునని ట్లున్నది.

"నన్దా భగవతీనామ యాభవిష్యతినన్దజా
సాస్తుతా పూజితా ధ్యాతా వశీకుర్యాజ్జగత్ త్రయమ్"

నందునకుదయించి నంద అను నామమున ప్రసిద్ధురాలు కాకున్న భగవతిని స్తుతించినవారికిని, పూజించినవారికిని, ధ్యానించినవారికిని గూడ- ఈజగత్త్రియము వశీకరింపఁబడును.

**మూ॥ అమ్బికా ముపతిష్ఠన్తా మేతాశ్చణ్డీమనుష్టుభః।**
**ప్రసన్నాః సాధ్వలఙ్కారాః సిద్ధపద్మేక్షణా ఇవ. ౨౪**

**ఈ యనుష్టుప్పులు = అనుష్టుప్ ఛందోబద్ధము లగు ఈస్తుతులు ప్రసన్నలు- సాధ్వలంకారలు- అగుచు, సిద్ధపద్మాక్షులవలె, అంబిక యగు చండిక నుపాసించి సేవించునుగాక !**

ప్ర భ:—దేవయోని విశేషులు-సిద్ధులు. సిద్ధపద్మాక్షులు = సిద్ధసుందరులు. అనుష్టుప్పుల పక్షమున 'ప్రసన్నలు' అనఁగా శబ్దార్థప్రసాదగుణ విశిష్టలు (అక్లిష్టలు) అనియు సిద్ధసుందరులపక్షమున నిర్మలస్వభావలనియు నట్లే సాధ్వలంకారలనఁగా సమీచీనములగు ఉపమాద్యలంకారములు గలవనియు, శోభనములగు భూషణములు గలవారనియు నర్థము నెఱుంగునది.

అనుష్టుప్పులకును- సిద్ధసుందరులకును ఇట్లు శేషోత్థాపితమగు సాధర్మ్యము వలన నిచట ఉపమ-అలంకారమగుచున్నది.

ప్ర భ:—"ధాటీ" అనుపదమునకు- అభ్యాసాదన మర్థమని హేమచంద్రుడు చెప్పెను.



విద్యానామసి భావో
హృద్యానామసి హావః
దేవానా మసి లీలా
దైత్యానా మసి హేలా. ౭

నీవు వేదాదులగు చతుర్దశవిద్యలకును తాత్పర్య రూపమగు భావమవు. రమణీయములగు వస్తువు లన్నిటియందును విలాసరూపమగు హావమవు. దేవతలయందు స్పృహణీయ(మగు)విలసితమగులీలవు. దైత్యులను తిరస్కరించు హేలవు.



ప్ర భ:—హేల యనఁగా, అవజ్ఞ. అవజ్ఞావిలాసములయందు హేలాపదము వర్తించునని నానార్థరత్నమాల చెప్పుచున్నదిగదా!

గన్తౄణా మసిచేష్టా
స్థాణూనామసి నిష్ఠా
లోకానామసి మూలమ్
లోకాదే రసి జాలమ్. ౮

గన్తలగు చరప్రాణులకు గతివి, స్థాణువులగు స్థిరవస్తువులకు స్థితివి. సర్వలోకములకును మూలమవు. లోకుల జన్మములకు జాలమవు. (మాయికమగు కారణమవు.)

ప్ర భ:—జాలశబ్దము సంస్కృతమున పుంలింగమగునపుడు నీపవృక్షమును, స్త్రీలింగమగునపుడు బీరచెట్టును, నపుంసకలింగమగునపుడు, దంభ-ఇంద్రజాలములను అర్థములగునని త్రికాండశేషము చెప్పుచున్నది. "చర- స్థిరములకు- చరత్వ- స్థిరత్వ- ధర్మరూపిణివి నీవే" యనియైనను చెప్పనగును.

దేవీ, వ్యాపక తేజః
శక్తి, స్తత్త్వవిచారే
అత్యన్తం సుకుమారీ
నారీ, మూర్తి విచారే. ౯

పరమార్థమును విచారించునపుడు ఉమాదేవి- వ్యాపక తేజశ్శక్తి యగుచున్నది. ఆయమ్మ మూర్తిని విచారించునపుడు అత్యంతకోమల గాత్రియగు పార్వతి యగుచున్నది.

ప్రి భ:— వ్యాపక తేజశ్శక్తియన "సర్వవ్యాపియగు జ్యోతిస్సగు సర్వేశ్వరుని శక్తి" అనిగాని "వ్యాపక తేజోరూపిణియగు శక్తి" అనిగాని యర్థముఁజెప్పవచ్చును. వ్యాపక తేజోరూపిణియగుశక్తి అని చెప్పునపుడు శాకపార్థివున్యాయమున, శాకప్రియః=శాకపార్థివఃఅని జెప్పునట్లు, తేజోరూపిణీ, శక్తిః=తేజశ్శక్తిః అను సమాసమును జెప్పుకొనవలయును.

తత్త్వమును విచారించునెడల- దేవీస్వరూపము- సర్వవ్యాపి తేజశ్శక్తియు- విగ్రహవత్త్వ నపేక్షించునెడల- సుకుమారియగు నారియు నగునని భావము.

క్వజ్యోతి ర్మహతోఽస్మా
దాకాశాదపి భూయః?
తత్సర్వం వినయస్తి
తన్వఙ్గీ క్వనునారీ? ౧౦

వ్యాపకమగు నాకాశముకంటెనుగూడ మహత్తరమగు జ్యోతిస్సెక్కడ? ఆకాశము నతిశయించుచు, మహతోమహీయమగు ఆజ్యోతి స్సర్వమును జగన్నిర్మాణముకొఱకు చలింపఁజేయుచున్న తన్వంగి (కృశించిన దేహముగలది) యగుసుందరియెక్కడ? (ఆశ్చర్యము గదా!)

ప్రి భ:— మహతోమహీయమగు జ్యోతిస్స్వరూపమును జగన్నిర్మాణముకొఱకు చరింపఁజేయుట అర్థసిద్ధి. దానికిచట నసంభావ్యత- వర్ణితము. కావున "ప్రత్యఙ్గబంధమ్" అని వెనుకటిశ్లోకమువలె నిదికూడ- అసంభవాలంకారమునకే లక్ష్యమగునని గ్రహించునది.

అవ:-ఇక్కడనుండి "ఆశ్చర్యం విదధానా" అను పదునైదవశ్లోకమువఱకునుగల వాక్యమొక్కటియే యని గ్రహించునది.

దేవేన్ద్రియవిభుత్వమ్
సూర్యాయోనస్రి సహస్రిమ్
ఊష్మాణాం దహనాయ
జ్యోత్స్నామోషధిరాజే. ౧౧

దేవేంద్రునికి ఈశిత్వమును, ప్రభుత్వమును, సహస్రరశ్మియగు సూర్యునకు కిరణసహస్రమును (వేయికిరణములను) వాల్చువాఁడగు నగ్నికి వేడిమిని, ఓషధుల కధిపతియగు చంద్రునకు వెన్నెలను(నీవొక్క-తెవే యిచ్చుచున్నదానవని పదునాల్గవశ్లోకముచే సమన్వయించుకొనునది.)

వాతాయామిత వీర్యం
విస్తారం గగనాయ
సాన్ద్రత్వం వసుధాయై
తోయాయ ద్రవభావమ్. ౧౨

(జగత్ప్రాణుఁడగు) గాలికి అత్యధికమగు బలమును, ఆకాశమునకు వైశాల్యమును, భూమికి నిబిడత్వమును (ఘనీభావమును) నీటికి ద్రవత్వమును (ద్రవీభావమును).

మాహాభాగ్య మపారం
కోటిభ్యో విబుధానామ్।
చిత్రాః కాశ్చన సిద్ధీ
ర్లక్షేభ్యో మనుజానామ్. ౧౩

దేవకోటులకు, అమితమగు మహాభాగ్యమును, మనుజలక్షలకు అద్భుతములు అనిర్వాచ్యములు అగు సిద్ధులను.

ప్రభ:- 'కోటి' అనునది శతలక్షసంఖ్యావాచకమును, లక్ష- శతసహస్రసంఖ్యావాచకమును, అగును. (కోటియన నూరులక్షలు. లక్షయన నూరువేలు,) అయినను "దేవకోటులకు" అనుదానికి "అమితసంఖ్యలగు దేవతలకు" అనునర్థమును, "మనుజలక్షలకు" అనుపదమునకు, "అత్యధికసంఖ్యలగు మనుష్యులకు" అనునర్థమును గ్రహింపవలయును. అపారమనఁగా అనంతమని యర్థము. మాహాభాగ్యమన, గొప్పదగు నైశ్వర్యాంశమని యర్థము.

మహాన్ భాగో అంశః యేషాం తే, మహాభాగాః, తేషాంభావో మాహాభాగ్యమ్. గొప్పదగు నైశ్వర్యాంశముగలవారు మహాభాగులు. తద్భావము మాహాభాగ్యము.

స్థాణుభ్యో ధృతిశక్తిం
గన్తృభ్యో గతిశక్తిమ్
కస్మాచ్చిన్నిజకోశా
దేకా దేవి దదానా. ౧౪

దేవీ! కదలని వస్తువులకు ధృతిశక్తిని, కదలెడు ప్రాణులకు గతిశక్తిని, ఇట్లు పూర్వోక్తమగు సర్వమునుగూడ అనిర్వాచ్యమగు నిజకోశమునుండి నీవొక్కతెవే ఇచ్చుచున్నదానవు.

ప్రభ:- ధృతిశక్తియనఁగా, స్థిరత్వము నొదవించు ధారణాసామర్థ్యము. గతిశక్తియనఁగా, గమనసామర్థ్యము. ఎనిమిదవశ్లోకమున గంతలగు చరప్రాణుల యందలి "చలనమును" స్థిరవస్తువులయందలి స్థితియుఁ గూడ దేవికి స్వరూపమని చెప్పఁబడియెను. ఈశ్లోకమునందట్లుగాక, దేవి- చరాచరములకు 'గమనధారణా శక్తి దాత్రి' అని చెప్పఁబడినది.

పదునొకండవశ్లోకమునుండియు చెప్పఁబడిన విభుత్వము మొదలు పదునాల్గవశ్లోకమునఁ జెప్పఁబడిన గతిశక్తివఱకును గల సర్వమునుగూడ అద్వితీయయగు ఉమాదేవి, చెప్పుటకు వీలుపడని స్వీయనిధానమునుండి యిచ్చుచున్నదని భావము.

ఆశ్చర్యం విదధానా
సర్వంవస్తు దధానా
హా న్తత్వం మమమాతః!
కాచిత్ కోమలగాత్రీ. ౧౫

మాతల్లీ! అద్భుతమును అసామాన్యమును అగు కర్మను చేయుచున్నదానవును, చరాచరమగు విశ్వమునంతను ధరించుచున్నదానవును అగునీవు ఒకానొక కోమలగాత్రివైయున్నావు. ఆశ్చర్యము!

శ్రోణీభార నతాయాం
కస్యాం చిత్తనుగాత్ర్యామ్
ఈదృక్షా యదిశక్తిః
కా వేత్తో ననుమాయా?

శ్రోణీభారముచేత నమ్రయగు ఒకానొకతను గాత్రియందు (అల్పమగు గాత్రముగల స్త్రీయందు) అఘటనఘటనాపటీయసియగు నిటువంటి శక్తియుండు నెడల నింతకంటె మాయ యింకేమున్నది?

ప్ర భ:—పూర్వోక్తప్రకారమై విలసితమగుశక్తి యొకానొక కాంతయం దుండుట మాయకాక వేఱేమగునని భావము.

'కావా తే నను మాయా' అను పాఠమునందు నీమాయ యింతకంటె వేఱ గునా? అనునర్థము సిద్ధించును, కావున నుభయపాఠములందునుగూడ గలతాత్పర్య మొక్కటియే యగును.

రూపం తే - తనుగాత్రం
వాణీ తే - మృదునాదా
చాపం తే - మధురేక్షుః
పాణిస్తే - సుకుమారః.　　　౧౭

అమ్మా! నీరూపము తనుగాత్రము, నీవచనము మృదునాదము; నీచాపము మధురేక్షువు, నీహస్తము సుకుమారము.

ప్ర భ:—నీరూపము స్థూలముకాక యల్పమగుటచేత సుందరమగు గాత్రము గలది. నీవు సౌందర్య సంపన్నవగు అతిలలితగాత్రివని భావము. నీమాట మంజుల మగు స్వరముకలది. నీవు కలకంఠివని భావము. నీధనువు తీయని చెఱకు. కావున నీవు స్వాధీనకామవగు కామేశ్వరివి. కాముఁడు- ఇక్షుధనుష్కుఁడనునది ప్రసిద్ధము. ఆచెఱకువిల్లు నీయదియే యగుటవలన నీవు వశీకృతకామ వగుచున్నావని భావము. నీపాణి కోమలము.

లోలే! లోచనయుగ్మే
భీరుత్వం ప్రకటం తే
బ్రహ్మాణ్డం త్వ దధీనమ్
శ్రద్ధత్తా మిహ కోవా.　　　౧౮

చంచలయగు దేవీ! నీ నేత్రయుగళమున భీరుత్వము ప్రకా శించుచుండును. అయినను ఈబ్రహ్మాండమంతయు నీయధీనమునందున్నది. ఈయంశము నెవఁడు విశ్వసించును?

ప్ర భ:- పూర్వోక్తప్రకారమున నీరూప, వచన, చాప, హస్త, నయనములు- ఇట్లింత లలిత రమణీయములగుచుండినను గూడ నీవిశ్వము త్వదధీనమైయున్నది ఈయంశమే నమ్మశక్యము గాకున్నదని భావము.

భ్రూభఙ్గం కురుషే చే
న్ముగ్ధే! గౌరి! ముఖాబ్జే
భూతాన్యప్యయిబిభ్య
త్యేజేరన్నపి తారాః. ౧౯

ముగ్ధవు గౌరివి అగుపార్వతీ! నీవు వదనకమలమున భ్రూభంగ మొనర్చితివా, పృథివ్యాది భూతములన్నియు భయపడును. నక్షత్రములు కంపించును.

ప్ర భ:-లజ్జావిజిత మన్మథయగు ఉదయద్ యౌవనముగ్ధయనియు, దశవర్షవయస్కయగు అముగ్ధబాలిక-గౌరియనియు చెప్పఁబడును. అట్టిముగ్ధయు, గౌరియు నగు పార్వతి రోషముచేత నొనర్చిన భ్రూభంగము తటస్థుఁడగు కవికి రమణీయమైయున్నను, భూత నక్షత్రాదులకు భయకంపాదిప్రదమే యగునని భావము. "భీషాస్మా ద్వాతః పవతే, భీషోదేతిసూర్యః" "బ్రహ్మమువలని భయమున వాయువు వీచును. సూర్యుఁడుదయించును" అనిశ్రుతిగదా!

శుద్ధాన్తేశ్వరి! శమ్భో
రిచ్ఛాచేత్ తవ కాఽపి
ఘోరోఽగ్నిస్తృణగర్భాద్
ఘోరాగ్నేరపి శైత్యమ్. ౨౦

ఓశివాంతఃపురసుందరీ! నీయిచ్ఛామాత్రమున, తృణగర్భము నుండి, భీషణాగ్ని జనించును. ఆభీషణాగ్నినుండి శైత్యము (చల్లదనము) ఉదయించును.

ప్ర భ:-తృణమనఁగా గడ్డిపరక. దానినుండి ఘోరమగు నగ్ని యుదయించుట అస్త్రవిద్యా ప్రసిద్ధము. అనుష్ణమగు తృణమునుండి ఘోరమగునగ్ని జనించుట చేత శరవణజమగు నగ్ని సూచింపఁబడుచున్నది. అగ్నినుండి శైత్యముదయించు ననుటచేత "అగ్నేరాపః" అను శ్రుతి ప్రసిద్ధమగు [illegible] ప్రవచింపఁబడినది.

ఇచట ముఖ్యముగా గ్రహింపఁదగిన యర్థము, "నీయిచ్ఛకు శక్యముకాని దేదియునులేదు." నీవు తలఁపరాని యద్భుతములను సాధించు స్వతంత్రురాలవు." అనునదియే.

అవః-ఇప్పుడు శివశక్తులకుఁగల కార్యవిభాగమును ప్రదర్శించుచున్నాఁడు.

మూ॥ ద్రష్టుం విశ్వమపారం
భార స్తేదయితస్య
కర్తుం కార్యమశేషం
శ్రీమాతస్తవభారః.　　౨౧

శ్రీ మాతా! అపారమగు విశ్వము నీక్షించుటయే నీభర్తకుఁ గల కార్యభారము. సృష్ట్యాదికార్యము- నిశ్శేషముగ నొనర్చుట నీకుఁగల కార్యభారము.

ప్ర భః-సర్వేశ్వరుడు జగదభిముఖియగు సృష్టినిమాత్రమే ప్రసరించుచు సాక్షియగుచున్నాఁడు: కాని సర్వేశ్వరివగు నీవే సర్వకార్యనిర్వాహికవనిభావము. మీదిశ్లోక మీయంశమునే స్ఫుటీకరించును.

సాక్షీ కేవల మీశః
కర్తుం భర్తుముతాహో
హర్తుంవాఽఖిలమమ్బ !
త్వం సాక్షాద్ ధృతదీక్షా.　　౨౨

అమ్మా! ఈశ్వరుడు కేవలమును సాక్షి (ద్రష్ట) యగుచున్నాఁడు. నీవు సర్వమును సృజించుటకుగాని భరించుటకుగాని హరించుటకుఁగాని దీక్షఁబూనినదానవు.

ప్ర భః—సృష్టి-స్థితి- సంహారములయందు పరమేశ్వరి 'బద్ధవ్రత' అని చెప్పుటచేత సాక్షిత్వద్వారమున నీకార్యములయందు పరమేశ్వరునను అభ్యనుజ్ఞానరూపమగు పరంపరాసంబంధము గమింపఁజేయఁబడుచున్నది.

మూ॥ కారజ్కారము మే! యద్
బ్రహ్మాణ్డాని నిహంసి
తస్మన్యే సురమాన్యే
బాలైవాత్వ! సదాత్మమ్. ౨౩

సురపూజ్యవగు జగదంబా! బ్రహ్మాండములను రచించి రచించి భంజించుచుందువు, గావున నీవెప్పుడునుగూడ బాలవేయగుదువని తలంచుచున్నాను.

ప్ర భ:-శైశవదశయందు బాలురు క్రీడావస్తువులను చేసిచేసి వానిని మరల భంజించుచుందురుగదా! ఇచట హేతువుకాని బాలాత్వము- బ్రహ్మాండములను మరల మరల సృజించి సంహరించుటకు హేతువుగా నుత్ప్రేక్షింపఁబడినది, కావున నిది హేతూత్ప్రేక్ష యగుచున్నది.

దీనిచేత-"అనాయాససిద్ధములగు భగవతీలీలావిలాసితములే-సర్గాదికార్యములు" అనునంశము ద్యోతితము.

మూ॥ లీలోజ్జీవితకామే!
రామే! శఙ్కరసక్తే!
త్వత్పాదార్చనసక్తం
భక్తం మాంకురుశక్తమ్. ౨౪

శంకరునందనురక్తవై, శృంగారలీలచేత కాము నుజ్జీవింపఁజేసిన సుందరీ! భవత్పాదార్చనానురక్తుఁడను భక్తుఁడను అగు నన్నుశక్తియుక్తునిగాఁ జేయుము.

ప్ర భ:—హరనేత్ర దగ్ధుఁడగు కందర్పునకు, అనాయాససిద్ధమగు విలాసముచేత పునర్జీవనము నొసంగితివి. త్వచ్చర్ణసేవాసక్తుఁడనగు నాకు బలము నొసంగుమని భావము. ఆధ్యాత్మికముగాని, ఆధిలౌకికముగాని, కార్యమేదయినను బలము లేనిదే నిర్వహింపఁ బడదుగదా! "నాయమాత్మా బలహీనేన లభ్యః" 'ఈయాత్మ బలహీనునకు లభింపఁడు' అని వినఁబడుచున్నది. కావున నన్నుశక్తిమంతునిగాఁ జేయుమని ప్రార్థించుచున్నాఁడు.

మూ. సర్వత్ర నన్దసి, విముఞ్చసి సర్వతోఽమ్బ!
సర్వత్ర, సంసరసి, గర్జసి, సర్వతోఽపి,
సర్వత్ర దేవి! కురుషే తవ కర్మజాల
వైచిత్ర్యమీశ్వరి! నిరూపయితుం క్షమః కః? ౧౦

ఈశ్వరీ! అంతటను ఆనందస్వరూపిణి వగుటవలన నీవే యానందించుచున్నావు. అన్నిటివలనను విడుచు చున్నావు, అంతటను సంచరించుచున్నావు. అన్నిటిమూలమునను గర్జించుచున్నావు, అన్నిటిమూలముననుగూడ (పని) చేయుచున్నావు. నీకర్మజాలవైచిత్ర్యమును నిరూపించుట కెవఁడు సమర్థుఁడు?

ప్ర భ:—మీది శ్లోకమునందలి 'సంసరసి' అనుపదమునకు సందర్భము ననుసరించి, సంచరింతువు అనునర్థము చెప్పఁబడినది.

ఇందు గర్జించుట వాగింద్రియ వ్యాపారము. చేయుట పాణీంద్రియవ్యాపారము, సంచరించుట పాదేంద్రియ వ్యాపారము. విడుచుట పాయ్వింద్రియవ్యాపారము, ఆనందించుట ఉపస్థేంద్రియవ్యాపారము అని యెఱుంగునది.

మూ॥ విశ్వామ్బికే! త్వయి రుచాంపతయః కియన్తో?
నానావిధాబ్ధికలితాః క్షితయః కియత్యః?
బిమ్బాని శీతమహసాం లసతాం కియన్తి?
నైతచ్చ వేద, యది కో విబుధో బహుజ్ఞః? ౧౧

ఓ విశ్వజననీ! ఆధారభూతవగు నీయందు సూర్యులెందఱున్నారో, లవణేక్షుసురాదిసముద్రవలయితములగు దేశము లెన్ని కలవో, ప్రకాశించుచున్న చంద్రమండలము లెన్ని కలవో, ఈయంశమునుగూడ తెలియనియెడల బహుజ్ఞుఁడగు విబుధుఁ డెవఁడున్నాఁడు?

ప్ర భ:—ఒక్కొక్క సూర్యకుటుంబమునకు నక్షత్రస్వరూపముననున్న సూర్యులనేకులు మూలభూతములగు భూములైయున్నారు. వారినాశ్రయించి చంద్రులనేకులు సంచరించుచున్నారు. ఈయర్థమును, ప్రథమశతకమునందలి ద్వితీయస్తబకమునందుగల 'పునర్విపాకత్వ' 'విసర్జనేన' అనుశ్లోకములందు పరిశీలించునది. లోకులందఱును కించిద్జ్ఞులే యనిభావము.

అవ:—తరువాత బ్రాహ్మి మొదలగు సప్తమాతృకలవైభవమును వేర్వే
ఱుగ నేడుశ్లోకములచేఁ దెలుపుచున్నాఁడు.

మూ॥ అవ్యక్తశబ్దకలయాఖిల మన్తరిక్షమ్
త్వం వ్యాప్య దేవి! సకలాగమసంప్రణీతే!
నాదోఽస్యుపాధివశతోఽథ వచాంసి, చాసి।
బ్రాహ్మీంవదన్తి కవయోఽముక వైభవాం త్వామ్. ౧౨

సకలతంత్రశాస్త్రసంప్రణీతవగు నో దేవీ! అవ్యక్తమగు ప్రణవము
యొక్క అంశముచేత అంతరిక్షమును నంతను వ్యాపించి నీవు నాదమవై
యున్నావు. తదుపరి ఉపాధివశమువలన వాక్కులుగూడ నైయు
న్నావు, ఇట్లు కార్యకారణోభయవిధవాగాత్మకమగు వైభవముగలిగి
యున్న నిన్ను పండితులు బ్రాహ్మివని (బ్రహ్మశక్తివని) చెప్పుదురు.

ప్ర భ:—అస్పష్టమును ప్రణవరూపమును నగు కారణశబ్దస్వరూపముతో
ఆకాశమునందు వ్యాపించి నాదశబ్దవాచ్యవగు నీవు కారణవాగ్రూపవై
యున్నావు. తరువాత కార్యోపకరణవశమున వ్యక్తవాగ్రూపిణి వగుచున్నావు. ఇట్లు
కార్యకారణోభయ వాగ్రూపిణివగు నిన్ను కవులు బ్రాహ్మివని చెప్పుదురని భావము.
"ఉపసమీపే ఆదధాతి" అను వ్యుత్పత్తివలన ఉపాధియనఁగా, కార్యమున కుప
కరణమగు వస్తువని యర్థము.

అవ:—పిమ్మట వైష్ణవీమాతృకను వ్యాఖ్యానించుచున్నాఁడు.

మూ॥ నానావిధైర్భువనజాల సవిత్రి! రూపై
ర్వ్యాప్తైక నిష్కలగభీరమహస్తరఙ్గైః
వ్యక్తం విచిత్రయసి సర్వమఖర్వశక్తే!
సా వైష్ణవీ తవకలాకథితామునీన్ద్రైః. ౧౩

జగజ్జాలజనయిత్రివగు నోయనల్పశక్తీ! వ్యాప్తము, ఏకము,
నిష్కళము, గభీరము అగుజ్యోతిస్సుయొక్క తరంగములుగలిగిన
బహువిధములగు రూపములచేత ప్రపంచగతమగు వస్తునముదాయ

మంతయు వేర్వేరగురూపమున వ్యక్తమగునట్లు- విచిత్రముగాఁజేయు చున్నావు. ఏకళచేత నీవిట్లుచేయుచున్నావో, ఆనీకళను తాపసోత్త ములు వైష్ణవి (విష్ణుశక్తి) అని చెప్పుచున్నారు. కారణమగుజ్యోతికి కార్యావస్థయందు రూపాత్మకతాసిద్ధి ప్రసిద్ధము. వ్యక్తమగుసృష్టికి రూపసంపాదికయగు మాత విష్ణుశక్తియని తాత్పర్యము.

శ్లో॥ వ్యక్తిత్వమమ్బ! హృదయే హృదయే తథాసి,
యేనప్రభిన్న ఇవబద్ధ ఇవాన్తరాత్మా
సేయం కలా భువననాటకసూత్రభర్త్రి!
మాహేశ్వరీతికథితా తవచిద్విభూతిః. ౧౪

ఓ భువననాటకసూత్రభర్త్రి! అంబా! ప్రతిహృదయమునందును వ్యక్తిత్వమును (వేర్వేరుగా నేను, నేను, అనుతలంపు గలిగియుండుటను) ధరింపఁజేయుచున్నావు. ఇట్లు వ్యక్తిత్వమును సంఘటించుటచేత, (సర్వాంతరుఁడగు ఆత్మ- ఒక్కఁడేయయినను, ప్రభిన్నుఁడు (అనేకుఁడు వలెను, నిత్యముక్తుడయినను, బద్ధుఁడువలెను అగుచున్నాఁడు. ఇట్లు భేదభ్రమ నొదవించుచున్న యేకళచేత, అంతరాత్మ ఒక్కఁడేయయి నను, అనేకుఁడువలెను,అవ్యక్తుఁడయినను వ్యక్తుఁడువలెను. స్వాతంత్రు డైనను, బద్ధుఁడువలెను అగుచున్నాఁడో; ఆయీ నీకళయగు చిద్ విభూతి- మాహేశ్వరి (మహేశ్వరశక్తి) అని చెప్పఁబడుచున్నది.

ప్రభః—'నాదాత్మిక యగు వాగ్ విభూతి, బ్రాహ్మీకల' అనియు, "విశ్వ రూప స్థితిసంపాదికయగు శోభావిభూతి వైష్ణవీకళ" అనియు కడచిన శ్లోకముల యందు ప్రతిపాదించి యీశ్లోకమునందు-అగణిత భేదభ్రమ భూయిష్ఠ జగన్నాటక సంవిధాత్రియు, హృదయస్థిత-ఈశ్వరమాయయుఅగు చిద్విభూతి'మాహేశ్వరీకళ' అని చెప్పఁబడినది. ఇందు హృదయ-ప్రభిన్న ఇవ- బద్ధఇవ-భువననాటకాది శబ్ద ప్రయోగమువలన

ఈశ్వరస్సర్వభూతానాం హృద్దేశేఽర్జున తిష్ఠతి
భ్రామయన్ సర్వభూతాని యన్త్రారూఢానిమాయయా॥

"యంత్రారూఢములగు ప్రాణులను మాయచేత నాడించుచు నీశ్వరుఁడు వాని హృదయదేశమునందున్నాఁడు."

అను భగవద్గీతాశ్లోకార్థమును సంక్షేపించుబడినదని తెలియుంగువది.

అవ:—ఇప్పుడు 'కౌమారి' అనుమాతృకను తెలుపుచున్నాఁడు.

మూ॥ ఆహారశుద్ధివశతః పరిశుద్ధసత్త్వే
నిత్యస్థిరస్మృతిధరే వికసత్ సరోజే
ప్రాదుర్భవన్త్యమలతత్త్వవిభాసికా యా
సా త్వం స్మృతా గురుగుహస్య సవిత్రి! శక్తిః. ౧౫

సవిత్రీ! ఆహారశుద్ధివశమువలన నిర్మలమగు అంతఃకరణము గలిగినదియు, స్థిరమగు ప్రజ్ఞను ధరించునదియు, వికసించిన పుండరీకము (హృదయము) గలదియునగు జనమునందు శుద్ధసత్త్వమును ప్రకాశింపఁజేయుచున్నదానవై యావిర్భవించుచున్న నీవు-కౌమారి (కుమారశక్తి) వని స్మరింపఁబడుచున్నావు.

ప్రభ:—ఆహారశుద్ధి- స్థూలరూపమునను సూక్ష్మరూపమునను ద్వివిధమగుచున్నది. అందు దేహాశ్రితమగు నంతఃకరణమునకు సాత్త్వికాహారముచేత సంపాదింపఁబడినది- స్థూలరూపముననగు ఆహారశుద్ధి యగుచున్నది. శబ్దాదులగు విషయములకు శ్రోత్రాదులగు నింద్రియములతోడి సంయోగము గలిగినపుడు

'గుణా గుణేషు వర్తన్తే' భగవద్గీత ౩అ. 28 శ్లో.

(శ్రోత్రాదులే శబ్దాదులయందు ప్రసరించుచున్నవి. ఆత్మ ప్రవర్తించుటలేదు)

"ఇన్ద్రియాణీన్ద్రియార్థేషు" భగవద్గీత 5అ. 9 శ్లో.

(ఇంద్రియములగు శ్రోత్రాదులే. ఇంద్రియార్థములగు విషయములందు వర్తించుచున్నవి. ఆత్మనగు నేనేమియుఁ జేయుటలేదు.)

అని వ్యవసాయాత్మికయగు బుద్ధిచేత, వినుట, చూచుట, మొదలగు ప్రకృతివ్యాపారములకంటె ఆత్మను వేరుగా నెఱిఁగి మెలఁగువానికిఁ గలుగునది- సూక్ష్మరూపముననగు నాహారశుద్ధి యగుచున్నది, ఆహరించుటయన స్వీకరించుట అని యర్థము. కావున ఆహ్రియమాణములు=స్వీకరింపబడినవి అగువిషయములు - 'ఆహారము' అని చెప్పఁబడును. కావున రాగాదులతోడి సంబంధము లేకుండునట్లు

గ్రహింపఁబడుచున్న విషయములయొక్క శుద్ధి-ఆహారశుద్ధియని ఇచటఁ జెప్పఁబడినది. గురుగుహుఁడనఁగా కుమారుఁడు (స్కందుఁడు).

ఛాందోగ్యశ్రుతియందుఁగల నారద సనత్కుమారాఖ్యాయిక యందీయంశమిట్లు చెప్పఁబడినది. "ఆహారశుద్ధి కలుగునపుడు అనఁగా, శబ్దాదివిషయవిజ్ఞానము రాగద్వేష మోహ దోషసంస్పృష్టము కానపుడు అంతఃకరణ శుద్ధికలుగును, అంతఃకరణము శుద్ధమగునపుడు తెలియఁబడిన భూమస్వరూపమగు నాత్మయందు ధ్రువమగు (అవిచ్ఛిన్నమగు)స్మృతి(మరపులేమి)కలుగును. స్మృతికలుగునపుడుహృదయాశ్రయములగు సర్వగ్రంథులును విడిపోవును. [సత్యము స్ఫురించును] అని మృదితకషాయుఁడగు (దోషరహితుఁడగు) నారదునకు భగవానుఁడగు సనత్కుమారుఁడు తమస్సునకావలనున్న పరమార్థ తత్త్వమును చూపించెను. ఆసనత్కుమారునే స్కందుఁడని తద్విదులు చెప్పుదురు." ఇట్లు ఛందోగులు- స్కందుఁడు- సనత్కుమారుఁడు- ఒకఁడేయని చెప్పుచున్నారు.

ఇట్లు ఆహారశుద్ధివలన నిర్మలాంతః కరణులకు మనుష్యులకు తన్మూలమున ధ్రువమగు స్మృతి కలుగునపుడు వారిహృదయములయందు పరమేశ్వరశక్తి చేత నిర్మలమగుసత్యము ప్రకాశింపఁ జేయఁబడునను నీయంశము కుమారునిచేఁ దెలుపబడుటవలన నాశక్తి- కౌమారి (కుమారశక్తి)అని ప్రవచింపఁబడినదని గ్రహించునది.

అ వ:—పిమ్మట "వారాహి" అనుమాతృకను స్తుతించుచున్నాఁడు.

మూ॥ హవ్యం యయా దివిషదో మధురంలభన్తే
　　కవ్యం యయా రుచికరం పితరో భజన్తే
　　అశ్నాతిచాన్నమఖిలోఽపి జనోయయైవ
　　సా తే వరాహవదనేతి కలామ్బ! గీతా.　　౧౬

అమ్మా! దేవతలచేత మధురమగు హవ్యమును గ్రహింపఁజేయునదియు, పితరులచేత రుచికరమగు కవ్యమును స్వీకరింపఁజేయునదియు సర్వజనులచేతనుగూడ అన్నమును భుజింపఁజేయునదియు నగు; నీకళ- వరాహవదన (వారాహి) అని గానము చేయఁబడినది.

ప్ర భ:-దేవతలకొఱకు ఈయఁబడు నన్నము- హవ్యమనియు పితృదేవతల కీయఁబడునన్నము- కవ్యమనియు చెప్పఁబడును. "హవ్యకవ్యే దైవపైత్రే అన్నే" అని అమరముగదా! సర్వమును భుజించునదియు (భోక్త్రియు) భుజింపఁజేయునదియు

వగు నీకళ – వారాహి. దీనిచేతనే దేవతలు, పితరులు, మనుష్యులుకూడ భోజన సామర్థ్యవంతులుగాఁ జేయబడుచున్నారని భావము.

అ వ:—అనంతరము 'ఇంద్రాణి' అను మాతృకను స్తుతించుచున్నాఁడు.

మూ|| దుష్టాన్నిహంసి జగతామవనాయసాక్షా
ద న్యైశ్చఘాతయసి తప్తబలైర్మహద్భిః
దమ్భోళిచేష్టితపరీక్ష్య బలాబలారేః
శక్తిర్మ్యగాది తవ దేవి! విభూతిరేషా. ౧౭

దేవీ! లోకమును రక్షించుటకు నీవు స్వయముగానే దుష్టులను చంపుచున్నావు. ప్రతప్తబలులును; మహాసత్త్వులునునగు నితరులచేతఁ గూడ చంపించుచున్నావు. ఇట్లు చేయుచున్న నీవిభూతి- వజ్రాయుధ మునొక్క చేష్టితముచేత పరీక్షింపఁదగిన బలముగలదై ఇంద్రాణి (ఇంద్రశక్తి) అని పేర్కొనఁబడుచున్నది.

ప్ర భ:—దుష్టులను స్వయముగా నిగ్రహించునదియు, ఇతరులచేత నిగ్ర హింపించునదియునగు మాతృవిభూతి–ఇంద్రాణిఅనితాత్పర్యము. ఈశక్తియొక్క బల నిర్ణయమున పరీక్షకము వజ్రాయుధమే యగును. అది బలారియగు నింద్రునికి సం బంధించినది. కావున నీశక్తి 'ఇంద్రాణి' అని పేర్కొనఁబడినది.

అ వ:-పిదప 'చాముండ' అనుసప్తమ మాతృక నభివర్ణించుచున్నాఁడు.

మూ|| సఙ్కల్పరక్తకణపానవివృద్ధశక్త్యా
జాగ్రత్సమాధికలయేశ్వరి! తే విభూత్యా
మూలాగ్నిచణ్డ శశిముణ్డ తనుత్రిభేత్ర్యా
చాముణ్డయాతనుషు దేవి! నకింకృతం స్యాత్. ౧౮

ఈశ్వరివగు నోదేవీ! సంకల్పములను రక్తబిందువులను గ్రోలు టచేత మిక్కిలి వృద్ధినొందిన శక్తిగల జాగ్రద్దశయందగు సమాధియను కళచేత మూలాగ్నియను చండునియొక్కయు శశియను ముండుని యొక్కయు కవచభూతములగు గ్రంథులనుభేదించునదియగు చాముండ యనుపేరుగల నీయొక్క విభూతిచేత మాశరీరములయందు చేయ బడనిదేమున్నది?

ప్ర భః—సంకల్పములనఁగా; చిత్తవృత్తి విశేషములు. సమ్యగాధీయ తే మనోఽస్మిన్నితి సమాధిః అను వ్యుత్పత్తివలన దేని యందు మనస్సు చక్కగా నుంచఁబడునో అది సమాధియని చెప్పఁబడును. చండుఁడనువాఁడును, ముండుఁడనువాఁడును, రాక్షసులు. మూలాగ్ని యనఁగా కులకుండమను పేరుగల మూలాధారమునందున్న యగ్ని.

విశే:-దేవీ మాహాత్మ్యమునందు చాముండాశక్తి, రక్తబీజాసురుని రుధిరమును పానము చేసినట్లును, చండ-ముండులను ఖండించినట్లును చెప్పఁబడియున్నది. ఆ కథాంశమునకు సంబంధించిన యాధ్యాత్మిక తత్త్వము నీమహాకవి యీశ్లోకమున రూపకాపదేశమున నుద్ఘాటించుచున్నాఁడు.

అదెట్లనిన:-దుర్గాసప్తశతియందలి యష్టమాధ్యాయమున దేవికి 'చాముండ' అనునామ మెట్లులభించినదియు నిట్లు చెప్పఁబడినది.

శ్లో. యస్మాచ్చణ్డంచ ముణ్డంచ గృహీత్వా త్వముపాగతా
చాముణ్డేతి తతో లోకే ఖ్యాతా దేవి! భవిష్యసి॥

(దేవీ! నీవు, చండుని, ముండుని నిగ్రహించుటవలన లోకమున నీవు 'చాముండ' అనుపేరుగల దానవు కాఁగలవు)

మఱియు నవమాధ్యాయమున, రక్తబీజుఁడను నసురునిగూర్చి ప్రస్తావించునపుడు క్రిందితీరునఁ జెప్పఁబడినది.

పలాయనపరాన్ దృష్ట్వా దైత్యాన్ మాతృగణార్దితాన్
యోద్ధుమభ్యాయయౌ క్రుద్ధో రక్తబీజో మహాసురః॥
... ... ... ... ...
తస్యాహతస్య బహుధా శక్తిశూలాదిభిర్భువి
పపాత యో వై రక్తౌఘస్తేనాసఞ్ఛతశోఽసురాః॥
తైశ్చాసురాసృక్సమ్భూతైరసురైః సకలంజగత్
వ్యాప్తమాసీత్తతో దేవా భయమాజగ్మురుత్తమమ్॥
తాన్ విషణ్ణాన్ సురాన్ దృష్ట్వా చణ్డికా ప్రాహ సత్వరా
ఉవాచ కాళీం చాముణ్డే! విస్తీర్ణం వదనంకురు॥
మచ్ఛస్త్రపాత సమ్భూతాన్, రక్తబీజాన్మహాసురాత్।
రక్తబిందూన్ ప్రతీచ్ఛత్వం వక్త్రేణానేన వేగినా ॥

మాతృ-గణము చేత మర్దింపఁబడి। పలాయనము చిత్తగింపనున్న దైత్యులను చూచి రక్తబీజుఁడను మహాసురుఁడు క్రుద్ధుఁడై యుద్ధమునకువచ్చెను.........

శక్తి శూలాదుల చేత వధింపఁబడిన రక్తబీజునియొక్క రక్తసందోహము బహువిధముల ప్రసరించెను. తన్మూలమున నసంఖ్యాకులగు రాక్షసులు బయలువెడలిరి.

మహాసుర రక్తసంభూతులగు నాయసురులచేత జగత్తంతయు వ్యాపించుటవలన దేవత లత్యధికమగు భయము నొందిరి. విషణ్ణులగు నా దేవతలనుజూచి యోదార్చి చండిక సత్వరయై కాళితో నిట్లనెను.

"చాముండా! నీనోరు విరివియగునట్లు తెరువుము. మచ్ఛస్త్రపాతమున రక్త బీజమహాసురునినుండి, స్రవించుచున్న రక్తబిందువులను నీనోటితో వడిగాఁ ద్రావుము." మీఁది (౧౯వ) శ్లోకమున చాముండా విభూతి స్వరూపము- 'జాగ్రత్ సమాధికల' అని చెప్పఁబడినది.

జాగ్రద్దశయందే ఏకాగ్రధ్యానరూపమును, సహజమును, అగుసమాధి సిద్ధించును కాని సుషుప్తియందుఁగాని, అష్టాంగయోగ నిష్పాద్యమగు లయావస్థయందుఁ గాని సిద్ధింపదు.

ఆజాగ్రత్ సమాధియను విచిత్రవిద్యయే చాముండా విభూతిస్వరూపమగు చున్నది. కాని ఆమెయొక్క- శక్తి- సంకల్పముల నుపహరించుటవలన వృద్ధినొందు చున్నది. ఈసంకల్పోపసంహరణమే - చాముండాకృతమగు రక్తబీజాసుర- రుధిర బిందుపానము. మూలాధారమునందలి అగ్నిని ప్రబోధించుటయే చండతనుత్రమును భేదించుట, యోగులు కానివారియందు మూలాధారమునందలి యగ్ని- తమోధూమావృతమగుటవలన, అసురునివలె ప్రతికూల మగునది- చండము (తీవ్రము) అగుచుండును. కావుననే ఆమూలాగ్ని- చండుఁడని చెప్పఁబడినది. చండ- కవచభేదన మనఁగా, మూలాగ్నియందలి గ్రంథులను భేదించుట. గ్రంథిభేదనము చేతనేగదా! మూలాధారమునందలి యగ్ని- ఆవరణములేకుండ ప్రజ్వలించును.

యోగి ప్రసిద్ధమగు సహస్రార (చక్ర)ము నందలి అమృతాంశు (చంద్ర) మండలమునకు ప్రావరణము (కప్పునది) అగు మనస్సే- ముండుఁడను అసురుఁడు. కావున మనస్సుయొక్క- నిగ్రహమే- ముండ- కవచభేదనము.

మనోనిగ్రహముచేతనే సహస్రార చక్రమునందలి అమృతకిరణఝరినిఆస్వాదించి యోగి- అమృతియగునది!

ఇట్లు రక్తకణ పాన- చండ- ముండ- కవచ భేదనరూపమగు సంకల్పోప సంహార- మూలాగ్ని ధూమావరణ- సహస్రారావరణ- ప్రభేదములు- ఏకళచేత నిర్వహింపఁబడుచున్నవో. అది- మహాశక్తియగు నుమాదేవియొక్క- చాముండా విభూతి అనుగహనమును, యోగిజనైక వేద్యమునునగు నంశముసంక్షేపమగుతీరునసమన్వయింపఁబడినదని యెఱుంగునది. ఈశ్లోకము ఈమహాకవి ప్రతిభను దెల్పుచున్నది.

అవః-ఇట్లు సప్తమాతృకలను సంస్తుతించి, మహాశక్తియగుమాయ- స్థానభేదమువలన నాలుగువిధములగు ననుచున్నాఁడు.

ఆంధ్రభాషయందుఁగూడ "అనుష్టుప్" అనుశబ్దమునకు స్త్రీత్వమును వివక్షించుటవలన ప్రసన్నములు సాధ్వలంకారములు అనుటకుమారుగ- ప్రసన్నలు- సాధ్వలంకారలు అనిప్రయోగింపఁ బడియెనని పాఠకులు గ్రహింపఁగోరెదను.

(పం. ల. నా. శాస్త్రి)

మీఁదిస్తబకమున— సప్తశతీప్రోక్తమగు దేవీమహిమ కీర్తింపఁబడినది. దేవీమాహాత్మ్యమువ ప్రతిపాదింపఁబడిన యాదేవి చండీనామమున ప్రసిద్ధయగుటవలన- నామె యిచట 'చండికగా' ఉపసేవింపఁబడినదని గ్రహించునది.

ఇతి శ్రీమహర్షి రమణభగవత్ పాదాన్తేవాసినో వాసిష్ఠస్య
నారసింహసూనోః గణపతిమునేఃకృతౌ వుమాసహస్రే
అష్టమః స్తబకః సమాప్తః।

సమాప్తంచ ద్వితీయమ్ శతకమ్.

ఇది శ్రీమహర్షి-రమణభగవత్ప్రధానశిష్యుడు, శతమర్షణసగోత్రుడు,
శ్రీమత్పంతుల పేరయశాస్త్రి పౌత్రుడు, వేంకటరామ
బుధేంద్రపుత్రుడు అగు లక్ష్మీనారాయణశాస్త్రిచే
నాంధ్రీకరింపఁబడిన యుమాసహస్రమను స్తోత్ర
కావ్యమున ద్వితీయశతకము.

శ్రీ. శ్రీ. శ్రీ.



ఓం నమో భగవతే శ్రీ రమణాయ.

# ఉమాసహస్రము



## ( తృతీయ శతకమున - ప్రథమ స్తబకము )

## ( నవమ స్తబకము )



అవ:—ఈస్తబకమున - మహాప్రభావమును, సర్వాతిశాయిరామణీయకమును అగు ఉమాదేవీమందహాసము - భంగీభేదమున స్తుతింపఁబడుచున్నది.

మూ॥ శారదవలక్షపక్షక్షణదావైమల్యశిక్షకోఽస్మాకమ్।
జాగర్తు రక్షణాయ స్థాణు పురన్ధ్రీముఖవికాసః. ౧

శరత్సమయమందలి శుక్లపక్షరాత్రులకు వైమల్యశిక్షకమగు (నిర్మలతను గఱపునదియగు) స్థాణుపురంధ్రీ ముఖవికాసము - మమ్ము రక్షించుటకు జాగరూకమగుఁగాత!

ప్ర భ:—వైమల్యశిక్షకమన, నైర్మల్యమును బోధించునది (అధ్యాపకము) అనియర్థము.

జ్యోత్స్నావైమల్యముకంటెనుగూడ ముఖవికాసప్రకాశ మధికమని భావము.

స్థాణుపురంధ్రీముఖవికాసమన, శివసుందరీమందహాసమని యర్థము.

ఇందలి శిక్షకశబ్దము సాదృశ్యసూచకము. కావున వెన్నెలయొక్క - నైర్మల్యమునకును, ఉమాముఖవికాసమునకును గల ప్రకాశకతాసాధర్మ్యమువలన నిది యుపమాలంకారమగుచున్నది. దండ్యాచార్యుఁడు ప్రతిపక్షాదిశబ్దములు సాదృశ్యసూచకములనియు, కవుల బుద్ధిసౌఖ్య ప్రదములగునవి ఉపమయందు ప్రయోగార్హములనియు చెప్పియుండుటవలన - ఇందలి శిక్షకశబ్దము సాదృశ్యసూచకమగుటయు, తత్ప్రయోగమువలన నిది యుపమయగుటయు సంగతమేయని తెలియంగునది.

మీఁదిశ్లోకమునందలి "జాగర్తు" (జాగరూకమగుగాత!) అనుపదము - ముఖవికాసముచేఁ జేయఁదగినరక్షణక్రియను ప్రకర్షింపఁజేయును. తత్పదార్థసామర్థ్యమువలన 'ముఖవికాసము - బోధరూపము' అనునర్థము ఆక్షేపింపఁబడును;

(తీసికొని రాఁబడును) చీకటియందుఁగాని, జడతయందుఁగాని భయమువలన రక్షింపఁదగిన భక్తులకు ఉమాముఖవికాసముయొక్క జాగరణమే (మేలుకొని యుండుటయే) గొప్పత్రాణముగదా!

అదెట్లనిన:— గాఢాంధకారము వ్యాపించియుండునపుడుగాని లోకము నిద్రించియున్నపుడుగాని చరాచరశత్రువగు భయముకలుగునపుడు దానిని తొలఁగించుటకు వెలుతురుగాని, ఒకానొక బలవంతుని జాగరణముగాని సమర్థమగుచుండును. అట్లే- చరాచర శత్రువులగు భయములనుండి రక్షింపఁదగినభక్తులను, రక్షించుటకు భగవతియొక్క చిత్ప్రకాశాత్మకమగు ముఖవికాసముయొక్క జాగరణమాత్రమే చాలియుండునని భావము. ఆయమ్మయేగదా చరాచరనియంత్రణ సమర్థయై యెల్లయెడలను మేలుకొనియున్నది!

ఈయంశము శివశతకము నందీయాచార్యునిచేతనే ఇట్లు చెప్పఁబడినది.

“సర్వస్మిన్నచరేచరేచ విభవాదేకాపరా జాగ్రతీ ।
శక్తిః కాచన సావిచార రసికై రారాధ్యతే నాథతే.”

‘ప్రభూ! చరాచరమగు నీవిశ్వమున అనిర్వాచ్యయగు నీపరాశక్తి మహావైభవముతో మేల్కొనియున్నది. ఆనీశక్తిని విచార రసికులు సమారాధింతురు.’

**మూ. వ్యాఖ్యానం హర్షస్య ప్రత్యాఖ్యానం శరత్సుధాభానోః**
**దిశతు హృదయప్రసాదం గౌరీవదనప్రసాదో నః.　　౨**

**హర్షమును వ్యాఖ్యానించునదియు, శారదచంద్రుని ప్రత్యాఖ్యానించునదియు, అగు గౌరీముఖప్రసాదము మాకు హృదయప్రసాదము నొసఁగుఁగాత!**

ప్ర భ:—హర్షమును వ్యాఖ్యానించునది యనఁగా, ఆయుమకు సహజమగు సంతోషమును వివరించునదియని యర్థము. ప్రత్యాఖ్యానించునదియన, తిరస్కరించునదియని యర్థము. శరచ్చంద్రునికంటెనుగూడ నిర్మలమని భావము.

మీఁది విశేషణద్వయమువలన- ఉమాముఖప్రసాదమునకు సంతోషావహత్వము- నైర్మల్యావహత్వము చెప్పఁబడినవి. తదుభయప్రదానముచే హృదయప్రసాదలాభము సిద్ధమగును. కావున- సంతోషావహత్వ- నైర్మల్యావహత్వ- ప్రదానసమర్థమగు. ఉమావదనప్రసాదము ప్రార్థింపఁబడినది.

ఇందు ఒక్కటియేయగు ఉమాముఖప్రసాదము హర్షమును వ్యాఖ్యానించు నదిగను, శారదచంద్రుని ప్రత్యాఖ్యానించునదిగను, (ద్వివిధముగ) ఉల్లేఖింపఁ బడుటవలన నిది ఉల్లేఖాలంకార మగుచున్నది.

మూ. అన్తర్గతస్య హర్షక్షీర సముద్రస్య కశ్చనతరఙ్గః
హాసో, హారహారిణద్రుశో గతపఙ్కం మమకరోతుమనః. 3

హృదయాంతరగతమగు హర్షక్షీరసముద్రముయొక్క తరంగ విశేషమగు పార్వతీహాసము నామానసమును గతపంకముగా- పాపము లేనిదిగా; లేక బురదలేనిదిగా, నొనర్చునుగాత!

ప్ర భ:—'హర్ష క్షీరసముద్రమన' సమ్మదమనెడి క్షీరమయమగు సముద్రము. గతపంకము=పాపము లేనిది.

ఇందు ఆరోపవిషయ- విషయులగు హర్ష- సముద్రములకును, హాస- తరంగములకును అభేదాధ్యవసాయమువలన రూపక మలంకారమగుచున్నది. 'పాపము- బురద' అను నర్థములు గలదికావున పంకము శ్లిష్టారము గలిగియున్నది. సముద్రపు కెరటముల చేత బురదతొలఁగునట్లు, పార్వతి చిరునవ్వుచేత పాపము తొలఁగునని భావము. పంకపదమునకుఁగల శ్లిష్టార సామర్థ్యమువలన మనస్సు - పంకిలమగు (బురదతోఁగూడిన)సరస్తటమువంటిదనునర్థ మాక్షేపింపఁబడుచున్నది.

మూ. దిశిదిశివిసర్పదంశు పరిశమితతాపం పరాస్తమాలిన్యమ్
కుశలాని ప్రదిశతునః పశుపతిహృదయేశ్వరీహసితమ్. ४

సర్వదిశలయందును ప్రసరించుచున్న కిరణములచేత తాపము నడఁగించునదియు, (శిశిరీకరించునదియు) మాలిన్యమును తొలఁగించు నదియునగు పశుపతి హృదయేశ్వరీహసితము- మాకు కుశలముల నొసఁగును గాత!

ప్ర భ:-పశుపతియన భూతముల కధిపతియగు నీశ్వరుఁడు. అతని హృదయేశ్వరి పార్వతి. ఆమె చిరునవ్వు- పశుపతి హృదయేశ్వరీహసితము. కుశలములన క్షేమములు. తాపపరిశమన- మాలిన్యపరాసనముల చేత, హసితమునకు అమృతకిరణత్వము- వ్యంజింపఁజేయఁబడుచున్నది. దానిచేత నిచట- ఉపమ- ధ్వనించుచున్న దని తెలియునది.

మూ. అన్తర్గతంచతిమిరం హరన్తి, విహసన్తి రోహిణీకాన్తమ్।
హసితాని గిరిశసుదృశో మమప్రబోధాయకల్పన్తామ్. ౫

హృదయగతమగు తిమిరమునుగూడ హరించునవియు, రోహిణీకాంతునిగూడ విహసించునవియునగు కైలాసనాధసుందరి హసితములు మమ్ము ప్రబోధించునుగాత!

ప్ర భ:—తిమిరము=చీకటి. రోహిణీకాంతుఁడు=చంద్రుఁడు. చంద్రుఁడు వెలుపలనున్న చీకటినే తొలఁగించునుగాని హసితములు— లోపలనున్న చీకటిని గూడ తొలఁగించును గావుననే, హసితములు వానిని పరిహసించుననిభావము.

ఇచట ఉపమానమగు రోహిణీకాంతునికంటె నుపమేయములగు హసితముల కాధిక్యము వర్ణింపఁబడియెను. "ఉపమానముకంటె నుపమేయమున కాధిక్యముగాని న్యూనతగాని చెప్పఁబడినయెడల నది వ్యతిరేకాలంకార మగును" అను సాహిత్య దర్పణోక్తమగు లక్షణమున నిది వ్యతిరేకాలంకార మగునని గ్రహించునది.

మూ. భూషాతుషారదీధితి దీధిత్యాసహవిహాయసోరఙ్గే
విచరత్పురహరతరుణీ దరహాసో మేహరత్వేనః. ౬

శివశిరోభూషణమగు చంద్రుని చంద్రికతోఁగూడి ఆకాశరంగమున విహరించుచున్న పురహరతరుణీదరహాసము నాపాపమును బాపునుగాత!

ప్ర భ:— ఆకాశరంగమున, అనుచోట ఆకాశమేయగు రంగస్థలమున, (నాట్యస్థలమునందు) అను నర్థము తెలియుచున్నది. (రాహువేయగు శిరస్సు-రాహువు యొక్క శిరస్సని చెప్పఁబడినట్లు, ఆకాశమేయగు రంగస్థలము- మూలమున "విహాయసోరఙ్గే"="ఆకాశముయొక్క రంగస్థలమున" అని చెప్పఁబడినదని యెఱుంగునది.

ఆకాశరంగమున కాంతునిగూడి విహరించుచున్న ఉమామందహాసము- హరశిరోభూషణ- బాలచంద్ర- చంద్రికతోఁగూడ విలసిల్లుచు నాపాపమును తొలఁగించునుగాత యని ప్రార్థింపఁబడినది.

ఇచట అనురూపములగు ఉమామందహాసబాలచంద్రికలు వర్ణింపఁబడినవి. కావున నిది సమాలంకారమగుచున్నది.

మూ. రుద్రాణీ దరహసితాన్యస్మాకం సంహరన్తు దురితాని
యేషాముదయో దివసో భూషాపీయూష కిరణస్య. 8

ఏ దరహసితోదయము - హరశిరోభూషణమగు నమృతకిరణు నకు దివసమగుచుండునో (చంద్రుని తిరస్కరించునో) ఆ రుద్రాణీ దర హసితములు మాదురితములను హరించుఁగాత!

ప్ర భ:—దివసము=పగలు. పగటియందు చంద్రప్రభ- తగ్గిపోవుట ప్రసిద్ధము. కావున ఆచిరునవ్వు— పొడమగనే, శివశిరశ్చంద్రిక- తిరస్కరింపఁబడినట్లు చెప్పఁ బడినది.

"దివసము" అనుపదముయొక్క- అర్థసామర్థ్యమువలన హసితములకు, ప్రతా పగర్భమగు ఉష్ణరశ్మిత్వము (సూర్యత్వము) ఆక్షేపింపఁబడినది. తదానుగుణ్యమున దురిత- సంహరణ- ప్రార్థనకూడ నౌచిత్యమును పోషించుచున్నది.

ఉమాహసితములకును- శిరోభూషణ బాలచంద్రునకును గూడ కాంతి- సమానమేయయినను దివసపదముచేత హసితప్రభకుత్కర్షమును, బాలచంద్రప్రభకు నికర్షమును గమింపఁజేయఁబడుటవలన బాలచంద్రప్రభకు తిరోధానము చెప్పఁబడినది. కావున "నికృష్టమగు వస్తువున కుత్కృష్టమగు వస్తువుచే నగు।తిరోధానము మీలితము" అనులక్షణముచేత నిది-మీలితాలంకారమగు చున్నది.

మూ. స్కన్దజననీముఖేన్దో రస్మాన్పుష్ణాతు సుస్మితజ్యోత్స్నా
మునిమతికైరవిణీనా ముల్లాసకథా-యదాయత్తా. 9

ముని-మతులను (హృదయములను) కుముదినులకు (కలువలకు) వికాసమును గలిగించుట- దేనికధీనమై యున్న దోసుబ్రహ్మణ్యుని తల్లి యగు పార్వతియొక్క ముఖచంద్రునికిసంబంధించిన శుభప్రదమగు ఆచిరునవ్వువెన్నెల మమ్ముపోషించుఁగాత!

ప్ర భ:—ఇందలి యలంకారము- రూపకము. స్కందజననియన, కుమార స్వామియొక్క-తల్లి, మతిశబ్దమున కిచటనుమాత్రము హృదయమని యర్థముఁ జెప్ప నగును. ఇందు పార్వతీముఖము- చంద్రస్థానీయము. చిరునవ్వు- జ్యోత్స్నాస్థానీ యము, మునిమతులు- కైరవిణీస్థానీయములు.

ఉల్లాసమునుగలిగించుట- స్మితాధీనము- ఉల్లాసశబ్దస్వారస్యమువలన మీది శ్లోకమునందలి మతిశబ్దము హృదయమునకుపలక్షకమని యెఱుంగునది.

"సనత్కుమారుఁడు" అను నామాంతరముగల స్కందుఁడు మృదితకషాయులగు మునులందఱికంటెనుగూడ జ్ఞానదాత" అనుప్రసిద్ధి యున్నది. కావున మునిహృదయోల్లాసప్రసంగమువలన, పార్వతిని తెలుపుచున్న స్కందజననీపదమిచట నౌచిత్యపోషకమగుచున్నది.

మూ. కమనీయకణ్ఠమాలా ముక్తామణితారకావయస్యోనః
కామాన్వితరతు గౌరీదరహాసోనామ ధవలాంశుః. ౯

మనోజ్ఞమగు కంఠమాలయందలి ముక్తామణులను తారలకు వయస్యుఁడగు గౌరీదరహాసమను ధవలాంశుఁడు, మాకు వాంఛితముల నొసఁగునుగాత!

ప్ర భ:— తారలకు=నక్షత్రములకు, ధవలాంశుఁడు=చంద్రుడు, (తెల్లనికిరణములుగలవాఁడు) కంఠమాలాముక్తామణులయందు ప్రభాతరలతాసాధర్మ్యమువలన తారకారోపణము చేయఁబడినది. దరహాసము- ముక్తామణులకువయస్యుఁడు (సహచరుఁడు) చంద్రుఁడు- తారావయస్యుఁడు (కాంతుఁడు)

శోభావహత్వము- ఆహ్లాదకత్వము మొదలగునది- దరహాస- ధవలాంశువులకు సమానధర్మము. కావున నిది యిట్లు- సావయవరూపకాలంకారమగునని గ్రహించునది.

మూ. అనవద్యకణమాలా ముక్తావలీకిరణ నివహసహవాసీ
హరదయితాదరహాసోహరతుమమాశేషమజ్ఞానమ్. ౧౦

కంఠమాలయందున్న నిర్దుష్టమగు ముక్తావలియొక్కకిరణసమూహమునకు సహవాసియగు (మిత్రమగు) హరదయితాదరహాసము నాయజ్ఞానమునంతను హరించుఁగాత!

ప్ర భ:- హరదయితయన శివకాంతయని యర్థము. భక్తుల యజ్ఞానమునుగాని ఆర్తినిగాని హరించును గావున శివుఁడు హరుఁడగుచున్నాఁడు.

ఇచట నిశ్శేషమగు- అజ్ఞానహరణము- ప్రార్థింపఁబడినది కావున పార్వతిని హరదయితగా కీర్తించుట- ఔచిత్యపోషకమగుచున్నదని గ్రహించునది.

మూ. ఞ ఇవఙ్జదృశ్య్పోత్తమ - ఇలాధరాధీశనన్దినీహాసః ।
పూర్ణం కరోతు మానస మభిలాషం సర్వమస్మాకమ్. ౧౧

జ్ఞ దృశ్యమగు (జకార ఞ కారసంయోగమగు 'జ్ఞ' అనుదాని యందు జూడఁదగిన) ఞ కారమువలె ఉత్తమమగు (ఉత్కృష్టమగు) పర్వతరాజపుత్రీహాసము, మాయొక్క మానసమగు అభిలాషమును సర్వమును పూర్ణము గావించునుగాత.

ప్ర భ:—మూలమునందలి "ఇలాధరాధీశ నన్దినీహాసః" అనుపదమునకు తెలుఁగున, పర్వతరాజపుత్రీహాసమని యర్థము చెప్పఁబడినది.

( ) (జ్ఞ) అను లిపియందు ( ) (ఞ) కారము సరిగా గుర్తింపఁబడనేరదు:, కాని అత్యంతమును సూక్ష్మమగు దృష్టి చేతఁ జూడఁబడును.

ఇట్లు- అవిస్పష్టముగను సూక్ష్మముగను గుర్తింపఁదగిన ( )(ఞ) వర్ణమువలె సరిగా గుర్తింపబడకుండుటవలనను సూక్ష్మమగుటవలననుగూడ పార్వతీహాసము- ఉత్తమమని చెప్పఁబడినది.

తైత్తిరీయప్రాతిశాఖ్యమున ( ) (ఞ) కారము— "ఉత్తమము" అనుసంజ్ఞ గలదని యిట్లు పఠింపఁబడినది.

సూ॥ 10, వర్ణానామానుపూర్వ్యేణ పఞ్చ పఞ్చ వర్గాః।

సూ॥ ప్రథమ- ద్వితీయ- తృతీయ- చతుర్థ- ఉత్తమాః.

ఇట్లు ఉత్తమసంజ్ఞమగు ( ) ఞ వర్ణము- ( ) జ్ఞదృశ్యము=ప్రాతిశాఖ్యజ్ఞులచేఁ దెలియఁదగినది. అట్లే- ఉత్తమమగు పార్వతీహాసముగూడ జ్ఞదృశ్యము = పండితులచేఁ దెలియఁదగినది.

మూ. ఆలోకమాత్రతో యః శఙ్కరమసమాస్త్రకిఙ్కరం చక్రే
ఆల్పోఽప్యనల్పకర్మా హాసోనః పాతు స శివాయాః. ౧౨

ఆలోకమాత్రమున శంకరుని విషమాస్త్రకింకరు నొనర్చునదియు అల్పమయినను అనల్పమగు కర్మగలదియునగు పార్వతి చిరునవ్వు- మమ్ము రక్షించునుగాత.

ప్ర భ:—ఆలోకమాత్రమున=చూచినంతమాత్రముచేతనే, విషమాస్త్రకింకరుఁడు=పంచబాణుఁడగు మన్మథునకు వశపడినవాఁడు, అనల్పమగు=అధికమగు,

వి వ:— పార్వతీహాసమును దర్శించినంతమాత్రముచేతనే శంకరుఁడు మదన వశంగతుఁ డయ్యెనని భావము.

హాసము- స్వల్పమైనను, స్వదర్శనమాత్రమున శంకరుని కామకింకరుని జేయుట- అనల్పమగు కర్మమై యున్నది. కావున నిట్లు- అసంభావ్యత్వవర్ణనము వలనఅసంభవమును వర్ణించుటవలన నిది- అసంభవము అలంకార మగుచున్నది.

మూ. స్మర- మతరతమీశంయః కరోతిభావప్రసఙ్గచాతుర్యా।
ద్విజగణపురస్కృతో౽వ్యాత్ స శివాహాసప్రవక్తానః. ౧౩

భావ- ప్రసంగ- చాతురిచేత ఈశ్వరుని కామతంత్రరతు నొన ర్చినదియు, ద్విజగణముచేత పురస్కరింపఁబడినదియు, నగు పార్వతి యొక్క హాసమను ప్రవక్త మమ్ము రక్షించుఁగాత.

ప్ర భ:—బ్రాహ్మణవర్గమును ముందుంచుకొని (పూజించి) నిజాభిప్రాయ మును స్ఫుటీకరించు చాతుర్యముగలిగి- ఉపన్యాసము జెప్పువాఁడగు ప్రవక్తవలె- దంతపంక్తిని వెనుక నుంచుకొని- విభావాదులచేత నిష్పాదింపఁదగిన రతిభావమును దెలియఁజేయు చాతుర్యముగలిగి- ప్రకాశించుచున్న పార్వతిచిరునవ్వు మమ్ము రక్షించుఁగాత మనిభావము.

ప్రవక్తయన బాగుగా చెప్పువాఁడు (ఉపన్యాసకుఁడు) ఇందుపార్వతీహాసము ప్రవక్తగా నారోపింపఁబడినది. కావున మీఁది విశేషణములు హాసపక్షమునను ప్రవక్తృపక్షమునను గూడ క్రమముగా నిట్లు సమన్వయింపఁదగియున్నవి.

భావప్రసంగచాతురిచేత = రసాదినిష్పాదకమగు రత్యాదిభావముయొక్క ప్రస్తావవిషయమునందలి నిపుణతచేత, లేక అభిప్రాయముయొక్క ఆవిష్కారము నందలి చతురతచేత- ద్విజగణముచేత పురస్కరింపఁబడినది=దంతపంక్తికి ముం దుగా స్థాపింపఁబడినది-లేక బ్రాహ్మణగణమును ముందుగా పూజించినది.

ఈశ్లోకము- ఇట్లుశ్లిష్టార్థముకావున నిందలియలంకారము- శ్లేషోత్థాపితమగు సావయవ రూపకమగుచున్నది. 'భావప్రసంగ చాతురిచేత' అనిచెప్పుటచేత "శృం గారరస నిష్పాదకములగు- ఆలంబన- ఉద్దీపనవిభావ- అనుభావాదులచేత నిష్పా దింపఁదగిన రతిభావము- కామేశ్వరీ మందహాసగర్భము" అనునంశము ద్యోతింపఁ జేయఁబడుచున్నది.

"పురస్కృతః=ముందుంచు కొనఁబడినది" అనుటచేత వెనుకనున్న దంత పంక్తి, స్పష్టముకాని, దర్శనముగలదనియు ముందున్నహాసము (స్వల్పమైనను)

సుస్పష్టమగుదర్శనము గలదనియు గమ్యమగుచున్నది. హాసమునందు ప్రపక్తృత్వము నారోపించుటవలన ప్రవచన కార్యమంతయునుగూడ వాగ్విగహితమగు హాసము చేతనే నిర్వహింపఁబడినదని విశదమగుచున్నది.

మూ. రదవాససారథీమాం శరీ కరైః పాతుపార్వతీహాసః
పావకదృశంజిగీషోః పఞ్చపృషత్కస్య సేనానీః. ౧౪

దంతపంక్తిని గప్పుచున్న యధరముచేత— రథియు (రథముగల దియు) కిరణములచేత— శరియు (బాణముగలదియు) జ్వలననేత్రుఁడగు శివుని జయింపఁగోరిన పంచబాణునకు సైనికాధిపతియు, అగు పార్వతీ హాసము— నన్ను రక్షించునుగాత!

ప్ర భ:—ఇందు— అధరమను రథముగలదియు, కిరణములను బాణములుగల దియు— అనిసమానవిభక్తులచేఁగాక "అధరముచేత—రథియు, కరములచేత—శరియు" అని భిన్నవిభక్తులచేనగు అభేదాధ్యవసాయమువలన నిది— వైయధికరణ్యముచేత నగు రూపకమగుచున్నది. అనలనేత్రుఁడగు శివుని జయించుటకు మన్మథుఁడు ప్రయత్నిం చునపుడు భగవతియగు పార్వతియొక్క— సుందరహాసమే యుద్ధసన్నాహమొనర్చి సైన్యాధిపతివలె విజయమును నిర్వహించినది. కావున నది సైనికాధిపతియని చెప్పఁ బడినది. అధరము—హాసమును వహించినది, ఆయధరమున ధరింపఁబడిన హాసమయూ ఖములే— బాణములయినవి. హాసము—రథియయినది. రథియగుహాసమే మన్మథుని సేనాధిపతి యయినది.

ఇట్లు— వర్ణింపఁబడిన మందహాసమహిమ— (రూపకసామర్థ్యమున) సర్వోత్తర మగు రామణీయకమును పోషించుచున్నది.

మూ. శివహృదయమర్మభేది స్మితం తదదీశ వంశముక్తాయాః।
దశనద్యుతి ద్విగుణితశ్రీకం శోకం ధునోతు మమ. ౧౫

మహేశ్వర హృదయమర్మమును భేదించునదియు, దంతకాంతు లచే ద్విగుణితమగు శోభగలదియు, నగు పర్వతరాజవంశముక్తామణి ముఖమునందలి యాచిరునవ్వు మాశోకమును పోకార్పుఁగాత!

ప్ర భ:—మర్మమన, గూఢమగు జీవస్థానము. ద్విగుణితమన, రెట్టింపుచేయఁ బడినది. వంశమన— కులము, వెదురు. (వెదురునందు ముక్తికముదయించుననునది కవి సంప్రదాయము.) ప గాఢమగు శివహృదయమునందుఁగూడ చొరఁబడిన పార్వతీ

స్మితము, అస్మదాదుల హృదయమునఁ బ్రవేశించి, తద్గతమగు శోకమును తొలఁగించుటకు శక్తము కానేరదా? అనిభావము.

మూ. బ్రహ్మాణ్డరఙ్గ భాజో నట్యాః శివసూత్రధారసహచర్యాః ॥
శ్రీవర్ధనోఽనులేపో ముఖస్యహాసః పునాత్వస్మాన్. ౧౬

బ్రహ్మాండమను రంగస్థలమున ప్రవేశించిన శివుఁడనుసూత్రధారునకు సహచరి (సఖి) యగు పార్వతియొక్క శ్రీవర్ధనమగు అనులేపమేయగుహాసము మమ్ము పవిత్రుల నొనర్చుఁగాత!

ప్ర భ:-రంగమన, నాట్యస్థలము. సూత్రధారుఁడన భరతాచార్యుఁడగు నటుఁడు. సూత్రధార సహచరి యన నతని ననుసరించునటి. శ్రీవర్ధనమన, శోభా ప్రకర్షకము. అనులేపనమన లేపనద్రవ్యము-ముఖమునకుఁ బూసికొనురంగు (పౌడరు) బ్రహ్మాండము—రంగస్థలము. శివుఁడు—సూత్రధారుఁడు. తత్సహచరియగు పార్వతి—నటి. పార్వతీముఖహాసము—నటీముఖశోభను వృద్ధినొందించు పౌడరు. అని యెఱుంగునది. సావయవమగు రూపకము—అలంకారము.

మూ. అధరప్రవాళశయనే నాసాభరణ ప్రభావిలాసిన్యా
రమమాణో హారరమణీ హాసయువా హరతు నఃశోకమ్. ౧౭

అధర- ప్రవాళ- శయనమునందు నాసాభరణప్రభావిలాసినితోఁగూడి- రమించువాఁడగు హారరమణీ- హాసయువకుఁడు మాశోకమును తొలఁగించునుగాత!

ప్ర భ:—అధరప్రవాళశయనమునందు—మోవియను చిగురాకుచేతఁగూర్పఁబడిన పాన్పునందు, నాసాభరణప్రభావిలాసినితోఁగూడి=ముక్కు ముత్తెపుకాంతియను విలాసవతితోఁజేరి, హారరమణీహాసయువకుఁడు= పార్వతీహాస మనుయువకుఁడు రమించుచున్నట్లు చెప్పఁబడినది. ఇందు- రూపకమలంకారము. కవిప్రౌఢోక్తిసిద్ధమగు ఈయలంకారముచేత- నాసాభరణప్రభావిలాసినీ- హాసయువకులకు- అధరశయనమున, అన్యోన్యమగు కలయిక- లోకోత్తరశోభావహమను నంశము వ్యంజింపఁజేయఁబడుచున్నది.

మూ. అధరోష్ఠవేదికాయాం నాసాభరణాంశుశాబకైః సాకమ్
కులమఖిలమవతు ఖేలన్నద్రిసుతాహాసబాలో నః. ౧౮

అధరోష్ఠమను వేదికయందు నాసాభరణకాంతులను శాబకులతోఁ **గూడి** యాడుచున్న హైమవతీహాసమను బాలుఁడు మాకులమును సక లమును రక్షించుఁగాత!

ప్ర భ:—అధరోష్ఠమన, క్రిందిపెదవి. శాబకులన, శిశువులు. వేదికయన, గృహ ద్వారమున కీవల నించుకయెత్తుగా నిర్మింపఁబడిన యరుగు. అది బాలుర కాటస్థల మగుచుండును. ఈరూపకమునందుఁ గ్రిందియంశము తెలియఁగఁదగియున్నని. నాసా భరణకాంతులు=ఆడుకొనుటకు వచ్చిన యితరశిశువులు. అధరోష్ఠము-క్రీడాస్థలమగు వేదిక. ఇట్లు-కవిప్రౌఢోక్తి సిద్ధమగు రూపకముచేత- బాలుఁడు-శిశువులకంటె నధికుఁడు. కావున బాలుఁడుగాఁ జెప్పఁబడిన హాసము శిశువులుగాఁ జెప్పఁబడిన భూషణాంశువులతోఁగూడి యథేచ్ఛముగా విలసిల్లుచున్నను "దానిశోభ—సర్వో త్తరమే" అనువస్తువు ధ్వనితమని తెలియునది.

**మూ.** అనులేపనస్య వీప్సా ద్విర్భావః కుచతటీదుకూలస్య।
హరతుహృదయవ్యథాం మే హసితంహరజీవితేశ్వర్యాః. ౧౯

అనులేపమునకు ద్విరుక్తియు, కుచతటీదుకూలమునకు ద్విరా వృత్తియునగు హరజీవితేశ్వరియొక్క హసితము- నాహృదయవ్యథను తొలఁగించునుగాత.

ప్రభ:—పార్వతియొక్క చిరునవ్వు సొంపును గూర్చునదియగు మంచిగంధము మున్నగు లేపనద్రవ్యమునకు మీఁద నింకొక అనులేపనము ను ఉత్తరీయమునకుమీద నింకొక యుత్తరీయమును అగుచున్నదని తాత్పర్యము.

మూలమునందు 'వీప్సా' అనుపదమునకు ద్విరుక్తియని యర్థమగు చున్నది. మూలమునందలి ద్విర్భావపదమునకు ద్విరావృత్తి యర్థమగును. అనులేపన మన మంచిగంధము మొదలగు శోభాదాయకమగు లేపనద్రవ్యము. శుభ్రత్వసాధ ర్మ్యమువలన ఉమాహసితము- అనులేపనముమీఁద అనులేపనముగను ఉత్తరీయము మీఁద ఉత్తరీయముగను ఆరోపింపబడుటవలన నిది అభేదరూపకాలంకార మగు చున్నది. ఆత్మశోభచేత ముఖ-వక్షోజములను వ్యాపించియున్న తెల్లని చిరునవ్వు యొక్క ప్రసన్నత- హృదయవ్యథను తొలఁగించుటకు సమర్థమగునని భావము.

మూ. గిరిశాఙ్గరాగ భసితైః స్వాగతవచసాభినన్దదాదరతః
గిరిజాలీలాహసితం గరీయసీం మేతనోతుధియమ్. ౨౦

శివాంగరాగమగు (శివుని మెయిపూతయగు) భస్మమును- స్వాగతవచసముతో నాదరపూర్వకముగా అభినందించుచున్న పార్వతీ లీలాహసితము నాయొక్క-బుద్ధిని గొప్పదిగా విస్తరించునుగాత!

ప్ర భ:—శివదేవుఁడు తనదేహమునకుఁ బూసికొన్న భస్మమును "దయ చేయుఁడు— మీకువిజయమగుఁగాక'' అను స్వాగతవాక్య-తో నామోదించు చున్నది వలెనున్న పార్వతీ విలాసస్మితము- నాబుద్ధిని విస్తరింపఁజేయుఁగాతమని ప్రార్థింపఁబడినది. భర్తయగు శివునియొక్క- బూదిపూతచేనగు శరీరధవళిమను జూచి- శుభ్రమగు పార్వతీహాసముకూడ నిజధవళిమతోడి పోలికవలన దానియం దాదరమును జూపుచున్నదను వస్తువుచేత నిచట- భసిత- హసితములకు నుపమ ధ్వనింపఁ జేయఁబడుచున్నది.

మూ. దయి తేనసల్లపన్త్యాః, సహతుహినమరీచి శిశు కిరీటేన।
వాగమృతబుద్బుదోఽవ్యాదలసో మామగభువో హాసః. ౨౧

బాలచంద్రికిరీటియగు భర్తతోఁగూడి సల్లాపములాడుచున్న పార్వతీదేవియొక్క- వాగమృతబుద్బుదమగు అలస (మంద) హసితము నన్ను రక్షించునుగాత!

ప్ర భ:—మూలమునందలి "తుహినమరీచి శిశుకిరీటేన'' అనుపదమునకు "శిశుః=బాలః, తుహినమరీచిః=హిమాంశుః=తుహినమరీచిశిశుః, మయూరవ్యంస కాదివత్ సమాసః'' అని ప్రభావ్యాఖ్యాతచేత వ్యుత్పత్తి చెప్పఁబడినది.

కాంతుఁడగు చంద్రచూడునితో ప్రియభాషణము నొనరించుచున్న దేవీ వాక్య-నుండి బయలువెడలుచున్న మందహాసము- అమృతబుద్బుదమేయను నభే దాధ్యవసాయమువలన రూపక మలంకారమగుచున్నది. మథించుటవలన అమృతము నకు బుద్బుదాకారములు కాన్పించును. బుద్బుదమను పదముయొక్క- అర్థసామ ర్థ్యమువలన సల్లాపమును విడువనిహాసము ఆక్షేపింపఁబడుచున్నది. స్పష్టముగాఁ గను పించుచున్ననుగూడ బుద్బుదము మథింపఁబడుచున్న యమృతము నాశ్రయించి యుండునట్లు- సల్లాపించుచున్న తత్కా-లమున నిర్గతమగు మందహాసము- సల్లాప శ్లిష్టమగుచుండునని గ్రహించునది.

మూ. శుద్ధః కుచాద్రినిలయా దపి ముక్తాహారతో హారపురన్ధ్ర్యాః
వదనశ్రీప్రాసాదే విలసన్ హాసోఽలసోఽవతుమామ్. ౧౨

హారపురంధ్రియగు పార్వతియొక్క కుచాద్రినిలయమగు ముక్తాహారముకంటెనుగూడ స్వచ్ఛమును, వదనశ్రీ ప్రాసాదమునందు విలసిల్లునదియు, అగు మందహాసము నన్ను రక్షించునుగాత!

ప్ర భ:-హారపురంధ్రియన శివకాంత. కుచాద్రినిలయము=స్తనమను పర్వతము నివాసస్థలము గాఁగలది. వదన శ్రీప్రాసాదమునందు= ముఖలక్ష్మి యొక్క మందిరమునందు, లేక ముఖపద్మమునందు. పర్వతముమీఁదనున్న మేడయే అసాధారణమగు రామణీయకమును పోషించుచుండగా ఆమేడయందు విలసిల్లుచున్న లావణ్యాతిశయమును గురించి చెప్పవలయునా? వక్షోజగతమగు ముక్తాహారముకంటెను గూడ శుభ్రమగు శోభచేత పార్వతీ ముఖపద్మమునందలి హాసము- మిక్కిలి గొప్పదగుచున్నదని భావము.

మూ. వ్యర్థీభూతే చూతే గతవతి పరిభూతి మసిత జలజాతే
అనితే సిద్ధిమశోకే కమలేఽపి గలజ్జయశ్రీకే. ౧౩

మన్మథపంచబాణములయందలి బాణ- పుష్పమగు రసాలము- విఫలముకాఁగా, నీలోత్పలము తిరస్కృతినొందఁగా, అశోకము- లక్ష్యభేదసిద్ధిని సంపాదింపక పోఁగా, కమలము- గలజ్జయశ్రీకము (జయశ్రీ నుండి జారినది) కాఁగా

ప్ర భ:—గలత్=జారిన, జయశ్రీకము=విజయలక్ష్మిగలది- విజయము నొందలేనిది. మీదిశ్లోకముతో నన్వయము.

మూ|| బహుధా బిభేద హృదయం హారస్య బాణేన యేన సుమబాణః
తదుమాలీలాహసితం మల్లీసుమమస్తు మే భూత్యై. ౧౪

సుమబాణుఁడగు మన్మథుఁడు- ఏ బాణముచేత హరునిహృదయమును బహువిధమగునట్లు భేదించెనో, ఆ- ఉమాలీలాహసితమగు మల్లీసుమము- నాకైశ్వర్యము నొసఁగుఁగాత!

ప్రభ:—మల్లీసుమము=మల్లెపూవు, చూతాదులగు బాణపుష్పములు నాలుగును హరహృదయభేదనమున విఫలములు కాఁగా, ఉమాహసితమే- అయిదవబాణ

మగు మల్లెపూవుయొక్క- కార్యమును నిర్వహించెనని కవిప్రౌఢోక్తి. పూవులయి దింటిలోనుగూడ మల్లెపూవునకే అల్పమగు నాకృతిత్వతను, శుభ్రత్వతను మంద మును శుభ్రమునుఅగు ఉమాహసితముతోడి యభేదము నభ్యపనించుట యుక్త మగును.

మూ. అమలదరస్మితచిహ్నాస్తా ఏతాః, సర్వమఙ్గలాఆర్యాః
కమనీయతమాస్వసమా ముపతిష్ఠ న్తా ముమాం దేవీమ్. ౨౫

నిర్మల(దరహసితచిహ్న(ము)లును, సర్వమంగల(ము)లును; అగు ఆయీయార్యలు- కమనీయతమలగు స్త్రీలయందు అద్వితీయయగు ఉమాదేవి నుపాసించుఁగాత!

ప్రభ:-సర్వమంగల(ము)లు=స్తబకశ్లోకములందంతటనుకల్యాణముగలవి.కలవారు ఆయీయార్యలు=ప్రస్తుతస్తబకమువం దుపక్రమింపఁబడిన ఆర్యావృత్తనిబద్ధములగు స్తుతులు. ఆర్యలగుస్త్రీలు స్తబకమునందలి శ్లోకములన్నిటియందును మందస్మిత మునుగూర్చియే ప్రస్తావించుటవలన నీయార్యలకు మందస్మితమే చిహ్నముగుచున్నది. అంతటనుగూడ మాంగల్యమునే ఆశాసించుటవలన నీయార్యలు సర్వమంగల లగు చున్నవి.

తృతీయ శతకమునందలి ప్రథమస్తబకము ఇట్లు-ఆర్యలచేత ఉమాదేవతనుపా సించి యుపసంహరింపఁబడి ముగిసినది.

ఇది సవ్యాఖ్యమగు ఉమాసహస్ర తృతీయశతకమునందలి
ప్రథమస్తబకము. శ్రీ. శ్రీ. శ్రీ.



ఓం నమోభగవతే శ్రీ రమణాయ.

# ఉమాసహస్రము

( తృతీయ శతకమున - ద్వితీయ స్తబకము )

## దశమ స్తబకము

అవ:— ఈ దశమ స్తబకము భగవతియొక్క కేశాది-పాదాంత స్తుతిపరము.

మూ॥ సజ్జ్వాలనాయ హరితాం, విభూతయే
లోకత్రియస్య, మదనాయ ధూర్జటేః,
కాత్యాయనీవదనతః శనైః శనైః
నిర్యాన్తి శుభ్రహసితాని పాన్తు నః. ౧

దిశలను విమలీకరించుటకును, లోకత్రియమునకును, విభూతి నిచ్చుటకును, ధూర్జటికి కామముఁగలిగించుటకును కాత్యాయనీవదనమునుండి మెల్లమెల్లగా బయలువెడలుచున్న తెల్లనిచిరునవ్వులు-మమ్ము రక్షించుఁగాత !

ప్ర భ:—విభూతియన నైశ్వర్యము. ధూర్జటియన శివుఁడు. నైర్మల్య-ఐశ్వర్య సాహచర్య సంపాదకములగు భగవతీ మందహాసములు- అస్మత్ప్రత్యక్షకములుగాఁ బ్రస్తుతింపబడినవి. ఇందు- హేతుమండలములగు దిశలను విమలీకరించుట మున్నగు కార్యములతోఁగూడ హేతువగు శుభ్రహసితములను వర్ణించుటవలన నిది హేతువను నలంకారమగుచున్నది. మఱియు - ఆశుభ్రహసితములు దిశలను విమలీకరించునవిగను, లోకత్రయమునకు విభూతి నిచ్చునవిగను, ధూర్జటికి కామము కల్పించునవిగను, బహువిధముల నుల్లేఖింపఁబడుటవలన ఉల్లేఖాలంకారముగూడ నగుచున్నది. తిలతండుల న్యాయమున స్ఫుటముగాఁ దెలియఁదగిన భేదముగల- హేతు- ఉల్లేఖములతోఁ గూడియుండుటవలన నిది 'సంసృష్టి' అను నలంకారమగును.

మూ॥ స్వల్పోఽపి దిక్షుకిరణాన్ ప్రసారయన్
మన్దోఽపి బోధమమలం దధత్ సతామ్
శుభ్రోఽపి రాగకృదనఙ్గవైరిణో
హాసః పురాణసుదృశః పునాతు నః ॥　　　౨

మిక్కిలి యల్పమైనదయినను దిక్కులన్నిఁటియందును కిరణములను ప్రసరింపఁజేయునదియు, మందము అయినను సజ్జనులకు నిర్మలమగు జ్ఞానమును గలుగఁజేయునదియు, శుభ్రమయినను, అనంగవైరియగు శివునకు రాగమును జనింపఁజేయునదియునగు, పురాణసుందరియగు సుమయొక్క హాసము మమ్ము పవిత్రుల నొనర్చుఁగాత!

ప్రి భ:—మందము=అలసము లేక అల్పప్రిజ్ఞ గలది. శుభ్రము=తెల్లనిది లేక పరిశుద్ధమయినది. రాగము=ఎఱుపు లేక అనురాగము. స్వల్పమగుహాసము అంతటను ప్రిసరించుట విరుద్ధము. అది యుమాహాసమునకు స్వాభావికము కావున పరిహరింపఁబడును. అట్లే మందమగుదానికి సద్బోధనము. విరుద్ధము. అదికూడనుమాహాసమునకు స్వాభావికము. కావున పరిహరింపఁబడును. శుభ్రమగునది (తెల్లనిది) రాగమును (ఎఱ్ఱఁదనమును) జనింపఁజేయుట విరుద్ధము. ఇచట రాగపదమునకు శ్లేషమూలకమగు అనురాగము నర్థముగాఁ జెప్పుకొనుటవలన మీఁదివిరోధముకూడ పరిహరింపఁబడును. మీఁదిశ్లోకమునందంతటను గూడనిట్లు విరోధము కాన్పించినను అది ఆభాసము (లేనిదేయున్నట్లు తోఁచునది) కావున నిది విరోధాభాసమను నలంకారమగుచున్నది.

మూ॥ చేతోహరోఽప్యతిజుగుప్సితో భవేత్
సర్వోఽపి జీవకలయా యయా వినా
సా వర్ణ్యతాం కథ మపారచారుతా
పీయూష సిన్ధురఖిలేన్ద్రిసున్దరీ.　　　3

ఏ జీవకళను (జీవనాధాయినియగు సుషమను) విడిచినయెడల మనోహరమయిననుగూడ నీలోకమంతయునుగూడ మిక్కిలి జుగుప్సావహమగుచుండునో అపారసుషమామృతసాగరమగు ఆసర్వేశ్వరసుందరి-యెట్లు వర్ణింపఁబడును?

ప్రభ:—జీవశబ్దము బృహస్పతియందును, ప్రాణమునందును, జీవనమునందును, ఆత్మయందును, పక్షియందును వర్తించునని నానార్థరత్నమాల చెప్పుచున్నది. కావున నిచట జీవశబ్దమునకు జీవన మర్థమగుచున్నది. కలాశబ్దము, అంశమాత్రమునందును, మూలవృద్ధియందును, సుషమ (గొప్పసౌందర్యము) యందును, విద్యయందును వర్తించునని త్రికాండశేషము చెప్పుచున్నది. సర్వేశ్వరసుందరీవిశేషణానురూపతవలన కలాశబ్దముచేత నిచట సుషమ యర్థమగుటకు యుక్తమగుచున్నది. కావున జీవకల యన జీవసుషమ యనునర్థము గ్రహింపఁదగుచున్నది.

అవ్యయ—లావణ్యామృతరాశియగు భగవతియే—ఆజీవకళ. అది (భగవతియగు జీవకళ) లేనియెడల లోకమంతయుఁగూడ భీభత్సరసావహామగును— మూలకళయగు ఆసుషమ (సౌందర్యము) ఉండినవే జీవనము సంభవించును. అజీవన ముండినవే యితరములగు నంగములు రమణీయములై వెలుంగును.

కావున అంగసౌందర్యముల కన్నిఁటికిని మూలము— అంగిసౌందర్యమే యగును— ఆయంగిసౌందర్యము— జీవకళయే యని గ్రహించునది. మూలసౌందర్యము (జీవకళ) శరీరమునుండి తొలఁగినపుడు, మరణించిన శరీరమునందలి యంగముల సౌందర్యములు ఎవ్వనికైనను ఎట్లు రుచించును? రుచింపకపోవుట యటుండ వైరస్యమునే కలిగించును. అంగి— జీవకలాసంపన్నమగునపుడే అంగములు సరసము లగుచుండును. జీవకళావంతమగు అంగితోడి సంవాదము వలననేఅయంగములలో నొక్కొకదానికిని, అన్నింటికినిగూడ రామణీయకతానిష్పత్తియగుచున్నది. మరణించిన దంతయు— అసుందరమే యగుటవలన విరసమగును. సమరసమును సరసమును అగుసౌందర్యము జీవనభూతమగు నమృతము. అది (జీవనమను ఆయమృతము) అఖిలేంద్రసుందరీ స్వరూపమేయని తెలియునది.

అ వ:—ఈస్తబకమున పార్వతీకేశపాది వర్ణనము నారంభించుచు, సర్వసౌందర్యమూలకలయగు నాయమ్మను వర్ణించుటకు సమర్థుఁడెవ్వడును లేఁడని యుపక్రమించుచున్నాఁడు.

మూ॥ అత్యల్పదేవవనితాంచ పార్థివై
ర్భావైర్వ్యయం తులయితుం నశక్నుమః
తాం కిం పునః సకలదేవ సున్దరీ
ర్లోకాక్షిపారణ తనుప్రభాముమామ్. ౮

మానుషకవులమగు మేము సామాన్యయగు దేవాంగననుగూడ పార్థివములగు భావములతో సమీకరించుట (ఉపమించుట)కు శక్తులము కానేరము (అట్టియెడల) దేవసుందరీనయనపారణమగు శరీర ప్రభగల ఆ యుమనుపమించుట కెట్లు శక్తులమగుదుము!

ప్ర భ:—పార్థివములగు భావములతో=భూలోకగతములగు రమణీయవస్తువులతో, నయనపారణమగు=నేత్రములకు వ్రతాంతమునందగు భోజనమగు (సంతర్పణమగు) సామాన్య సురసుందరినిగూడ వర్ణించుట కశక్తులము, భూమిస్థులము, అగు మాకు— సర్వసురసుందరీ నయనామృతాయమానదేహకాంతియగు భగవతి నిట్టిదని వర్ణించుటకు శక్తియెక్కడిదని తాత్పర్యము. అర్థాపత్తి-అలంకారము.

మూ॥ వర్షా పయోద పటలస్య సాన్ద్రతా
సూర్యాత్మజోర్మిచయ నిమ్నతుఙ్గతా
కాలాహి భూమిపతి దీర్ఘతా చ తే
కేశేషు భర్గభవనేశ్వరి! త్రియమ్. ౫

ఓ శివగృహిణీ! వర్షాకాలమున మేఘపటలమునందగు సాంద్రతయు, యమునాతరంగసందోహమునందగు నిమ్న - తుంగతయు, కాలాహిలోకపతియందగు దీర్ఘతయు, అను నీమూడును గూడ నీ కేశములయందున్నవి.

ప్ర భ:—సాంద్రత=నిబిడత-దట్టమై యుండుట. నిమ్న-తుంగత=ఎత్తుపల్లములు గలిగియుండుట (భంగిమత్త్వ) దీర్ఘత=ఆయతత్వము - పొడవై యుండుట కాలాహిలోకపతి=కృష్ణవర్ణముగల నాగరాజు. ఇట్లనేకములగు నుపమాధర్మములన్నియుఁగూడ ఒక్కటియేయగు కేశపాశమున సమావేశించుటవలన ఇది-మాలోపమాలంకార మగుచున్నది. "మాలోపమా యదేకస్యోపమానం బహు దృశ్యతే" ఒకే యుపమేయమునకు అనేకములగు నుపమానములు కాన్పించునెడల నది-మాలోపమయగును. అని సాహిత్యదర్పణమున లక్షణము చెప్పఁబడినది.

మూ॥ ఈశానసున్దరి! తవాస్య మణ్డలా
న్నిచ్చెర్నితాన్త మమృతాంశు మణ్డలమ్
కోపాన కీర్త్యతి లోష్టపిణ్డకమ్
లోకే నికృష్టమిహ మానవీ ముఖాత్. ౬

ఈశ్వరసుందరీ! నీముఖమండలముకంటె చంద్రమండలము మిగుల నికృష్టము. ఈలోకమున మానవీముఖముకంటె మృత్పిండ మును అధమముగా నెవఁడు చెప్పకుండును?

ప్ర భ:-మానవీముఖముకంటె=మనుష్యస్త్రీ ముఖముకంటె. మృత్పిండము= మట్టిముద్ద. మట్టిముద్ద-మానుషీముఖముకంటె నికృష్టమని యందఱును జెప్పు దురు. జీవించియున్న సుందరియొక్క- ముఖమునకును, మట్టిముద్దకును, ఎంత భేద ముండునో, ఉమాముఖమండల- చంద్రమండలముల కంతభేదము గలదనిభావము.

ఇచట- బింబములగు- ముఖమండల- చంద్రమండలములకు, మానుషీముఖ- లోష్టపిండకముల యందగు ప్రతిబింబభావము చెప్పఁబడినది. కావున నిది దృష్టాం తాలంకారమగుచున్నది. మీఁది దృష్టాంతముచేత ప్రస్తుతమును, సమర్థనీయమును నగు- చంద్రమండలముయొక్క- నికృష్టతను సమర్థించుటవలన అర్థాంతరన్యాసము అలంకార మగుచున్నది.

ప్రకృతార్థసమర్థనముగల అర్థాంతరన్యాసమునకుఁ గలప్రధానతవలన, తదుప యోగియగు దృష్టాంతము అంగమగుచున్నది. ఇట్లు-అంగమగు దృష్టాంతమునకును, అంగియగు అర్థాంతరన్యాసమునకును గల అంగాంగిభావమున నిది సంకరాలంకార మగుచున్నది.

మూ॥ బిభ్రత్యమర్త్య భువనస్థ దీర్ఘికా
పఙ్కేరుహాణి వదనాయ తే బలిమ్
నోచేత్ కథం భవతి సౌరభం మహద్
భిన్నే సుమేభ్య ఉరుకేశి! తే ముఖే. 2

పృథులమగు కేశపాశముగల జగజ్జననీ! స్వర్లోకస్థితములగు దీర్ఘి కలయందలి పంకేరుహములు నీముఖమునకుపహారమును సమర్పించు చున్నవి. అట్లు సమర్పింపనియెడల పుష్పభిన్నమగు నీముఖమునందు గొప్పదగు సౌరభమెట్లు కలుగును?

ప్ర భ:-దీర్ఘిక=వాపి (బొడ్డనబావి). ఉపహారము-బలి. పూజాద్రవ్యము. సౌరభము-సౌగంధ్యము-పరిమళము. "సురలోకవాపీగతములగు పద్మములు- నీముఖ మునకు బలిగా తమ్మే యర్పించుకొనుచున్నవి. కావుననే పుష్పముకంటె వేరగు

నీముఖమునకు గొప్ప పరిమళముగలుగుచున్నది.’’ అని హేతుత్వమును సంభావించుటవలన నిది హేతూత్ప్రేక్షాలంకార మగుచున్నది. వాచ్యము కాకుండుటవలన నీ హేతూత్ప్రేక్ష- గమ్యమని చెప్పఁబడును.

మూ॥ గీర్వాణలోకతటినీ జలేరుహాణామ్
గన్ధే శుభే భవతు తే మనోరతిః
లోకాధిరాజ్ఞి! తవ వక్త్రసౌరభే
లోకాధిరాజ మనసస్తు సమ్మదః. ౮

ఓ విశ్వేశ్వరి! దేవలోకనదీజలేరుహములశోభనగంధమున నీమనః ప్రీతియగుఁగాక, నీకాంతుఁడగు విశ్వేశ్వరుని మనస్సమ్మదము మాత్రము నీముఖసౌరభమునందే యగుచున్నది.

ప్ర భ:-జలేరుహములు-పద్మములు. సకలమనోహర- సురలోకసుమనస్సౌభాగ్యాతిశాయియు, లోకాధిరాజ మనస్సమ్మోదకమును, అగు అటువంటి ముఖపరిమళము- ఉత్తమ- పద్మినీజాతి సుందరివగు నీకుఁ గలదని భావము.

మూ॥ కోభాషతాం తవ సవితృ చారుతాం
యస్యాః స్మితస్య ధవలద్యుతిర్లవః
యస్యాః శరీరరుచిసిన్ధువీచయః
శమ్పాలతాః పృథులదీప్తిభూమయః. ౯

జననీ! ఏ నీ స్మితలవము- ధవలద్యుతియో (చంద్రుఁడో) ఏ-నీ దేహప్రభానదీతరంగములు- విపులదీప్తిభూములగు శంపాలతలో, ఆ నీ చారుత్వమును, ఎవఁడు భాషించును?

ప్ర భ:—లవము=లేశము- ధవలద్యుతి=తెల్లని కాంతిగలచందురుఁడు. శంపాలతలు=మెరుపుఁదీఁగలు. భగవతీమందస్మితలేశమే చంద్రుఁడు. తరంగిణీభంగోపమ-దేహప్రభయే- విపులప్రకాశక దేశములగు విద్యుల్లతలు. అని ఉభయత్ర- స్మిత-చంద్రులకును, దేహప్రభా- విద్యుల్లతలకును, తాదాత్మ్యము నిశ్చయింపఁపడుటవలన రూపకమలంకారము. భగవతీహాసలేశము- చంద్రరూపమనియు, తద్దేహప్రభలు-విద్యుద్రూపములనియుఁ జెప్పఁబడుటవలన ‘అజగజ్జనని-బ్రహ్మాండశరీర’ అనునం

శము వ్యంజితము. ఈయాచార్యునిచే గానము చేయఁబడిన శివశతకమునందుఁగూడ నీయంశమిట్లు చెప్పఁబడినది.

“బిమ్బం మేచకతో యజాతసుహృదో మన్దస్మితం సున్దరమ్.”

‘దేవిశరీరప్రభయే- మెఱుపు - మెఱుపే-దేవీశరీరప్రభ.’ అనికూడనీగ్రంథమునందే యింకొకచోటఁ జెప్పఁబడినది. ఈ యంశమింద్రాణీ సప్తశతియందుఁగూడ గాన్పించుచున్నది.

మా॥ లోకామ్బికే! నవిలసన్తి కేపురో
మన్దస్మితస్య తవరోచిషాం నిధేః
యే తు వ్యథాయిషత తేన పృష్ఠతో
హన్త్యేషు కాఽపి తిమిరచ్ఛటా భవేత్. ౧౦

లోకాంబికా! రోచిస్సులకు నిధియగు (కాంతులకు పుట్టినిల్లగు) నీచిరునవ్వున కెదుటనున్నవారు- ఎవరు ప్రకాశింపరు? ఆచిగురునవ్వుచేత అధఃకరింపఁబడినవారియందుమాత్రము- పాపము! ఒకానొక తిమిరచ్ఛట క్రిమ్మియుండును!

ప్ర భ:—అధఃకరింపఁబడినవారు=వెనుక నుంచఁబడినవారు. తిమిరచ్ఛట= తమః పరంపర- తెరలుతెరలుగా క్రమ్మినచీకటి.

“సర్వతేజోనిధియగు దేవిస్మితమునకు ముందున్నవారు తేజస్వులగుదురు. అస్మితరేఖ సోకనివారు- అనిర్వచనీయమగు అంధకారపరంపరలో మగ్నులగుదురు” అని భావము. ఇట్లనుటచేత- భగవతీమందస్మితము- నిగ్రహానుగ్రహసంపన్నమను నంశము-సూచింపఁబడుచున్నది.

మా॥ కిం వారదావలిరుచిర్ముఖస్య కిం
సమ్ఫుల్లతా వరధియః కిమూర్మికా
సన్తోషపాదపసుమం ను శఙ్కర
ప్రేమస్వరూప ముత దేవి! తే స్మితమ్. ౧౧

దేవి! నీ చిఱునవ్వు ముఖదంతపంక్తి ప్రభయా? ముఖసంఫుల్లతయా? వర-ధీతరంగమా? సంతోషపాదప-సుమమా? శంకరప్రేమస్వరూపమా?

ప్రభ:—ముఖ- సంప్రుల్లతయా=ముఖముయొక్క వికాసీత్వమా? వర- ధీ- తరంగమా?=ప్రశస్తమగు బుద్ధియొక్క వీచికయా? సంతోష పాదప- సుమమా?= సంతోషమను వృక్షముయొక్క పూవా? శంకర- ప్రేమస్వరూపమా=శివునియందు నీకుఁగల ప్రేమకుస్వభావమా? దేవిస్మితమిట్లు వితర్కింపఁబడినది.

"సా దృశ్యమూలము, భాసమానా విరోధకము. సమబలము -నానాకోట్య వగాహిని, ధీరమణీయము అగునది ససందేహాలంకారము." అను పండితరాజలక్షణము ననుసరించి యిది ససందేహాలంకృతియని తెలియునది.

మూ॥ దిక్షు ప్రకాశపటలం వితన్వతా
కోటిప్రభాకర విభక్త తేజసా
నేత్రేణ తే విషమనేత్ర వల్లభే!
పఙ్కేరుహం కఉపమాతి పణ్డితః.　　౧౨

ఓవిషమనేత్రవల్లభా! ప్రకాశపటలమును సర్వదిక్కులయందుగాను విస్తరించునదియు, కోటిసంఖ్యాకులగు సూర్యులచేత విభక్తమగు తేజముగలదియు, నగు నీనేత్రముతో పంకేజమును (బురదయందు పుట్టినతామరపూవును) ఏపండితుఁడు సాటిచేయును?

ప్రభ:- విషమనేత్రవల్లభా=త్రినేత్రకాంతా! సర్వదిగ్వ్యాపియగు ప్రసారము గలదియు, కోటిసూర్యులకు విభజించి యీయఁబడిన స్వతేజోభాగములు గలదియు, నగు నీనేత్రమెక్కడ? బురదయందుపుట్టినకమలమెక్కడ? పండితుఁడెవ్వఁడు తథావిధమగు నీనేత్రముతో పంకజమును సమముచేయును? అనఁగా చేయఁడని యర్థము. "విషమం వర్ణ్యతే యత్రఘటనా ఽననురూపయోః" "అనురూపములు కానివానికి సంబంధము వర్ణింపఁబడినయెడల విషమమగును." అను లక్షణమువలన నిది విషమాలంకార మగుచున్నది.

మూ॥ శ్రీకర్ణ ఏష తవలోచనాఞ్చలే
భ్రాన్త్యా దయాదయితయా ప్రబోధితః
ఏతం సవిత్రి! మమకఞ్చనస్త్వం
శ్రుత్వాతనోతు భరతావనేః శ్రియమ్॥　　౧౩

సవిత్రి! నీలోచనాంచలమున వెలయుచున్న దయయను ప్రియురాలిచేత మేలుకొల్పబడిన యీనీ శ్రీకర్ణము ఈ నా స్తోత్రవిశేషము నాలించి–భరతఖండమునకు సంపద నిచ్చుగాత.

ప్ర థ:— సవిత్రి=జననీ! లోచనాంచలమున=కటాక్షమున, కడకంటిచూపునందు. శ్రీకర్ణము=కర్ణమన– చెవి. నామాఖ్యానముకంటె ముందు– మాననార్థమగు శ్రీశబ్దము ప్రయోగింపఁబడినది, శ్రీయుక్తమగుకర్ణము–శ్రీకర్ణమనికూడ విగ్రహవాక్యమును జెప్పనగును. అట్లయిన శ్రీకర్ణమునకు భరతశ్రీసంధానము యుక్తమే యగును. ఇచట నీయంశము గుర్తింపఁదగినది:—

ఖిలములగు కవికృతులయందును, పద్యములయందును ఈపద్యము కాన్పించుచున్నది. "నేత్రాదపి తే శ్రోత్రం సుమశరశత్రోః పురన్ధ్రి! ముఖ్యంనః! శ్రోత్రే స్తోత్రాద్విముఖే నేత్రం నతగాత్రి! కింకురుతామ్".

పుష్పబాణునకు శత్రువగు శివుని కాంతవగు జననీ! నీనేత్రముకంటె నీశ్రోత్రము మాకు ముఖ్యము. ఓ నతగాత్రి! శ్రోత్రము–స్తోత్రవిముఖమగునెడల నేత్రమేమి చేయును? కావుననే కడకంటిచూపునందున్న దయాదయితచేత ప్రబోధితమగు కర్ణము– ఈస్తవము నాలించుఁగాత! అని చెప్పఁబడినది. ఆశ్రోత్రము–శ్రీమయము. కావున వినినంతమాత్రముననే భరతఖండశ్రీవిధానము సుకరమగును.

మూ॥ స్వానాసికాభవతి యుఞ్జతాంసతాం
సంస్తమ్భినీచలతమస్య చక్షుషః
త్వన్నాసికా పురహరస్య చక్షుషః
సంస్తమ్భినీ భవతి చిత్ర మమ్బికే! ౧౪

అంబికా! యోగసాధనము నొనర్చుచున్న సత్పురుషులకు స్వీయమగునాసిక, చంచలతమమగు స్వనేత్రమునకు– సంస్తంభిని (స్థిరతనిచ్చునది) యగుచుండును. నీనాసికమాత్రము– పురహారుఁడగు శివునియొక్క నేత్రమునకు సంస్తంభిని (స్థిరత నిచ్చునది)యగుచున్నది. ఇది యాశ్చర్యముగ నున్నది.

ప్రతిభ:—ముక్కుకొనయందు దృష్టినుంచి ధ్యానించుచున్న యోగికి, తనముక్కు తనదృష్టిని వశీకరించుటకే సమర్థమగుచుండును. నీనాసమాత్రము– ఇంకొకని నయనమును వశీకరించుటకు సమర్థమగుచున్నది. ఇదే చిత్రమనితాత్పర్యము.

హరునిదృష్టి- భగవతీ నాసాగ్రి రామణీయక నిమగ్నమని భావము.

"విరుద్ధం భిన్నదేశత్వం కార్యహేతోఽసఙ్గతిర్మ"

"కార్య- కారణములకు- విరుద్ధమగు భిన్నదేశత్వము- అసంగతి" అనులక్షణమువలన ఇచట కార్యమగు పురహరచక్షుస్స్రంయమనమునకును, దానికి హేతువగు, అంబికానాసికకును భిన్నదేశస్థితివలన (కార్యమొకచోట- కారణమొకచోట- ఉండుటవలన) ఇది అసంగతియను నలంకారమగుచున్నది.

మూ. బిమ్బప్రవాల నవపల్లవాదితః
పీయూషసార భరణాద్ గుణాధికః
గోత్రస్యపుత్రి! శివచిత్తరఞ్జకః
శ్రేష్ఠో నితాన్త మధరాధరోఽపి తే. ౧౫

పార్వతీ! బింబము, ప్రవాళము, నవపల్లవము మొదలగువానికంటె అమృతసారభరణమువలన గుణాధికమై, శివహృదయ రంజకమగు నీ, అధర- అధరముకూడ మిక్కిలి శ్రేష్ఠమగుచున్నది.

ప్ర భ:—బింబము=ఎఱ్ఱని దొండపండు. ప్రవాళము. ఎఱ్ఱని రత్నవిశేషము పగడము) నవపల్లవము=ఎఱ్ఱని క్రొంజివురాకు. అమృతసారభరణమువలన=అమృతరసమును భరించుటవలన. అధరాధరము=కెమ్మోవి (క్రిందిపెదవి) లేక మిక్కిలి నీచము. నీకెమ్మోవి- అమృతధరము. కావున అరుణ, బింబ, ప్రవాళ- నవకిసలయములకంటె నధికమగు గుణముగలది. కావుననే శ్రేష్ఠమనిభావము. అధర + అధరమైనను=మిక్కిలి నీచమయినను, శ్రేష్ఠము=ఉత్తమము అనువిరోధమున్నది. ఆకెమ్మోవి శివచిత్తరంజకమగుటవలన మీఁదివిరోధము పరిహరింపఁబడుచున్నది కావున నిది విరోధాభాస మగుచున్నది.

ఇందు- ఉపమానములగు బింబాదులకును- ఉపమేయమగు కెమ్మోవికిని- రక్తిమయందును, మార్దవము మొదలగువానియందును సాధర్మ్యమున్నను, ఉపమేయమగు కెమ్మోవియందు అమృతరసభరణరూపమగు విశేషముండుటవలన వ్యతిరేకమలంకారమగుచున్నది. ఇట్లు వ్యతిరేక విరోధాభాసములకుఁగల అంగాంగిభావమువలన నిది సంకరమగుచున్నది.

మూ. దోర్వల్లికే జనని! తే తటిత్ప్రభా
మన్దారమాల్యా మృదుతాపహారికే
సిశ్లేషబన్ధదమనస్య ధూర్జటే
ర్బన్ధాయ భద్రచరితే బభూవతుః. ౧౬

జననీ! భద్రచరిత్రాత్రీ! విద్యుత్ప్రభయొక్కయు, మందార మాల్యముగొక్కయు, చ్ఛవిహరింపగ ననహారించుసనవియగు నీబాహులతి కలు నిశ్శేషబంధదమనుడగు (బంధమునంతను తెంపుకొనినవాడగు). ధూర్జటిని బంధించివైచినవి.

ప్రభ:— విద్యుత్ప్రభ = మెఱుపుయొక్క కాంతి, మందారమాల్యము = సుర లోకమందలి మందారపుష్పమాల. బాహులతికలు = బాహువులను తీగలు. నిశ్శేషబంధ దమనుడు = సమస్తబంధములను తొలగించువాడు. ధూర్జటి = శివుడు. మెఱుపు మెఱుగుకంటెను, మందారపుష్పముకంటెను మిక్కిలి మెత్తనివగు నీభుజలతికలు— సర్వబంధ నివారకుడయినను హరునకు బంధమును గలిగించినవను విరోధము— ఆబంధము ప్రేమకృతమగుటవలన పరిహరింపబడుచున్నది. (ఆభాసమగుచున్నది) కావున నిది విరోధాభాసమను నలంకారమగుచున్నది.

మూ॥ హస్తాబ్జయోస్తవ మృదుత్వమద్భుతం
గృహ్ణాతి యో సదయమేవ ధూర్జటిః।
అత్యద్భుతం జనని! దార్ఢ్యమేతయోః
శుమ్భాది గర్వవిలయోదయగౌరభూత్. ౧౭

అమ్మా! హరుడు వేనిని దయతో గ్రహించుచున్నాడో ఆనీహస్తాబ్జముల మృదుత్వము— అద్భుతమగుచున్నది. అయినను వీనిదృఢత్వము— అత్యద్భుతమగుచున్నది. ఇవియే (హస్తాబ్జములే) శుంభాదులగు నసురుల దర్పమును నశింపజేసినవి.

ప్రభ:— మృదులములగు పాణులు— దృఢములగుట విరుద్ధము. మీదివిరోధము— ఆహస్తములకుగల స్వాభావికమగు ప్రభావము చేత పరిహరింపబడుచున్నది. కావున నిదియు విరోధాభాసమేయని గ్రహించునది.

మూ॥ రాజన్తు తే కుచసుధాప్రపాయినో
లోకస్య మాత రనఘాః సహస్రశః
ఏతేషు కశ్చన గజాననః కృతీ
గాయన్నియం సకలదాయి సత్కరన్. ౧౮

జగన్మాతా! నీయొక్క స్తన్యసుధాప్రవాహములును, సవితృ లును అగుపర్వతజలు వేలకొలఁదియు లోకములఁ బండించుచున్నవి. వీరి యందొకఁడగు గజాననుఁడు కృతియగుచున్నాఁడు విద్వాంసు లితనినె సకలమునుగూడ దానముచేయు స్వభావముగల శోభనమగు హస్తము (తొండము) గలవాఁడని గానముచేయుదురు.

ప్ర భ:—స్తన్యసుధాప్రవాహములు=తల్లి చనుబాలు త్రావినవారు. కృతి= సుకృతి. విద్వాంసుఁడు. గజాననుఁడు=గజముఖుఁడు– గణపతి. గజాననునిహస్తము (తొండము)నందే– సర్వదాన సమర్థత యున్నది. కావున నాగజముఖుఁడే– ధన్యతముఁడని భావము. మూలమున 'సకలధాయి సత్కరమ్' అను పాఠముగూడఁ గలదు. అపుడు సకలముధరించు స్వభావముగల హస్తముగలవాఁడనునర్థము నెఱుఁగునది. నీకుచసుధా ప్రభావ మట్టిదని భావము.

మూ॥ త్వన్నాభికూపపతితాం గృశం ప్రభో
ర్నేతుం వినిర్మలగుణే పునస్తటమ్।
సౌమ్యత్వదీయ హృదయప్రసారితః
పాశః సవిత్రి! తవ రోమరాజికా. ౧౮

విశిష్టమగు పవిత్రగుణములుగల సవిత్రీ! నీరోమరాజిక(లోమరేఖ) నీనాభికూపమున- పతితమయిన ప్రభువగు హరునియొక్క- దృష్టిని– తిరుగ తటమునకుఁ జేర్చుటకు, సౌమ్యమగు నీహృదయముచేత ప్రసారితమయిన పాశము.

ప్ర భ:—రోమరాజియే రోమరాజిక. నాభికిమీఁద హృదయమువఱకునుగల లోమరేఖయే యిచట రోమరాజికఅని చెప్పఁబడినది. కూపము=నూయి. తటము – తీరము (ఒడ్డు), పాశము=త్రాడు. నీహృదయము– నీనాభియందాసక్తమయిన హరుని దృష్టిని తనకున్ముఖమగునట్లాకర్షించెనను భావమును చమత్కరించుటకు, నాభి యందుకూపమును, వక్షోజమధ్యమగు హృదయమునందు తటమును రోమరాజియందు పాశమును, తాదాత్మ్యముచేత సంభావించుచున్నాఁడు. నాభియనుకూపము– హృదయమనుతటము, రోమరాజియను పాశము అని తాదాత్మ్యమాత్రమునం జూచి త్యమగునెడల రూపకప్రతిపత్తి (రూపకస్థానము) మన్నినాదమే యగును, (రూపక

మను తెలివిని వారించుట కష్టసాధ్యమగును) 'నాభి' మున్నగువానికి సహపాదుల తాదాత్మ్యమును సంభావించుటయం దౌచిత్యమునంగీకరించి-ఆరూపక ముత్ప్రేక్ష యందు పర్యవసించునని చెప్పనగును. 'చిత్రమీమాంస' అనునలంకార శాస్త్రమున అప్పయ్యదీక్షితులవారు "ఔచిత్యమువలన ఉపమాలంకారము— ఉత్ప్రేక్షయందు పర్యవసించును" అనిచెప్పి రూపకప్రతీతిస్థలమునందుఁగూడ తాదాత్మ్యసంభావన ముచితమగునపు డిట్లే దానికి ఉత్ప్రేక్షయందు పర్యవసానము- అవగంతవ్యమను టకు క్రిందియుదాహరణము నిచ్చియున్నారు.

శ్లో. రక్షన్తుత్వామసితజలజై రఞ్జలిర్న పాదమూలే
మీనా నాభీసరసి హృదయే కౌస్తుభాఖ్యాముదారేణ
హారాః కణ్ఠే హరిమణిమయాః వక్త్రపద్మే ద్విరేఫాః
పిఞ్ఛాచూడాశ్చికురనికరే ఘోషయోషిత్ కటాక్షాః.

కృష్ణుని పాదమూలమున- నల్లకలువపూవుల యంజలియు, నాభీసరస్సున మీనములును, హృదయమున- కౌస్తుభమును, కంఠమున- ఇంద్రనీలమణిమయహార ములును, ముఖపద్మమున- తుమ్మెదలును చికురనికరమున- నెమలిపురిసిగలును అగు గోపస్త్రీ కటాక్షములు నిన్నురక్షించునుగాత. ఇందు- గోపస్త్రీ కటాక్షములకు నీలోత్పలాంజల్యాది తాదాత్మ్యసంభావన ముచితమగుటవలన రూపకమిచట నుత్ప్రేక్షయందు పర్యవసానము నొందినది. మూలశ్లోకమున ఇవాదివాచకము ప్రయోగింపఁబడకుండుటవలన నీయుత్ప్రేక్ష గమ్యమైనను మిక్కిలిస్పష్టమై వాచ్యాయమాన మగుటవలన అలంకారధ్వని కాక అలంకారమే యగుచున్నదని గ్రహించునది.

మూ॥ త్వన్మధ్యమో గగనలోక ఏవచేత్
త్వద్దివ్య వైభవవిదో న విస్మయః
ప్రాజ్ఞైర్హి సున్దరి! పురత్రయ ద్విషః
త్వం దేహినీ త్రిభువనేన గీయసే. ౨౦

పురత్రయశత్రువగు హరునిసుందరివగు భగవతీ! నీవుముల్లోకము లును దేహముగాఁగలదానవని ప్రాజ్ఞులు గానముచేయుచుందురు. కావు ననే నీదివ్యవైభవము నెఱిఁగిన పండితునకు "నీనడుము అంతరిక్షమే" అగునెడల (ఈవిషయమున ఆశ్చర్యము కలుగనేరదు.

ప్ర భ:—ఉత్తమ కాంతల నడుము— ఆకాశమునని కవిసమయము. ఆ వాద మిచట చమత్కృతిజనక మగుచున్నది. "నీవు త్రిభువనమే శరీరము. అందు మధ్యము లోకమగు నంతరిక్షము— నీనడుము" అనునర్థము— నీమహాప్రభావము నెఱింగిన వానికి విస్మయమును గలిగించునని భావము.

ఇచట— మధ్యమము— గగనలోకమని యుపన్యసించుట దుష్కరవిషయము కావున సమర్థనము నపేక్షించును. అనసుముచే త్రిభువనేన దేహినీ (ముల్లోకములను దేహముగాఁ గలదానవు) అని ముల్లోకములను నడుమనుగల అంతరిక్షలోకముగా వ్యవహరించి సమర్థించుటవలననిది వాక్యార్థహేతుకమగు కావ్యలింగాలంకారమగు చున్నది. "హేతోర్వాక్యపదార్థత్వే కావ్యలిఙ్గం నిగద్యతే" అనునది దానిలక్షణము

మూ॥ నాభిహ్రదాద్ విగలితః కటిశైలా
భఙ్గాత్ పునః పతతికిం ద్విధాకృతః।
కాన్త్యోరుయుగ్మమిషతః సవిత్రి! తే
భా వారిపూర ఇభశుణ్డయోః సమః. ౨౧

జననీ! నాభియేయగు తటాకమునుండి బయలువెడలి, కటియే యగు శిలయందగు భంగమువలన తిరుగ ద్వివిధముగా ఖండింపఁబడిన. నీకాంతిప్రవాహము— గజతుండములకు సదృశమగుచు, కమనీయమగు ఊరుయుగళమను మిషచేత ప్రసరించుచున్నదా?

ప్ర భ:—మీదిప్రశ్నము సంభావనార్థకము. నాభి–హ్రదములకును, కటీ–శిలలకునుగల తాద్రూప్యమువలన రూపక మలంకార మగుచున్నను తాదాత్మ్యసంభావనయందలి ప్రాధాన్యమువలన ఉత్ప్రేక్షయందు పర్యవసించును. అది 'ఊరుయుగళమను మిషచేత' అను, అపహ్నవము (కప్పిపుచ్చుట) వలన, సాపహ్నవ–స్వరూపోత్ప్రేక్షయగును. ఇవాదివాచకము లేకుండుటవలన, ఈయుత్ప్రేక్ష–గమ్యమగును.

మూ॥ జఙ్ఘాయుగం తవ మహేశనాయికే!
లావణ్యసిర్ఘ్గి జగద్ విధాయికే
అన్తః పరిస్ఫురదగుప్తసుప్రభా
బాణాఢ్యతూణయుగలం రతీశితుః ౨౨

జగద్విధాయికా! మహేశనాయికా! నీవు లావణ్యనిర్ఝరివి! నీజంఘాయుగలము- లోపలపరిస్ఫురింపుచు, అగుప్తములగు (దాచఁబడనివగు) సుకాంతి బాణములచేత సంపన్నమగు రతీశ్వరుని తూణయుగలము- (అమ్ములపొదులజంట).

ప్ర భ:—లావణ్యనిర్ఝరివి=రామణీకప్రవాహముగలదానవు. జంఘాయుగలము=కాలి వెనుకటిభాగములు (రెండుపిక్కలు) అగుప్తములు=దాచఁబడనివి, సుకాంతి-బాణములు=శోభనములగు కాంతులను బాణములు. ఇచటి యలంకారము కూడ గమ్యోత్ప్రేక్షయే. "నీజంఘలు-మన్మథుని అమ్ములపొదులవలెనున్నవి" అని భావము.

మూ॥ పుష్పాస్త్రశాసననిశాన్తరాజ్ఞి! తే
లోకత్రయస్థఖలకమ్పనం బలమ్
శ్రోణీభరేణ గమనే కిలశ్రమం
ప్రాప్నోషి కేన తవతత్త్వముచ్యతామ్. ౨౩

పుష్పాస్త్రుఁడగు మన్మథుని శాసించిన శివునిగృహమునకు రాజ్ఞివగు జననీ! నీబలము- ముల్లోకములయందునుగల దుర్జనులను కంపింపఁజేయునది. అయినను నీవు నడచునపుడు నీశ్రోణీభరముచేత నగుశ్రమము నొందుచుందువట!దీనికిహేతువగు తత్త్వమును చెప్పుము.

ప్ర భ:—"నీబలము- త్రిలోకదౌర్జన్య దమనమైయున్నను, అల్పమగుశ్రోణీభారమునకు నీకు శ్రమము కలుగుచున్నది. ఇందలి రహస్యమేమి?" అనిభావము. "విభావనా వినాఽపిస్యాత్ కారణం కార్యజన్మచేత్" కారణము లేకున్ననుగూడ కార్యముదయించునెడల నది విభావనయగును. అనులక్షణమువలన, ఇచట- శ్రమ గలిగించు కారణములేకున్నను శ్రమమనుకార్యము కలుగుటవలన విభావన- అలంకారమగుచున్నది.

మూ॥ యస్మైత్రివ నిత్యవిహ్వ తే రభూద్ రమా
రాజీవ మన్దిర చరీతి నామతః।
తన్మేసదాభణతు మఙ్గలం శివా
పాదామ్బుసమ్భవ మమేయ వైభవమ్. ౨౪

ఏ యుమాపాదపద్మమునందు- నిత్యమును విహరించుటవలన రమ- నామముచేత రాజీవమందిరవిహారిణి యయ్యెనో అమేయవైభవమగు ఆయుమాపద్మము-నాకు మంగళమును తెలుపుఁగాత (ఘటించుఁగాత!)

ప్ర॥ భ:—రాజీవమందిరవిహారిణి=పద్మమను భవనమునందు విహరించునది. అమేయవైభవము=ఊహించుటకు (ప్రమాణమునకు) శక్యముకాని విభూతిగలది. లక్ష్మీదేవి-- పద్మాలయ యగుటకు హేతువు- ఉమాపాదపద్మమునందుండుటయే అని యిచట వ్యంగ్యముగా సంభావితము.

మూ॥ కేశాదిపాదకమలాన్తగాయినీః
కస్తుప్రశాసననిశాన్తనాయికా।
అఙ్గీకరోతు లలితా ఇమాః కృతీః
గౌరీ కవేశ్చరణకఞ్జసేవినః. ౨౫

మహేశ్వరపట్టమహిషియగు గౌరి- నిజకేశములనుండి ప్రారంభింపఁబడి పాదకమలములవఱకును స్తుతించునవియు, లలితములును (లలితావృత్తముచే బంధింపఁబడినవియు) చరణకమలసేవియగు కవినగు నాచే రచింపఁబడినవియు. నగు ఈకృతులను స్వీకరించుఁగాత!

ప్ర॥ భ:—లలితములు = సౌందర్యముగలవి లేక లలితయను పేరుగల వృత్తములు.

ఇది సవ్యాఖ్యమగు ఉమాసహస్ర తృతీయశతకమందలి ద్వితీయస్తబకము.

శ్రీ శ్రీ శ్రీ

ఓం నమోభగవతే శ్రీ రమణాయ.

# ఉమా సహస్రము

( తృతీయ శతకము )

## ఏకాదశ స్తబకము

అవ:- ఈపదునొకండవ స్తబకమున - వెనుకటి స్తబకమునందు వలెఁగాక, పాదాదికేశాంతముగ స్తుతి కావింపఁబడుచున్నది. ఇచటఁగూడ యథాపూర్వకముగా, ప్రథమశ్లోకము- హాసస్తుతి పరమగుచున్నది.

మూ. ఝషకేతునా ప్రయుక్తః, సమ్మోహనచూర్ణముష్టిరీశానే
దరహాసోధరదుహితుః కరోతుభువనంవశేఽస్మాకమ్. ౧

పార్వతీదరహాసము- మీనధ్వజుఁ డీశ్వరునియందు ప్రయోగించిన సమ్మోహన చూర్ణముష్టి. ఆదరహాసము- మామనుష్యలోకమును మావశమునం దుంచుఁగాత!

ప్రి భ:—మీనధ్వజుఁడు = ఝషకేతుఁడు-మన్మథుఁడు. సమ్మోహనచూర్ణముష్టి=సమ్మోహింపఁజేయు చూర్ణసంగ్రాహము. ఈశ్వరుని తనయధీనమున నిలుపుకొనుటకు మదనునిచేత ప్రయోగింపఁబడిన సమ్మోహన చూర్ణముష్టియగు పార్వతీమందహాసము- ఇతరులగు నసురులచేత ఆక్రమింపఁబడిన మాలోకమును మాయధీనమునం దుంచుటకు మిక్కిలి సమర్థమని భావము.

ఇచట-దరహాసము-సమ్మోహన చూర్ణముష్టియని సంభావింపఁబడుటవలన. నిది గమ్యోత్ప్రేక్షయగును.

మూ. ఉపజీవద్భిః కాన్తేః లేశాంస్తే జగతి సుందరైర్భావైః ।
ఉపమితుమఙ్గానితవప్రియో లజ్జేఽమ్బ! యతమానః. ౨

అమ్మా! ఈలోకమున నీయొక్క కాంతిలేశముల నాశ్రయించి జీవించుచున్న సుందరములగు పదార్థములతో, నీయంగములనుపమించుటకు ప్రయత్నము గలవాఁడనయినను నేను మిక్కిలిలజ్జించుచున్నాఁడను

ప్ర భ:—లోకమునందలి కవులు- ముఖాదులయందు-ఆహ్లాదకత్వాది ధర్మములను స్ఫురింపఁజేయుటకు, ముఖాదులకంటె వేరయి. స్వతఃసిద్ధమగుచున్న చంద్రాదులతో వానికి ఔపమ్యమును జెప్పుదురు. ప్రస్తుతమగు నీయంగసౌందర్యవర్ణనమునందు మాత్రము- ఈలోకమునందలి సుందరవస్తువులన్నియు- నీయొక్క- కాంతివలననే ఉనికిగలిగి వేరొక కాంతి లేనివగుటవలన స్వతస్సిద్ధములు కానివగుచున్నవి. విషయియగు ఉపమానమును- విషయమగు ఉపమేయమునుగూడ- వేరయియుండునప్పుడే గదా వానికి సాధర్మ్యమును వర్ణించుటవలన ఉపమ యేర్పడును! కావుననే అసంభవమగు నీయంగసౌందర్యోపమానకథనకర్మయందు ప్రవర్తించిననాకు సిగ్గుకలుగుచున్నది. అయినను ప్రయత్నమును విడుచుటలేదు. కావుననే అప్పుడప్పుడు లజ్జించుచున్నాను. అని భావము. "నీకాంతికంటె భిన్నమగుకాంతి లేకుండుటవలన నీకుపమానము గలుగదు." అను నీయర్థము- ద్వితీయసదృశవ్యవచ్ఛేదఫలకవర్ణన విషయీభూతము. కావున నిది- అనన్వయాలంకార ధ్వనియగును. "నీకాంతితో పోల్పఁదగిన రెండవ వస్తువు లేదు." అనునపుడు- అన్వయము కుదురుటలేదు. కావున అన్వయములేని యీయలంకారమునకు అనన్వయమని పేరుకలిగినది.

మూ॥ అవతంసపల్లవతులాం బిభ్రాణం శ్రుతినతభ్రువః శిరసి
చరణం వ్రజామిశరణం వామం కామారి లలనాయాః. 3

శ్రుతిసుందరీ! శీర్షమునందు (వేదాంతమునందు) అవతంసపల్లవసామ్యమును భరియించుచున్న హరసుందరియొక్క- వామ-చరణమును శరణముగా భజించెదను.

ప్ర భ:—వేదాంతము - ఉపనిషత్తులు. అవతంసపల్లవసామ్యమును=అలంకారము కొఱకగు కిసలయముతోడి సమానత్వమును. వామచరణము=సుందరమగు పాదము. ఎడమపాదము. దేవి శివుని వామార్ధముగావున వామచరణము వర్ణింపఁబడినది. కిసలయోపమమగు దేవీపదము- వేదశిరస్సునందగు భూషణమగుచున్నది.

"సర్వే వేదాయత్ పద మామనన్తి"

అని కఠశ్రుతియందుగ్గడింపఁ బడినదిగదా! ఇట్లు శ్రుతిశిరోభూషణమగు దేవీచరణమే నాకు శరణమని భావము.

మూ॥ శఙ్కరనయనోన్మాదన- మతిమధురం భాతిమతిమతా వర్ణ్యే
జఙ్ఘాయుగం భవత్యాః కుసుమపృషత్కస్య సర్వస్వమ్. ౪

బుద్ధిమంతునిచేత స్తుతింపఁదగినజననీ! శివనయనవ్యామోహనము ను, అత్యంతరమణీయమును అగు నీజంఘాయుగము— పుష్పబాణునకు సర్వస్వమై సర్వాధనమై రాజిల్లుచున్నది.

ప్ర భ:—జంఘాయుగము=ప్రసృతాద్వయము - పిక్కలజంట. ఇచట పార్వతీజంఘాయుగము మన్మథునకు సర్వస్వముగా సంభావింపఁబడినది.

మూ॥ ఏకైకలోకనేద్వయమన్యోన్యస్మరణహేతుతామేతి
దేవి! భవస్య, తవోరుః తుణ్డాచ గజేన్ద్రవదనస్య. ౫

మహేశమహిషీ! నీయూరువును, గణపతితొండమును, ఇవి రెండును గూడ, ఏకైకదర్శనమున పరస్పరమగు స్మరణమునకు హేతువులగుచున్నవి.

ప్ర భ:—ఊరువు- తొండము అను నీరెండింటిలోను ఊరువును జూచునపుడు తొండముయొక్క స్మృతి కలుగుచున్నది. అట్లే తొండమును జూచునపుడు ఊరువుయొక్క స్మృతి కలుగుచున్నది. ఇట్లీ రెండునుగూడ- అన్యోన్యస్మారకము లగుచున్నవని భావము.

"సదృశానుభవాద్ వస్తుస్మృతిః స్మరణముచ్యతే"

అను సాహిత్యదర్పణ లక్షణమువలన నిచటియలంకారము స్మరణమని తెలియునది.

మూ॥ నాకోఽవలగ్నమీశ్వరి! కటిరవనిర్భోగినాం జగన్నాభిః
కుక్షౌన కేవలం తే బహిరపివపుషిత్రయోలోకాః. ౬

ఈశ్వరీ! నీకు నాకము— నడుము. భూమి- కటి. పాతాళము- నాభి. ఇట్లు ముల్లోకములును నీకుక్షియందుమాత్రమేగాక వెలుపలి శరీరమునందుఁగూడ నున్నవి.

ప్ర భ:—నాకము=స్వర్గలోకము. కటి=శ్రోణి. భోగిలోకము=పాతాళము. నీకుక్షియందు స్వర్గ- భూమి- పాతాళము లున్నవి. అవి కేవలము నీకుక్షియందే కాక బహిశ్శరీరమునందుఁగూడ, అవలగ్న- కటి- నాభిరూపములై యున్నవని భావము.

మూ॥ మన్యే మహాకృపాణం తవ వేణీమచలపుత్రి! మదనస్య
అసిధేనుకాం విశఙ్కే నిశితతరాగ్రాంతురోమాలిమ్. ౭

అచలపుత్రివగు పార్వతీ! నీ వేణిని (జడను) మదనునికి మహాకృపాణముగా తలంచెదను. రోమాలివిమాత్రము— మిక్కిలి వాడియగునట్లు సానరాతియందు పదనుచేయఁబడిన, అసిపుత్రికనుగా (చిన్నకత్తినిగా) విశంకింతును.

ప్ర భ:—మహాకృపాణము– గొప్పఖడ్గము. రోమాలి=రోమరాజి. ఇందు స్వరూపోత్ప్రేక్ష స్ఫుటమై యున్నది.

మూ॥ ద్విరదవదనేనపీతం షడ్వదనేనాథ సకలభువనేన
అక్షయ్యక్షీరామృతమమ్బాయాః కుచయుగంజయతి. ౮

ద్విరద– వదనునిచేతను, షడ్-వదనునిచేతను, తరువాత సకలలోకవదనములచేతనుగూడ క్రోలఁబడినను, అక్షయ్యమగు క్షీరామృతముగలదియగు అమ్మస్తనయుగము– జయించుచున్నది.

ప్ర భ:—ద్విరదమన రెండుదంతములుగల యేనుఁగు. ద్విరదవదనుఁడన గజముఖుఁడగు గణపతి. షడ్వదనుడు=ఆరుముఖములు గలవాఁడు– సుబ్రహ్మణ్యుఁడు. అక్షయ్యము=క్షీణింపఁజేయుటకు శక్యము కానిది.

మూ॥ జగదమ్బలమ్బమానా పార్శ్వద్వితయే తవాగలాద్భాతి
నాస్రగ్గ్రథితమనోజ్ఞప్రసూనమాలేవ భుజయుగలీ. ౯

ఓజగదంబా! నీభుజయుగళి— గళమునుండి మొదలుకొని యుభయపార్శ్వములయందును వ్రేలాడుచున్నదై, దట్టముగాఁ గూర్పఁబడిన మనోజ్ఞమగు ప్రసూనమాలవలె భాసిల్లుచున్నది.

ప్ర భ:—భుజయుగళి=బాహుద్వయి. ప్రసూనమాల=పూలదండ. కంఠమునుండి ఉభయపార్శ్వములను బొందిన బాహుయుగళి పుష్పమాలవలె నున్నట్లు సంభావించుటచేత ఉత్ప్రేక్ష అలంకారమగుచున్నది.

పుష్పమాల– కోమలమైనను తెగకిలేనట్లు కూర్పఁబడినదనియు, భుజయుగళి మృదులమైనను దృఢమగు సంధిబంధముచేత [illegible]పన్నమ[illegible]ము గమ్యము.

మూ॥ జానన్తి శక్తిమసురాః, సుషమాంసఖ్యోవదాన్యతామృషయః
మృదుతాం తవామ్బ! పాణేర్వేదసదేవః పురాంభేత్తా. ౧౦

అమ్మా! అసురులు నీశక్తిని తెలిసికొనుచుందురు. సఖులు నీసుషమను (గొప్పశోభను) తెలిసికొనుచుందురు. ఋషులు వదాన్యతను గ్రహించుచుందురు. పురవైరియగుఆశివుఁడు నీపాణిమృదులతనెఱుఁగును.

ప్రభ:—(అసురులు-శక్తియుక్తవనియు, సఖులు - సుషమామయివనియు, ఋషులు, వదాన్యవనియు, శివుఁడు, మృదులపాణివనియునిన్నుగుర్తింతురనిభావము.)

మూ॥ కమ్బుసదృగమ్బ! జగతాం మణివేషోడుస్రజాకృతాకల్పః
కణ్ఠోఽనఘస్స్వరస్తే ధూర్జటిదోర్నయనకర్ణహితః. ౧౧

ఓ జగదంబా! నీకంఠము- కంబుసదృశము, అలంకారార్థమగు మణియను వేషము (రూపము)తో నున్న నక్షత్రమాలచేత విరచితమగు భూషణముగలది. నిర్దుష్టమగు స్వరముగలది. (కావుననే) ధూర్జటియొక్క బాహువులకును, దృష్టికిని, కర్ణమునకును హితమయినది.

ప్రభ:—కంబుసదృశము=శంఖముతో సాటియగునది. మణి...భూషణము గలది=రత్నములను మిషతోనున్న నక్షత్రములే మాలగాగలది. ఆలింగన సుఖకరమగుటవలన కంఠముయొక్క శంఖసాదృశ్యము-శివుని బాహువులకును, నయనసుభగమగుటవలన, నక్షత్రమాలారచన, శివునిదృష్టులకును, శ్రుతిసుఖకరమగుటవలన నిర్దుష్టమగు తద్ధ్వని శివుని శ్రవణములకును హితమగునని భావము.

'యథాసఙ్ఖ్యం క్రమేణైవ క్రమికాణాం సమన్వయః'
అను లక్షణమువలన నిది యథాసంఖ్యమను నలంకారమగుచున్నది.

మూ॥ హారకాన్తే! వదనం తే దర్శందర్శంవతంస శీతాంశుః
పూర్ణోఽప్యవాపకృశతాం ప్రాయేణాసూయయాశుష్కః. ౧౨

హారసుందరీ? శివశిరోభూషణ-చంద్రుఁడు నీయాననమునుచూచి చూచి, పూర్ణుడయినను, ప్రాయశః, నీముఖప్రభను సహింపలేకుండుట వలనఁ గలిగిన అసూయచేత నీరసుఁడై కృశత్వము నొందెను.

ప్ర భ:—శివుని శిరస్సునందున్న అర్ధచంద్రుడు- అర్ధచంద్రుడగుటకు హేతువు- "ఉమాముఖ దర్శనజాతమగు అసూయయే'' అని సంభావింపఁబడినది. కావున నిది ఉత్ప్రేక్షయగుచున్నది.

మూ॥ చన్ద్రేణ రణాయసకలాచపలాక్షీ వదనజాతి రాహ్వాయతాం
తంతుమహసాముఖం తే మహేశకాన్తే! జిగాయైకమ్. ౧౩

మహేశ్వరకాంతా! చపలాక్షులగు సుందరుల ముఖజాతియంత యునుగూడ చంద్రునియుద్ధమున కాహ్వానించుగాక! (సకలస్త్రీవదనములచేతనుగూడ నెదుర్కొనఁబడినను గూడ జయింపఁబడని) ఆచంద్రుని మాత్రము నీముఖ మొక్కటియే- కాంతిచేత జయించినది. "నీముఖమునందలి మహస్సు- అటువంటి సర్వశోభాతిశాయి'' అని భావము.

మూ॥ వదనకమలంత వేశ్వరి! కమలజయాద్దర్పితంసుధాభానుమ్
నిర్జిత్యకమలజాతే రమలం మహదాజహారయశః. ౧౪

ఈశ్వరీ! నీవదనకమలము- కమలజయమువలన గర్వించినఅమృతాంశునిజయించి, కమలజాతికి మిగుల శుభ్రమగుయశమును సంపాదించెను.

ప్ర భ:—కమలములను జయించుటచేత దర్పించినచంద్రుని దమించుటవలన మహేశ్వరకాంతాముఖము- కమలజాతికే యశస్సునుఘటించెను. కావుననే కమలమునకు ముఖముతోడి యుపమ ప్రఖ్యాతమయినది. ఇట్లు కమలజాతికి, ముఖోపమానతారూపమగు యశస్సు సంపాదింపఁబడినదని కమలమునకు ముఖోపమానతాలాభహేతువును సంభావించుటవలన నిది గమ్యమగు ఉత్ప్రేక్షయగుచున్నది.

మూ॥ లావణ్యామరన్దాశాభ్రమద్భవాలోకబమ్భరం పరితః
ముగ్ధం ముఖారవిన్దం జయతి నగాధీశనన్దిన్యాః. ౧౫

అంతటనుగల లావణ్యమను మరందమునందలి యాశచేత (అధికమగు నపేక్షచేత) భ్రమించుచున్న శివదృష్టులను భ్రమరములుగలదియు- ముగ్ధమును, అగు నగాధీశనందినియొక్క ముఖారవిందము జయించుచుండును. (ఉత్కర్షచే వెలయుచున్నది).

ప్రి భ:—లావణ్యము=సౌందర్యము, మరందము=తేనె. భ్రమరములు=తుమ్మెదలు. నగాధీశనందిని=పార్వతి. ముగ్ధము=సుందరము. ఇచట-లావణ్య-మరందములకును భవాలోక-భ్రమరములకును, ముఖ- అరవిందములకునుగూడ తాద్రూప్యముచేసగు రంజనమువలన రూపక మలంకారమగుచున్నది. 'సర్వేశ్వరదృష్టి-భగవతీవదనామృతగ్రహణలాలస.' అని భావము.

మూ. శుద్ధేనుసారనిర్మిత, నూస్యార్ధంతే భవాని ఫాలమయమ్
సకల రమణీయసారైర్నిర్మిత మర్ధాన్తరం విధినా. ౧౬

భవానీ! ఫాలమయమగు నీముఖమునందలి మీఁదియర్ధభాగమును విధాత, శుద్ధమగు చంద్రునిసారమగు నమృతముచేత నిర్మించెను. క్రింది యర్ధభాగమును సకల రమణీయవస్తువులయొక్కయు సారముల చేత నిర్మించెను.

ప్రి భ:—ఫాలమయము=ఫాలమయము. విశాలమగు నుదుటితోఁగూడినది. విధాత=బ్రహ్మ. సారములచేత=స్థిరములగు నంశములచేత. నీముఖమునందలి మీఁది భాగము- ప్రిభామయమగు అమృతఖండము. క్రిందిభాగము-ఘనమగు సకలసౌందర్యఖండము. అనిభావము. సర్వజీవన-ధారణ- సకలభోగసాధన బలవిధానము_ నీముఖము అనిభావము.

మూ. వదనం తవాద్రిదుహిత ర్విజితాయ నతాయ శీతకిరణాయ
ద్వారపపదవీం ప్రిదదావయమిహ దరహాసనామధరః. ౧౭

పార్వతీ! నీముఖము—శీతల ప్రభాదులచేతవిజితుఁడును, కావుననే నతుఁడును [నమ్రిభావము నొందినవాఁడును] అగు శీతకిరణునికి ద్వారపాలపదవినిచ్చెను. ఇతఁడు [ఈచంద్రుఁడే] ఇచ్చట (నీముఖమునందు) దరహాసమను నామమును ధరించుచున్నాఁడు.

ప్రి భ:—విజితుఁడు=పరాజితుఁడు- ఓడింపఁబడినవాఁడు భవన్ముఖవిజితుఁడగు చంద్రుఁడు ద్వారపాలకుఁడై నీముఖమున మందహాసమను నామమున స్థాపింపఁబడియెనని భావము. కవిప్రౌఢోక్తి సిద్ధమును సహేతుకమును, అసిద్ధవిషయమును అగు స్వరూపోత్ప్రేక్ష- అలంకారము.

మూ. తే తేనవదన్తు సన్తో నయనం, తాటఙ్కమాలయం ముకుటమ్
కనమోవయం వదామః సితమహాసం దేవి తే హాసమ్. ౧౮

దేవీ! సజ్జనులగు ఆయాపురాణకవులు, శుభ్రమగు కాంతిగల చంద్రుని నీకు, నయనముగను, తాటంకముగను, ఆవాసముగను, కిరీటముగను చెప్పుదురు. మేము మాత్రము- ఆచంద్రుని- హాసమని చెప్పెదము.

ప్ర భ:—తాటంకము=కర్ణభూషణము. త్రినేత్రునికి వామనేత్రమునచంద్రుడు లోచనముగా నయ్యెను. కావున దేవికి చంద్రుడు నయనమగుననుట పురాణ ప్రసిద్ధము.

'తాటంక యుగలీభూత తపనోడుపమణ్డలా'

దేవి సూర్య- చంద్రమండలములు కర్ణభూషణద్వయిగాఁగలది. అని లలితా సహస్ర నామావళియందున్నది. కావునఁ గొందఱు చంద్రుని దేవికి తాటంకమని చెప్పిరి. అందే "చన్ద్రమణ్డలమధ్యగా" "చంద్రమండల మధ్యమునందుండునది" అని చెప్పఁబడుటవలన దేవి నివసించు స్థలముకూడ చంద్రమండలమని చెప్పదురు. ఆమె- 'చంద్రచూడ' అనుప్రసిద్ధివలన=ఆమెకు చంద్రుని, కిరీటముగాఁగూడఁ జెప్పుదురు. ఇట్లు పూర్వులగు సత్కవులు నాలుగు తెఱఁగులఁ జెప్పుదురుగాక! మేము మాత్రము అసితకిరణుని హాసముగనే చెప్పెదమని తాత్పర్యము. ఇట్లు—ఇచట పర పక్షములయందు అనంగీకారము నుపన్యసించి, చంద్రుని హాసరూపముగా సంభావించుటవలన నిది సాపహ్నవోత్ప్రేక్షయగునని తెలియునది. "నయనం తాటఙ్కమాననం ముకుటమ్" అను పాఠాంతరము దీనికిఁగలదు.

మూ. బిమ్బాధరస్య శోభా మమ్బ యాః కోను వర్ణయితుమీష్టే
అన్తరపి యా ప్రవిశ్య ప్రమథపతేః క్రియతను తే రాగమ్. ౧౯

అంబా-బింబాధరముయొక్క శోభను వర్ణించుటకు సమర్థు డెవ్వఁడున్నాఁడు? ఆశోభ- ప్రమథపతియగు రుద్రుని యంతరంగము నందుఁగూడ ప్రవేశించి రాగమును (అనురాగమును) విస్తరింపఁజేయు చున్నది.

ప్ర భ:—బింబాధరము=ఎఱ్ఱని దొండపండువంటి మోవి. శోభను- కాంతిని, (రక్తకాంతిని) రాగమును-రక్తవర్ణమును, అనురాగమును మహావిరక్తుఁడగు భగవానుని

దురవగాహమగు హృదయమునఁగూడ ప్రవేశించి, రక్తవర్ణమగుదాని ననురక్తముగాఁ జేయుచు, బింబమువలె నెఱ్ఱనిదగు, పార్వతి యధరశోభ నెవ్వఁడును వర్ణింపఁజాలఁడని భావము.

మూ. గణపతయే స్తనఘటయోః పదకమలే సప్తలోకభక్తేభ్యః
అధరపుటే త్రిపురజితే దదాసి పీయూషమమ్బ! త్వమ్. ౨౦

అమ్మా! నీవు నీపుత్రుఁడగు గణపతికి స్తనఘటముల యందలి యమృతమును (స్తన్యరూపమును) సప్తలోకములయందునుగల భక్తులకు పాదారవిందమునందలి యమృతమును (మకరందరూపమును) త్రిపురములను జయించిన **కాంతుడగుహరునికి,** అధరపుటమునందలి యమృతమును (రసరూపమును) ఇచ్చుచున్నావు.

ప్ర భ:—ఇట్లు పుత్రునికొఱకును- భక్తులకొఱకును- భర్తకొఱకును- వారి వారికిఁ దగినరూపముగల అమృతము నిచ్చెదవని భావము.

మూ. దృక్పీయూషతటిన్యాం నాసాసేతౌ వినిర్మితే విధినా
భాసాంభవతి శివే తే ముఖేవిహారో నిరాతఙ్కః. ౨౧

ఓ శివా! దృష్టియను పీయూషనదియందు నాసయను సేతువు బ్రహ్మచేత నిర్మింపఁబడియుండ, నీముఖమునందు కాంతి-విహారము నిరాతంకమగుచున్నది.

ప్ర భ:—పీయూషనది=అమృతనది. నాస=ముక్కు. సేతువు=గట్టు. నిరాతంకము=అడ్డులేనిది-నిర్భయము.

సేతువు లేనియెడల నదీప్రవాహ భయమువలన విహారము నిశ్శంకము కాక పోవును. కావుననే బ్రహ్మ- నాసను సేతువుగానిర్మించి, "ప్రవహించుచున్న దృష్టి యందు ముఖకాంతులు మగ్నములు కాఁగూడదు." అనిదృష్టియనుదేశమునకు మర్యాదను (హద్దును) ఏర్పరచెను. ఇచట దృక్-తటినులకును, నాసా- సేతువులకును గల తాద్రూప్యమువలన రూపక మలంకారమగుచున్నది. అది- హేతువగు సేతు నిర్మాణమునకు కాంతులయొక్క- నిరాతంకవిహారమే- ఫలముగా సంభావించుటచే నగు ఫలోత్ప్రేక్షకు- అంగమగుచున్నది. ఇట్లు-రూపక- ఉత్ప్రేక్షలకు- అంగాంగి భావముచేత నిది- సంకరమగుచున్నది.

మూ॥ కమలావిలాసభవనం కరుణా కేలీగృహంచ కమనీయే
హరదయితే తే, వినతహి తే, నయనే, జనని! విజయేతే. ౨౨

జననీ ! కమలావిలాసభవనమును, కారుణ్యలీలాభవనమును అగుచు కమనీయములగు నీనయనములు– హరప్రియములును, వినత హితములును అగుచు విజయము నొనర్చుచున్నవి.

ప్ర భ:—కమలా విలాసభవనము=లక్ష్మీవిహారగృహము. వినతహితములు= నమ్రతగలవారికి అనుకూలములు.

మూ॥ సర్వాణ్యప్యఙ్గాని శ్రీమన్తి తవేన్దుచూడకులకాన్తే!
కవినివహవినుతిపాత్రే శ్రోత్రే దేవి! శ్రియావేవ. ౨౩

చంద్రశేఖర కులకాంతవగు దేవీ! నీయంగములన్నియుఁగూడ శ్రీమంతములు, కవినివహవినుతిపాత్రములునగు శ్రోత్రములు-శ్రీలే.

ప్ర భ:—శ్రీమంతములు=శ్రీగలవి- సంపదగలవి. కవి–నివహవినుతిపాత్ర ములు=కవిసమూహముయొక్క స్తుతులకాస్పదములు.

వినుతులు- ఆధేయములును, శ్రోత్రములు-ఆధారములును అగుటవలన శ్రోత్రము- పాత్రమగుచున్నది. శ్రోత్రముకంటె ఇతరములగు నంగములు శ్రీ మంతములని చెప్పఁబడినవి. శ్రోత్రము మాత్రము శ్రీయేయని విశేషింపఁబడినది.

ప్రశ్న:-శ్రోత్రము-శ్రీయేగాని శ్రీమంతముకాదని యేలచెప్పఁబడినది?

ఉ:—"శ్రీకర్ణపేషల" అను పూర్వోక్తశ్లోకమును వ్యాఖ్యానించునపు డీయం శము కొంచెము ప్రదర్శింపఁబడినది. శ్రోత్రము- శ్రీయేయనుచోట శ్రీశబ్దమునకు సంపద– అర్థము. ఛాందోగ్యమునందలిపంచమప్రపాఠకమున "యోహ వై జ్యేష్ఠంచ శ్రేష్ఠంచవేద" అని యారంభించి,"అథ హైనంశ్రోత్రమువాచ. యదహంసమ్పదస్మి త్వం తత్ సమ్పదసి" అని శ్రోత్రము శ్రేష్ఠమగు ప్రాణముతో చెప్పెను. అని వినఁబడుచున్నది. లోకమునందు సంపన్నములగు విద్యలన్నియు శబ్దాత్మకములగుట చేత శ్రోత్రమునందే అంతస్సన్నిహితములు. కావున శ్రోత్రము- సంపద-(శ్రీ) యగు చున్నదని భావము.

మూ॥ అపికుటిలమలినముగ్ధస్తవ కేశః పుత్రిగోత్రసుత్రామ్ణః
బిభ్రత్ సుమానికామ్యపి హృదయం భువనప్రభోర్హరతి. ౨౪

పర్వతేంద్రపుత్రి! నీ కేశము- కుటిల- మలిన- ముగ్ధము. అయినను, ఏవో (సామాన్యములగు) పూవులను ధరించినది అయినను, భువనప్రభువగు భవునిహృదయమును హరించుచున్నది. (ఆకర్షించుచున్నది):

ప్ర భ:—కుటిల- మలిన-ముగ్ధము=వక్రము (తిన్నదనములేనిది) నల్లనిది (శుభ్రముకానిది) మూఢము (జడము)

ప్రశ్న:—కౌటిల్య మాలిన్యాదులగు- అపకర్షకగుణములతోఁగూడిన కేశము- హృదయము నాకర్షించును అనునది లోకవిరుద్ధము.

ఉ:—విరుద్ధముకాదు. ఉన్నతనము, ఆనతమునగుచు వంకరలుగలిగినదియు, నల్లనిదగుటవలన జలద- మయూరాది వర్ణము గలిగినదియు, నగుకచమే దర్శనీయము. కావునవది- కుటిల- మలినమని చెప్పఁబడినది. ముగ్ధమన సుందరమని యర్థముగలదు. కావుననది- ముగ్ధమని చెప్పఁబడినది.

ఇట్లు- విరోధము- పరిహరింపబడుటవలన నిది విరోధాభాసమా? లేక అపి (అయినను) శబ్దస్వారస్యమువలన, జగత్ప్రభుహృదయాకర్షకమగు కారణము లేకున్నను హృదయమునుహరించుట యనుకార్యమును జెప్పుటవలన విభావనయా? అను సందేహమును గలిగించుటవలన విభావనా-విరోధాభాస- సంకరమగునిది- సందేహసంకరాలంకార మగుచున్నది.

మూ॥ చరణాదికున్తలాన్తప్రకృష్టసౌన్దర్యగాయినీ రేతాః
అఙ్గీకరోతుశమ్భోర్గణభృదాత్మజస్యార్యాః॥ ౨౫

శివసుందరియగు నుమాదేవి-చరణాది-కుంతలాంతమగు- అంగముయొక్క- ప్రకృష్టసౌందర్యమును గానముచేసిన, ఆత్మజుఁడగు గణపతికి సంబంధించిన యీయార్యల (ఆర్యావృత్తకలితములగుస్తుతుల)ను స్వీకరించునుగాత!

ఇది_ సవ్యాఖ్యామగు ఉమాసహస్రమునందలి
ఏకాదశస్తబకము.

ఓం నమోభగవతే శ్రీ రమణాయ.

శ్రీ భారతీ దేవ్యై నమః.

# ఉమా సహస్రము.



## ద్వాదశ స్తబకము

(తృతీయశతకమున చతుర్థస్తబకము)



అవ:-పార్వతీ- పరమేశ్వరశృంగారరసముల్లసితమగు పండ్రెం డవస్తబక మారంభింపఁబడుచున్నది. అందు మొదట- మందహాసము ప్రస్తుతింపఁబడుచున్నది.

మా॥ శర్వధైర్యగుణశాతశస్త్రికా
శమ్బరారిజయ కేతుపట్టికా
మన్దహాసకలికా, మదాపదం
పర్వతేన్ద్రదుహితుర్వ్యపోహతు. ౧

శర్వుని ధైర్యగుణమునకు శాతశస్త్రికయు, మన్మథునకువిజయ ధ్వజపతాకయు, అగు పర్వతేంద్ర-పుత్రి-మందహాసకలిక-నాయాపదను తొలగించుగాక!

ప్ర భ:-శర్వుని=శివునియొక్క, ధైర్యగుణము=మనోవికారములనుతొలఁగి యుండుట ధైర్యము-ఆధైర్యమే యగుగుణము=రజ్జువు 'ధైర్యగుణము' అని చెప్ప బడును. శివుని ధైర్యగుణమను త్రాటిని తెగఁగోసినదియు, మన్మథునకు జయపతా కయు అగు పార్వతీ మందహాసకలిక- నాయాపదను బాపుఁగాతమని ప్రార్థింపఁ బడినది. శాతశస్త్రిక=వాడియగు చిన్నకత్తి, మందహాసకలిక=మొగ్గవంటి చిరునవ్వు. పూర్వపదార్థమగు మందహాసమే- ఆపన్నివారణసమర్థము. కావుననదియే ప్రధాన మగుటవలన నిది యుపమితసమాసమగుచున్నది. ఇచట 'కలిక' అనుపదముయొక్క సమర్థతవలన- హాసము మన్మథునిచే ప్రయోగింపఁబడిన బాణరూపమగు పుష్పమను నంశము- ఆక్షేపింపఁబడి వ్యంజింపఁజేయఁబడుచున్నదని గ్రహించునది.

మూ॥ ముక్తభోగికటకేన పాణినా
ముగ్ధగాత్రి! పరిగృహ్య తే కరమ్
ఏకదా శశికిశోర శేఖరః
సఞ్చచార రజతాద్రిభూమిషు. ౨

ముగ్ధగాత్రీ! ఒకానొకప్పుడు శశి-కిశోర శేఖరుఁడు ముక్తభోగికటకమగు పాణితో నీపాణిని పరిగ్రహించి- రజతాద్రిభూములయందు విహరించెను.

ప్ర భ:—ముగ్ధగాత్రీ!=సుందరాంగివగు జననీ! శశికిశోరశేఖరుఁడు=బాలచంద్రచూడుఁడు. ముక్తభోగికటకము — విడువఁబడిన సర్పమను వలయముగలది. రజతాద్రిభూములయందు=కైలాసప్రదేశములయందు.

భూషణసర్పమునువిడిచి, సుందరమూర్తియగు చంద్రశేఖరుఁడు- పరిణయమయిన వెనుక పార్వతితోఁగూడి కైలాసపర్వతోపాంతములయందు విహరింపఁబూనెనని భావము. భూషణమగు నాగమునే కాక, భీతి-జుగుప్సావహములగు జటలను, గజచర్మాదులనుగూడ పరిత్యజించి- శృంగారభావానుగుణమగు శశికిశోరధరవేషముతోఁ గూడిన భగవానుఁడు-శుభ్రమగు స్వహస్తముతో భగవతీకోమలహస్తమును గ్రహించి విహరించెనను నర్థమిచట స్పష్టముగాఁ దెలియునది.

ద్వితీయశతకమునందలి ప్రథమస్తబకమున పురారికి-జ్వలత్కపర్దత్వాదికమగు ప్రసిద్ధభయంకరరూపము సమయాంతరముల యందగునని తెలిపి, "భగవానుఁడు నీతోఁగూడి విహరించునపుడు మాత్రము, కాంతమగుశరీరమును, కాంతతరములగు లీలలను ధరించును" అని చెప్పఁబడినదిగదా!

అవ:—ఇప్పుడు దేవితోఁగూడి, కమనీయభావమున విహరించుచున్న పరమేశ్వరుని కామెయెడఁగలిగిన యభిలాషమును (అభిలాష శృంగారము) దెలుపుటకు తుమ్మెదలతోఁగూడిన పూలతోటలు, చక్రనిపాదరిండ్లు, కోకిల కలకలలు మొదలగు ఉద్దీపనవిభావములను పంచశ్లోకములచే వర్ణించుచున్నాఁడు.

మూ॥ తస్య తత్ర పరితః పరిభ్రమన్,
వల్లభాం వకులపుష్పచుమ్బినీమ్
పార్వతి! త్వదలకోపమద్యుతి
ర్భృఙ్గరీక తురుణో మనోఽధునోత్.

పార్వతీ! ఆ కైలాసభూములయందు, వకులపుష్పచుంబినియగు ప్రియురాలిచుట్టును దిరుగుచు, నీముంగురులతో నుపమింపఁదగి కాంతులుగలిగిన చంచరీకయువకుఁడు పరమేశ్వరుని మనస్సు చలింపఁ జేసెను.

ప్ర భ:—వకులపుష్పచుంబిని= పొగడపూఁదేనె నానునది. ప్రియురాలిని= ఆడుతుమ్మెదను, చంచరీకతరుణుఁడు=భ్రమరయువకుఁడు. భ్రమరవిలసితమగు పుష్పసమృద్ధిని వీక్షించుటచేత పార్వతీకాంతుని మనస్సు కంపితమయ్యెనని భావము. ఇచ్చట 'ప్రతీపముపమేయస్యోపమానత్వప్రకల్పనమ్'' ఉపమేయము నుపమానముగా ప్రకల్పించు నెడల ప్రతీపము'' అను లక్షణమునను సరించి ఉపమేయములగు అలకములను (ముంగురులను) ఉపమానముగాఁ జెప్పుటవలన నిందలియలంకారము ప్రతీపమగుచున్నది.

మూ॥ ప్రేయసీం చపలచారులోచనా
ముల్లిఖన్ వపుషిశృఙ్గకోటినా
త్వద్విలోకితనిభైర్విలోకితైః
ధూర్జటేః రమదయన్ మనోమృగః. ౪

చపలచారులోచనయగు ప్రేయసిశరీరమును (హరిణియొక్క శరీరమును) శృంగకోటిచేఁ గోఁకుచున్న హరిణము(మగలేడి)నీచూపులకు సరియగుచున్న చూపులచేత ధూర్జటి హృదయమును మదింపఁజేసినది.

ప్ర భ:—చపలచారులోచన=చంచల సుందరములగు నయనములు గలది. ఆడులేడియెడల మగలేడి వెలార్చు ప్రేమవిలాసముల దర్శనము పరమేశ్వర మనో మాదకమయ్యెనని భావము. "నీచూపులకు సరియగుచున్న'' అని యుపమేయములగు పార్వతిచూపుల నుపమానముగా ప్రకల్పించుటవలననిదియు ప్రతీపమేయగును.

మూ॥ మఞ్జుకుఞ్జభవనాని మాలతీ
పుష్పరేణుసురభిః సమీరణః
పేశలాచ పికబాలకాకలీ
మోహమీశ్వరి! హరస్య తేనిరే. ౫

ఈశ్వరీ! మంజుకుంజభవనములును, మాలతీసుమపరాగసుగంధి యగు సమీరణమును, పేశలమగు బాలకోకిక కాకలియు. హరునకు మోహము ఘటించినవి.

ప్ర భ:—మంజుకుంజభవనములు=మంజులములగు లతాగృహములు. సమీరణము=గాలి, పేశలము=రమణీయము. కాకలి=అవ్యక్తమధుర సూక్ష్మధ్వనివిశేషము. త్రివిధమగు- పూఁదావిగాలి-బాలకోకిలపాట- శివునికి మోహము నుదయింపఁ జేసినవని భావము.

మా॥ అగ్రతః కుసుమశోభితా లతాః
పార్శ్వత స్త్వ మగపాలబాలికే!
సర్వతో మదన శిఞ్జినీధ్వనిః,
ధీరతా కథమివాస్య వర్తతామ్. ౬

ఎదుట- కుసుమశోభితలు లతలు, పార్శ్వమున- నగరాజబాలికవు నీవు, అంతటను- మదనశింజినీధ్వని. అతనికి ధీరత యెట్లుండును?

ప్ర భ:—మదనశింజినీధ్వని=మన్మథుని యల్లెత్రాటిచప్పుడు (అది కోకిలకాకలియే యని గ్రహించునది) అతనికి=నీ కాంతుఁడగు శివునకు. ఎదుటను-ప్రక్కను అంతటను- ఉత్తేజకములగు వస్తువులు దాపురించునపుడు- ధీరత- పలాయితయే యగునని భావము.

మా॥ కీరకూజితసమాకులే వనే
శమ్భురమ్బ! తవపార్శ్వవర్తినమ్
ఆజఘాన మకరధ్వజశ్శరై
రర్దయ న్త్యవసరేహి శత్రవః. ౭

వనము- కీరకూజితసమాకులమగుచుండునపుడు, శంభుఁడు నీ పార్శ్వమునందుండెను, అప్పుడే మీనకేతనుఁడు నీప్రభువుపై బాణముల నేయఁదొడఁగెను. అవసరము ప్రాప్తించునప్పుడే గదా శత్రువులు పీడింతురు.

ప్ర భ:—కీరకూజిత సమాకులము=శుకకూజిత పరీతము- చిలుకపలుకులతో నిండినది. ఇచట—ప్రాకృతమగు విశేషము- అప్రకృతమగు సామాన్యముచేత సమర్థింపఁబడినది. కావుననిది అర్థాంతరన్యాసమను నలంకారమగుచున్నది.

మూ॥ తాడితో మకరకేతునాశ్శరై
　రంసదేశమవలమ్బ్య పాణినా
　మేకహాయనకురఙ్గలోచనా
　త్వామిదం కిల జగాద శఙ్కరః　　౮

మదనశరతాడితుఁడగు శంకరుఁడు—నిజపాణిచేత నీయంసదేశము ననలంబించి, ఏకహాయనకురంగనయనవగు నీతో నిట్లు పలికెనట!

ప్ర భ:—అంసదేశము= స్కంధప్రదేశము. ఏకహాయన కురంగలోచన= ఒకసంవత్సరము వయస్సుగల లేడియొక్క కన్నులువంటి కన్నులుగలది. శివుఁడు మన్మథబాణపాతమువలన నొందిన వేదనను సహింపలేక నీస్కంధప్రదేశము నూతగాఁగొని లజ్జావిచలిత నయనవగు నీతోనిట్లనియెనని భావము.

మూ॥ కాకలీకలకలం కరోత్యసౌ;
　బాలచూతమధిరుహ్య కోకిలా
　వాచ ముద్గిర సరోజలోచనే!
　గర్వమున్నతమియం విముఞ్చతు.　　౯

ఎదుట గాన్పించుచున్న యీకోకిల— బాలరసాలమునఁ గూర్చుండి కాకలీధ్వనితో కలకలమనుచున్నది. ఓపద్మాక్షీ! ఒక్క మాటనాడితివా దాని యున్నతమగు గర్వమును విడుచును.

ప్ర భ:—కోకిల=పికవధువు. కాకలీధ్వని=సూక్ష్మము, మధురము, అస్ఫుటము, అగు ధ్వనివిశేషము. శ్రవణసుభగమగు స్వరసంపత్తిచేత గర్వించిన పికాంగన—ఎదుటనున్న తీయమామిడి గున్నయందుండి యెట్లు కలకలమనుచున్నదో వింటివా? నీస్వర మింతకంటెను చాలతీయనిది. కావున నీకంఠధ్వనిచేత నాకర్ణములయం దమృతము నింపుము" అనుభావము వ్యంజితము.

మూ॥ ఫుల్లకున్దమకరన్దవాహినో
　మల్లికా ముకులధూళిధారిణః
　కమ్పయన్తి శిశవః సమీరణాః
　పల్లవానిహృదయంచ తన్వి! మే.　　౧౦

సుందరీ! వికసించినమల్లెపూవుల తేనియలను భరించునవియు (మోయునవియు), మల్లెమొగ్గలపరాగమును ధరించునవియునగు. శిశు సమీరణములు— (పిల్లగాలులు గాలిపిల్లలు) నాహృదయమును— పల్ల వములనుగూడ కంపింపఁజేయుచున్నవి.

ప్ర భ:—శిశుసమీరణములు=మందమారుతములు. మందమారుత కార్యమగు హృదయ- పల్లవముల కంపనము- ఇచట- మూలమున- 'పల్లవాని హృదయంచ' అనుచో నున్న చ కారము చేత, సహార్థము (తోడ) వాచ్యము చేయఁబడుటవలన నిది సహోక్తియను నలంకారమగుచున్నది.

మూ॥ వర్ణనేన హృతచక్షుషః శ్రియః
సుప్రసన్నమధురాకృతీని తే
అఙ్గకానిదయి తే! భజేఽర్భకః
స్వేదబిన్దుహరణేన వాఽనిలః. ౧౧

ప్రియా! సుప్రసన్నమధురాకృతులగు నీఅంకములను స్వేద బిందుహరణముచేత— అర్భకుడగునసనిలునివలె నాదృష్టి నాకర్షించు చున్న శోభయొక్క— వర్ణనముచేత నేనుగూడ సేవింతును.

ప్ర భ:—అంగకములను=లేతవగు అవయవములను, స్వేదబిందుహరణముచేత= ఘర్మాంబుబిందువులను తొలఁగించుటచేత, అర్భకుడగు ననిలుఁడు=మందమారుతము చల్లగాలి-స్వేదాంబుకణములను తొలఁగించుటచేత నీయంగములందలి శ్రమతొల్గునట్లు సేవించువిధమున, నేనుగూడ మధురాకృతి సంపన్నములగు నీయంగముల శోభను కీర్తించుటచేత- నీహృదయమున ప్రీతికలుగునట్లు సేవింతునని భావము.

మూ॥ తావదేవ మమచేతసోముదే
బర్హమేత దనఘాఙ్గి బర్హిణః
యావదక్షిపథమేష విశ్లథో
గాహతే న కబరీబరీభర స్తవ. ౧౨

అనవద్యగాత్రీ! నాపార్శ్వమున— విశ్లథమైయున్న యీ నీ కబ రీభరము— నాదృక్పథమును ప్రవేశింపకుండునంతవఱకును మాత్రమే నీబర్హిబర్హము- గయొక్క- మనస్సునకు ప్రీతినిచ్చుచుండును.

ప్రభ:—విశ్లథము=ముక్తబంధము=దిగజారుచున్నది. కబరీభరము = కేశపాశము. దృక్పథము=నేత్రమార్గము. బర్హిబర్హము=నెమలిపింఛము. నీకేశపాశ సౌభాగ్యము నీక్షించువఱకును నెమలిపింఛెమునుజూచి ఇది నాప్రేయసి కబరీభారమువలె నున్నదని సంతోషించుచుండునని భావము.

నెమలిపింఛెము కంటెనుగూడ కబరీభరమే చిత్తరంజకమును, రుచిరతరమును, అగుచున్నదను నంశము వాచ్యాయమాన మగుటవలన నీయలంకారము గమ్యమగు ప్రతీపమై యున్నది.

మూ॥ రాగవానధర ఏమసన్తతం
　నిర్మల ద్విజసమీపవర్త్యపి
　ఏభిరస్య సహవాసతః ప్రియే
　నేషదప్యపగతో నిజోగుణః.　　　౧౩

ప్రియురాలీ! యీకెమ్మోవి- నిర్మలద్విజసమీపవర్తి యగుచున్నను సంతతము రాగవంతమగుచున్నది. వీనితోడి సహవాసమువలన నీష న్మాత్రమునుగూడ దీని నిజగుణము పోయినదికాదు.

ప్రభ:—నిర్మల- ద్విజ- సమీపవర్తి=శుభ్రములగు దంతముల సమీపమునందున్నది, లేక శుద్ధ సత్త్వగుణులగు బ్రాహ్మణుల సన్నిధియందుండునది. రాగవంతము=రక్తవర్ణముగలది, లేక రాజసముగలది- అనురాగి.

శుద్ధసత్త్వగుణులగు బ్రాహ్మణుల సన్నిధియందున్నను రజోగుణమును విడువని జనమువలె తెల్లనిదంతముల చేరువనున్నను ఈయధరము రక్తవర్ణమును విడువకున్నదని తాత్పర్యము. ఇందు శ్లిష్టములగు నిర్మల- ద్విజ- రాగశబ్దములు- వాచ్యతాదశయందు ఒకేయర్థమును దెలుపుచు రెండవయర్థమును దెలుపుటను (పరివృత్తిని) సహింపవు. కావున శబ్దశక్తిమూలమగు ధ్వనన వ్యాపారముచేతనే ద్వితీయార్థము ధ్వనింపఁజేయఁ బడుచుండును. కావున నిది శబ్దశక్తిమూలమును,సంలక్ష్యక్రమమును, అగు ఉపమాలంకార ధ్వనియగుచున్నది. సహజగుణము- సహవాసముచేనయినను తొలఁగదను నంశము- అరద్వయమునందును సమానమగును.

"సంసర్గజా దోషగుణాభవన్తి"

"సహవాసమువలన దోషగుణములు కలుగును" అను న్యాయము నైసర్గికములగు గుణములయందు సంభవింపదు" అను హేతువువలన అధరము రాగమును విడువకున్నదను వాక్యార్థము సమర్థింపఁ బడుటవలన నిచటి యలంకారము- కావ్యలింగమని గ్రహించునది.

మూ॥ చక్షుషః సుదతి తే సగోత్రతా
కైరవైర్నిశి దినే కుశేశయైః
కాశ్యపైరపి వసిష్ఠ బాన్ధవై
ర్వ్యాసుపర్వణ ఇవ ద్విగోత్రిణః. ౧౪

సుదతీ! కశ్యపవంశజులతోడి సగోత్రతయు, వశిష్ఠవంశజులతోడి సగోత్రితయుఁ, గల ద్విగోత్రియగు భూసురునికివలె నీనయనమునకు-రాత్రియందు కైరవములతోడి సగోత్రితయు పగటియందు కమలముల తోడి సగోత్రితయు కలదు.

ప్ర భః:—సుదతీ!=చక్కని పలువరుసగల పార్వతీ. సగోత్రిత=సమానమగు కులము గలిగియుండుట, కైరవములు=కుముదములు-కలువలు. ద్విగోత్రి=రెండుకుల ములు గలవాఁడు. రాత్రియందు కశ్యపసగోత్రులును పగటియందు వసిష్ఠసగోత్రులును అగు ద్వ్యాముష్యాయణులను-ద్విగోత్రులని చెప్పుదురు. నీకన్ను చంద్రుని తోడి చుట్టరికముచేత రాత్రియందు కలువపూవువలె నగుననియు, సూర్యునితోడి చుట్టరికముచేత పగటియందు తామరపూవువలె నగుననియు భావము. ఇందు వాచ్య మగు నలంకారము ఉపమ. "నీనయనము- కమల- కైరవసగోత్రము" అని చెప్పుట చేత రాత్రియందు కమలము వికసింపదు. పగటియందు కలువ వికసింపదు. కాని నీకన్ను రాత్రియందును పగటియందును (సతతమును) వికసించుచుండును. కావున నీ నయనోల్లసితము=వానికంటె నధికతరము అనునర్థము వ్యంజనచేఁ గొనిరాఁబడుట వలన నిచట వ్యతిరేకాలంకారము-ధ్వనింపఁజేయబడినదని తెలియునది.

మూ॥ అల్పయాప్యతి సమర్థయాస్మిత
జ్యోత్స్నయా గగనగం హరత్తమః
కేవలం సువచనామృతం కిర
చ్చన్ద్రబిమ్బమతుషార మాననమ్. ౧౫

నీయాననము— అల్పమయినను (సూక్ష్మమయినను) అతిసమ ర్థమగు స్మితచంద్రికచేత- ఆకాశమునందలి యంధకారమును తొలఁ గించునదియు, కేవలమగు సువచనామృతమును ప్రచురించునదియ నగుచు, మంచులేనిచంద్రబింబమే అగుచున్నది.

ప్ర భ:—కేవలము=నిర్ణీతము. అతుషారము=మంచు లేనిది. (తుహిన దోషము లేనిది) స్మిత- చంద్రికలకును, వచన- అమృతములకును, చంద్ర- ఆననములకును అభేదమును నిశ్చయించుటవలన నిది సావయవరూపకాలంకార మగుచున్నది.

"నీయాననము- హిమ దోషదూషితము కాని చంద్రబింబమే" అనుటచేత, పార్వతీముఖచంద్రబింబము- ప్రసిద్ధచంద్రబింబముకంటెనుగూడ నుత్కర్షింపఁబడినది. కావున నిది యధికాభేదరూపక మగుచున్నది.

మూ॥ నిత్యమబ్జముఖి! తే పరస్పర
శ్లిష్టమశ్లథపటీ కుటీరగమ్
శర్వరీభయవివర్జితం స్థలీ
చక్రవాకమిథునం కుచద్వయమ్. ౧౬

అబ్జముఖీ! నీవక్షోజయుగళి- నిత్యమును పరస్పరశ్లిష్టము, అశ్లథ పటీకుటీరగము, శర్వరీభయవివర్జితము, అగు స్థలీచక్రవాకమిథునము.

ప్ర భ:—పరస్పరశ్లిష్టము=ఒకదానితో నింకొకటి కలిసియుండునది. ఎప్పుడును వియుక్తము కానిది. అశ్లథపటీకుటీరగము=దృఢముగా బంధింపఁబడిన యుత్తరీయమే నివాసగృహముగాఁ గలది. శర్వరీభయవివర్జితము=రాత్రియందగు భీతిలేనిది. స్థలీచక్రవాక మిథునము=భూతలమునందుండు కోకపక్షిద్వయి.

ఆకాశమునందుండు చక్రవాక మిథునమునకు రాత్రియందు వియోగము గలుగును- (స్తనయుగళియగు స్థలీచక్రవాకమిథునము నిత్యమును కలిసియేయుండును గావునవియోగము నొందదు) ఆకాశచరమగు చక్రవాక మిథునమున కెప్పుడును గూడతాదృశమగు ఏకకుటీరనివాసము గలుగదు. దీనికే వియోగమువలన రాత్రివలని భయముగలదు. ఇట్లు- వ్యోమచరమగు ప్రసిద్ధచక్రవాకముకంటె, స్తనయుగళియే యగు స్థలీచక్రవాకమున కుత్కర్షము చెప్పఁబడుటవలన ఇదికూడ అధికాభేదరూపకమే యగుచున్నది.

మూ॥ లాలనీయమయి! దేవమౌళిభిః
కోమలం చరణపల్లవ ద్వయమ్
కచ్చిదద్రిపురుహూతపుత్రికే!
నస్థలీ తుదతి కర్కశాతన. ౧౭

అమ్మాయీ! పర్వతేంద్రకుమారీ! దేవమాలిలాలనీయమును, సుకుమారమును, అగు నీచరణపల్లవద్వయమును కర్కశమగు నీప్రదేశము బాధించుటలేదుగదా?

ప్రభ:–దేవమాలిలాలనీయము=దేవతలకిరీటములచేత కోరఁదగినది.(భజింపదగినది) చరణపల్లవద్వయము=పల్లవమృదులమగు పాదయుగళము. పర్వతచక్రవర్తి పుత్రిక యొక్క కోమలపాదయుగళి- శిలాకార్కశ్యమున బాధింపఁబడ వచ్చునని యాశంకించి శివుఁడామెనోదార్చుటకు ప్రశ్నించుచున్నాఁడు. ప్రేయసియగు కాంతకు నిజముగా నించుక వేదన కలిగియున్నను గూడ, ప్రియునిచేగావింపఁబడిన యీదృశములగు ప్రశ్నోపచారములవలన ఆవేదనలేనిదివలెనయి ప్రీతియే జనించునుగదా!

మూ॥ ఏవమాదివదతి త్రిలోచనే
త్వన్ముఖేలసతి మౌనముద్రియా
ఆతతాన జలచారికేతనో
నర్తనం నగమహేన్ద్రబాలికే. ౧౮

ఓనగరాజపుత్రికవగు జననీ! ఇది (పూర్వోక్తము) యాదిగాఁగల వాక్యమును త్రిలోచనుఁడగు శివుఁడు పలుకుచుండునప్పుడు నీవచనము, మౌనముద్రచే విలసిలుచుండ- మీనకేతనుఁడగు మన్మథుఁడు స్వీయమగు నర్తనమును విస్తరింపఁజేసెను.

ప్ర భ:–మౌనముద్ర=మాటాడకుండుటయే స్వరూపముగాఁగలది. ప్రతివచనమునీయక నీవూరకున్నను గూడ నీముఖమున నేదో (అనిర్వచనీయమగు) విలాసము కలుగుటయు, ప్రత్యుత్తరము నీయకుండుటచేతనే నీప్రియునకు నీయందలి యనురాగము ప్రవృద్ధమగుటయు, నీక్షించి- ఇదియే సమయమని మన్మథుఁడు శివునియందావేశించి, యతఁడింకను నీకుపచారములను గావించునట్లొనర్చెనని భావము.

మూ॥ దేవి! తే పురజితావతంసితః
పారిజాత కుసుమప్రజాకచః
మానసం పురజితోఽమునాహృతం
స్మర్యతే క్వ మలినాత్మ నాకృతమ్. ౧౯

దేవీ! పురారియగు శివుఁడు పారిజాతపుష్పమాలచేత నీశిరో జము నలంకరించెను. ఈశిరోజము– పురజితుఁడగు నతని మానసము నపహరించెను. మలినాత్మ– చేసిన మేలుస్మరించునా?

ప్ర భ:—శిరోజము=కచము–జుట్టు. మలినాత్మ=అశుభ్రము, లేక పాపాత్ముఁడు. పాపాత్ముఁడు సర్వవిధముల చేతనుగూడ కృతఘ్నుఁడగునని భావము. శిరోజము–నల్లనిది కావునను జడరూపము కావునను దానిస్వరూపము మలినము.

ఇచట:—"ప్రభువగు పరమేశ్వరునిచేత శిరోజమునకు పారిజాతపుష్పాలంకారము చేయఁబడినది. ఆశిరోజముచేత అతని మానసాపహరణము కావింపఁబడినది." అనుటచేత దేవీశిరోజ ప్రసాధన కైంకర్యలాభమునకు– స్వమనోదానమే మూల్యమయ్యెనను నర్థము వ్యంజింపఁజేయబడినది. దానివలన పరివృత్తి అనునలంకారము ధ్వనింపఁజేయఁబడుచున్నది. 'మలినాత్మ– కృతఘ్నుఁడు' అను సామాన్యమగు వేఱొకయర్థముచేత– "పురంజయుని మానసమును (మలినాత్మయగు) శిరోజము– దొంగిలించెను" అను ప్రస్తుతమగు విశేషము– సమర్థింపఁబడుటవలన నిది అర్థాంతర న్యాసాలంకార మగుచున్నది.

మూ॥ బ్రహ్మచర్య నియమాదచఞ్చలా
నాయికాయది లులాయమర్దినీ
నాయకశ్చ సుమబాణసూదనో
వేద కో రతి రహస్యమావయోః. ౨౦

లులాయమర్దినియగు నాయిక— అస్ఖలిత బ్రహ్మచర్యనియత. నాయకుఁడు— సుమబాణసూదనుఁడు. అగుచుండునప్పుడు— వీరల "రతి రహస్యమును" ఎవ్వఁడెఱుఁగును?

ప్ర భ:—లులాయమర్దిని=మహిషమర్దిని. సుమబాణ సూదనుఁడు – మన్మథ నాశనుఁడు. అప్రాకృతమగు (దివ్యమగు) శరీరముఁగలిగి నిత్యమగు బ్రహ్మచర్య వ్రతమునుండి చ్యుతినొందని మహిషాసురమర్దినీ– నాయికయూ, పుష్పబాణునిజయించిన పరమేశ్వరుఁడు నాయకుఁడును అగునెడల ప్రపంచమాతాపితరులగు ఆపార్వతీ పరమేశ్వరుల యప్రమేయమగు రతిస్వరూపము నెఱుఁగుటకు సమర్థుడెవ్వఁడును లేఁడని భావము. కడచిన శ్లోకములయందు పార్వతీపరమేశ్వరుల విషయమైన శృంగారముపన్యసింపఁబడినది. " పామరస్త్రీ–పురుషోచితమగు మదనవిలాసమూ–

పార్వతీపరమేశ్వరులయందారోపింపఁబడఁగూడదను నభిప్రాయమున మీఁది శ్లోకము చెప్పఁబడినదని గ్రహించునది.

మగా॥ లోచనోత్సవవిధౌ విశారదే
వారిదావరణదోషవర్జితే
మర్దయత్యపి నభోగతం తమః
శ్యామికారహిత సుन्दరాకృతౌ. ౨౧

భాతిశీతకిరణస్తనంధయే
ప్రాణనాయక జటాకుటీజుషి
శుభ్రపర్వతతటే శుభాఙ్గి! తే
సమ్మదాయ నబభూవ కానిశా. ౨౨

శుభాంగివగు (దివ్యమంగళవిగ్రహావగు) జననీ! నయనోత్సవమును గావించుటయందు విశారదుఁడును, మేఘాచ్ఛాదనదోషవర్జితుఁడును, నభోగతమగునంధకారమును మర్దించువాఁడయినను, శ్యామికా (కళంక) రహితమును సుందరమును అగు నాకృతిగలవాఁడును, ప్రాణనాయకుఁడగు పరమేశ్వరుని జటాకుటీరమున వసించువాఁడును అగు శీతకిరణస్తనంధయుఁడు— విలసిల్లుచుండఁగా, శ్వేతగిరిప్రదేశమున (విహరించుచున్న) నీకు— సమ్మదముఁగూర్పని రాత్రి యొక్కటియయినను గలదా? (రాత్రులన్నియుఁగూడ నీకానందదాయకములే)

ప్ర భ:—విశారదుఁడు=విచక్షణుఁడు-కుశలుఁడు. నేర్పరి- మేఘాచ్ఛాదనదోషవర్జితుఁడు=మేఘపటలముయొక్క అవరణమను దోషములేనివాఁడు. శీతకిరణస్తనంధయుఁడు=బాలచంద్రుఁడు. శ్వేతగిరి ప్రదేశమున=కైలాసప్రాంతమున. ప్రసిద్ధుఁడగు చంద్రుఁడు- ఎల్లప్పుడును కన్నులకు పండుగచేయఁడు. ఒక్కొక్కసమయమున మేఘావృతిదోషము నొందియుండును. ఆకాశమునందలి చీకటిని తొలఁగించుచున్నను, దాని స్పర్శవలన నొదవిన కళంకముతోఁ గూడుటవలన నసుందరమగు రూపము గలిగియుండును. పరమేశ్వర జటాకుటీరము నందుండడు. బాలచంద్రుఁడు నిత్యమును నేత్రోత్సవము నొనర్చును. మేఘాచ్ఛాదన దోషము లేకుండును. ఆకాశము నందలి యంధకారమును మర్దించుచున్నను దానిస్పర్శవలని కళంకములేకుం

డుటవలన అలౌకికసుందరమూర్తి యగుచుండును. పరమేశ్వర జటావాసమున విల సిల్లుచుండును అని భావము.

ఇట్లు ప్రసిద్ధచంద్రునికంటెను వ్యతిరిక్తుఁడగు బాలచంద్రుని వైభవమును స్తుతించుటవలన పార్వతికి ప్రాణనాయక విషయమునందగు రతిభావము ధ్వనింపఁ జేయఁబడుచున్నది.

మూ॥ నస్తుభూషణ సుధాంశుదీధితి
వ్యక్తముగ్ధముఖశోభయోర్మిథః
తాని తాని గిరిజా- గిరీశయోః
క్రీడితాని జగతో విభూతయే. ౨౩

శిరోభూషణ- చంద్రదీధితులచేత స్పష్టములగు ముగ్ధముఖ శోభలుగల గిరిజా- గిరీశ్వరుల పారస్పరికములగు ఆయాక్రీడితములు- లోకమునకు విభూతి నొసఁగుఁగాక !

ప్ర భ:—దీధితులచేత=కాంతులచేత. ముగ్ధముఖశోభలు = సుందరములగు ముఖప్రభలు. గిరిజా-గిరీశ్వరులు=పర్వతమునకుఁ బుట్టిన పార్వతి (కైలాస) పర్వత మున కధిపతియగు పరమేశ్వరుఁడు. పార్వతీ-పరమేశ్వరుల-అనిర్వాచ్య రహస్య- రతివిలసితములు-లోకశ్రేయఃప్రదములగుఁగాత. అను నీయాశీస్సు- శృంగారవర్ణ నోప సంహారసందర్భ అని గ్రహించునది.

మూ॥ మోదకాదనపరస్య సృష్టయే
క్రీడితం జనని! వాంఛి మప్యభూత్
శక్తిభృత్ తనయరత్న జన్మనే
కిఙ్చిదీశ్వరి! బభూవ ఖేలనమ్. ౨౪

తల్లీ! యీశ్వరీ! మోదకములను (జిల్లుడుకాయలను పిండి వంటలను) భుజించుటయే ప్రధానముగాఁగల లంబోదరుఁడగు గణపతిని సృజించుటకును, శక్తిధరుఁడును, కుమారశ్రేష్ఠుఁడునుఅగు సుబ్రహ్మ ణ్యుని జనింపఁజేయుటకును, మీరొనర్చిన (వేశ్వేరగు) క్రీడితవిశేష ములు- అనిర్వచనీయములు. (తెలియరానివి)

ప్ర భ:—క్రీడితవిశేషములు=రతివిలసిత విశేషములు. గణపతి- సుబ్రహ్మణ్యులను ప్రభవింపజేయుటకు మీకు ద్వివిధమగు రతివిలసితము కలిగెను. అదినిరూపించుటకు శక్యము కానిది. కావుననే ఆపుత్రులిద్దరును ఏకస్వభావులు కాకుండిరి. అందొకఁడు భోజన ప్రియుఁడు. ఇంకొకడు-శక్తిధరుఁడు. మహేశ్వర స్త్వాం పరిణీయ లేభే (2శ. 1స్త. 24శ్లో.) అను శ్లోకము యొక్క- యర్థము నిచట గుర్తించునది.

మూ॥ మాధురీ రసపరిప్లుతా ఇమాః
కావ్యకణ్ఠ విదుషో రథోద్ధతాః
ఆదధత్వచలనాథనన్దినీ
మానసే కమపిమోదముత్తమమ్. —౨౫

విగలిత వేద్యాంతరమును, అనుభవైక వేద్యమును, అగు మాధుర్యమేయగు రసముచేత పరిప్లుతములు. కావ్యకంఠపదలాంఛనుఁడగు విద్వాంసునిచేత విరచితములు- అగు నీరథోద్ధతములు- నగరాజనందిని మనస్సునందు- ఒకానొక యానందవిశేషమును గలిగించునుగాత!

ప్ర భ:—విగలితవేద్య + అంతరము=తెలియదగిన వేరొకవస్తువు లేనిది. పరిప్లుతములు=వ్యాప్తములు. రథోద్ధతలు=రథోద్ధతయను పేరుగల వృత్తములచేత రచింపఁబడిన నుతులు.

ఈస్తబకము- కుమార సంభవమునందలి యష్టమసర్గమునందలి ధోరణినవలంబించి, నిబంధింపఁబడినదను నంశము- కాళిదాస కావ్యజ్ఞులగు పండితులకు స్పష్టముగాఁ దెలిసియే యుండును. ఉ॥ అందును- ఇందునుగూడ రథోద్ధతావృత్తమే ప్రయోగింపఁబడినది. శృంగారమే విషయము. పార్వతిని సంబోధించి 'వ్యాజహార సహధర్మచారిణీమ్' 'పద్మకాన్తి మరుణ త్రిభాగయోః' (కు. సం. 8, స, 3శ్లో ఇత్యాదులచేత-కుసుమితోపవన- సంధ్యాకాల- రాత్ర్యాది- శృంగారోద్దీపన విభావవర్ణనము పరమేశ్వరుఁడు కావించిన సంవిధానమందున్నది. ఇందుగూడ "త్వామిదంకిల జగాదశఙ్కరః" ఇత్యాదులచేత తాదృశమగు వర్ణనము పరమేశ్వర కృతమైయున్నది. ఈరెండింటికిని గలభేదమును మాత్రము పాఠకులు గుర్తింపవలయును. అద్వితీయుఁడగు కాళిదాసకవిసార్వభౌముని కవితయందు- ఉమాసహస్రకవియగు కావ్యకంఠమునికి- నిత్యసంజాతము,అపారము, అగుభక్తి కలదను నదిమాత్రము సత్యము. అయినను- ప్రపంచమాతాపితరులగు పార్వతీ- పరమేశ్వరుల

సురతమును కాళిదాసునివలె వర్ణింపక, ఎట్లోయొకవిధమున రసస్థానము విడువఁదగినదను తలంపున స్వీయరచనమును సంగ్రహించెను. కావుననే రక్త్యుత్పాదకమగు శృంగారవర్ణనము నారంభించి "బ్రహ్మచర్య నియమాదవస్థా..." అను శ్లోకమున "వేదకోరతి రహస్యమావయోః" అని తానొనర్చిన ముగింపును సమర్థించెను. వేద- వేదాంత- మంత్ర- తంత్ర- జ్ఞాన- యోగ- ఉపాసనాదులచేత- ఉపబృంహితము- భక్తిపరము-గురుతరము అగు నీస్తోత్ర కావ్యము లోకసమ్మతమగునట్లు ఉమా మహేశ్వర-రతిరహస్యము- అప్రమేయమువిచిత్ర్య ముపసంహరించుట నవ కవి పండితామోదదాయక మగుచున్నది.

ఇతి శ్రీమహర్షి రమణ భగవత్పాదాన్తేవాసినో వాసిష్ఠస్య
నరసింహసూనోః గణపతిమునేః కృతావుమాసహస్రే
ద్వాదశః స్తబకః సమాప్తః,
సమాప్తంచ తృతీయం శతకమ్.

ఇది- శ్రీమహర్షి- రమణభగవత్పాదశిష్యుఁడు- అఘమర్షణసగోత్రుఁడు-
శ్రీమత్ పంతుల పేరయశాస్త్రి పౌత్రుఁడు వేంకటరామ
బుధేంద్రపుత్రుఁడు అగు లక్ష్మీనారాయణశాస్త్రిచే
నాంధ్రీకరింపఁబడిన ఉమాసహస్రమను స్తోత్ర
కావ్యమున పండ్రెండవ స్తబకము
(తృతీయశతకము).



ఓం నమో భగవతే శ్రీ రమణాయ.

శ్రీ భారతీ దేవ్యై నమః.

# ఉమా సహస్రము.



## త్రయోదశ స్తబకము

(చతుర్థ శతకమున ప్రథమ స్తబకము)

అవ:— ఈస్తబకమున భగవతీకటాక్షమహిమానువర్ణనము చేయఁబడినది. అందు మొదట పూర్వోక్తప్రకారమున హాసమును స్తుతించుచున్నాఁడు.

మూ॥ భవామ్బుధిం తారయతాద్ భవన్తం
హాసోఽద్భుతః కుఞ్జరవక్త్రమాతుః
యోహన్తి బిమ్బాధరలఙ్ఘనేఽపి
వ్యక్తాలసత్వో హరితాం తమాంసి. ౧

బింబఫలోపమమగు అధరోష్ఠము నతిక్రమించినను గూడ, వ్యక్తమగు నలసతగలదియగుచు, దెసలందున్న కారుచీకటులను చీల్చుచున్నదియగు గజానన జనని— అద్భుతహాసము—నిన్ను— సంసారాంబుధినుండి తరింపఁజేయునుగాత!

ప్రభ:—బింబఫలోపమము=దొండపండుతో నుపమింపఁదగినది. వ్యక్తమగు అలసత గలది=స్పష్టమగు మందత్వముగలది. ముఖద్వారము నందున్నదియు, సమీపవర్తియునగు అధరమును అతిక్రమించినను గూడ హాసము మందమేయని భావము. ఇట్లు మిక్కిలి మందమగుచున్నను— ఉమాహాసము సర్వదిశలందును గల తిమిరమును తొలఁగించుటయందు సమర్థమగుటవలన అద్భుతమని చెప్పఁబడినది.

ఇచట— మందహాసము— దిక్తమోహరణరూపమగు అమందమగు కార్యమును నొదవింపఁ జేయుటవలన అసంభావ్యత—గమ్యమగుచున్నది. కావుననిదియసంభవాలంకార ధ్వనియగుచున్నది. ఇందు— అద్భుతపద ముండుటవలన విశేషోక్తియని శంకింపఁగూడదు.

మూ॥ సక్తః సదా చన్ద్రకలాకలాపే
సర్వేషు భూతేషు దయాం దధానః।
గౌరీకటాక్షో రమణో మునిర్వా
మదీయమజ్ఞాన మపాకరోతు. ౨

చంద్రకలాకలాపునియందు, సక్తిగలదియు, ప్రాణులందఱి యందును దయవహించునదియు, నగు గౌరీకటాక్షము (అపాంగదృష్టి) 'మహర్షి' అని ప్రసిద్ధుఁడగు రమణమునివలె నాయజ్ఞానమును తొలఁగించునుగాత!

ప్ర భ:—చంద్రకలాకలాపుఁడు=చంద్రకళయే భూషణముగాఁగల శివుఁడు. చంద్రచూడుఁడు. సక్తి=ఆసక్తి లేక అనురక్తి. కటాక్షము=కడకంటిచూపు. చంద్రశేఖరునియందు సక్తి- అనురాగమువలన గౌరీకటాక్షమునందును, ఏకాంతభక్తివలన రమణమహర్షియందును యుక్తమగుచున్నది. జగన్మాతకు సహజమగు సర్వభూత దయయు తత్కటాక్షము ధరించును. సర్వప్రాణులయందునుగూడ ఆత్మదర్శనము వలన రమణమునికిఁగూడ భూతదయ సహజమేయగును. గురువగు రమణమహర్షి నా అజ్ఞానమును తొలఁగించినట్లు గౌరీకటాక్షముగూడ, నాయజ్ఞానము నపాకరించుఁగాతమని భావము. అలంకారము-పూర్ణోపమ.

మూ॥ కృపావలోకో నగకన్యకాయాః
కరోతు మే నిర్మలమన్తరఙ్గమ్।
యేనాఙ్కితః శఙ్కర ఏకతత్త్వం
విశ్వంలులోకే జగతే జగౌ చ. ౩

ఏకృపావలోకమున, అంకితుఁడగు శంకరుఁడు- (శంకరభగవత్పాదుఁడు) సమస్తమును- ఏకతత్త్వముగా కనుఁగొని, తన దర్శనమును లోకమున కుపదేశించెనో, ఆనగకన్యాకృపావలోకము- నాయంతరంగమును నిర్మలమొనర్చుఁగాత!

ప్ర భ:—కృపావలోకము=కరుణతోడి దృష్టిపాతము. అంకితుఁడు= ముద్రింపఁబడినవాఁడు. శంకరుఁడు-'ఆనందలహరి' మున్నగు గ్రంధములను రచించి, యంబిక నారాధించి తత్ప్రసాదమునొంది, శారీరక (బ్రహ్మసూత్ర) భాష్యకారుఁడై యద్వైతమును బోధించిన శంకరాచార్యుఁడు.

ఏకతత్త్వము=అద్వితీయమగు సత్యముగా (అద్వైతముగా) కనుఁగొని= చూచి (తెలిసికొని) ప్రదర్శనమును=బ్రహ్మమొక్కటియే సత్యము" అను అద్వైత జ్ఞానమును, అంతరంగమును=అంతఃకరణమును, నిర్మలము=పరిశుద్ధము.

ము॥ కాలీకటాక్షో వచనాని మహ్యం
దదాతు మోచామద మోచనాని।
యత్ పాతపూతం రఘువంశకారం
నరాకృతిం ప్రాహురజస్య నారీమ్. ౪

ఏకటాక్ష పాతముచేత- పవిత్రుఁడగు రఘువంశకారుని (కాళిదాసమహాకవిని) నరాకృతియగు సరస్వతియే యని పండితులు చెప్పుచుందురో, ఆ కాలీకటాక్షము- మోచామదమోచనములగు వచనములను నాకొసఁగుఁగాత!

ప్ర భ:—నరాకృతి=మనుష్యుని యాకృతివంటి యాకృతిగలది. మోచామదమోచనములు - ఒకానొక (మంచితీపిగల) యరటిపండుయొక్క దర్పమును పోఁగొట్టునవి. ఆయరటిపండు కంటెనుగూడ రసవత్తరము లగునవి.

కాళిదాసుఁడు సరస్వతి యవతారమనియు, కాళీప్రసాద లాభమున నతఁడు మహాకవి యయ్యెననియు, ప్రాచీన పండిత ప్రోక్తమగు నైతిహ్యము ననుసరించి మీఁదియంశము చెప్పఁబడినది. కాళిదాసుని కృతులలో కుమారసంభవమను మహాకావ్యమును, సుప్రసిద్ధములగు శాకుంతలాది నాటకములును గలవు. అయినను కాళిదాసు డిచట- రఘువంశకారుఁడను పదమున నిర్దేశింపఁబడుటవలన- అద్వితీయమగు శోభగల తత్కృతులన్నిఁటి లోపలనుగూడ రఘువంశమే ప్రధానమని యీ కవి యభిమానించెనను నంశము - గుర్తింపఁదగియున్నది.

శ్లో. యుష్మాకమ్ మగ్ర్యాం వితనోతు వాణీ
మేణీదృగేషా, గిరిశస్య యోషా
యస్యాః కటాక్షస్య విసారివీర్యం
గిరామయం మే వివిధో విలాసః. ౫

ఏపరమేశ్వరియొక్క- సర్వతః ప్రసరణశీలమగు వీర్యము- నానావిధమగు మదీయవాగ్విలాస మగుచున్నదో, ఏణీవిలోచనయగు ఆగిరీశ్వరయోష- మీకు శ్రేష్ఠమగువాణిని విస్తరింపఁజేయుఁగాత!

ప్ర భ:—వీర్యము=బలము—ప్రభావము. ఏణీవిలోచన = ఆడులేడివంటి కన్నులుగలది. గిరీశ్వరయోష=పరమేశ్వర సుందరి. భగవతియగు నుమాదేవియొక్క కటాక్షప్రభావమే వివిధమగు నావాగ్విలాసమై యున్నదని యర్థము. మూలమునం దలి వివిధపదప్రయోగమువలన— నాకవిత్వము కేవలమును ఆశుధారారూపమును, అష్టావధానాది రూపమును మాత్రమే కాదు. సర్వతోముఖమగు నాసారస్వత వైభవము— మద్విరచితములగు నిగమాగమ విమర్శనములయందును, నానాశాస్త్రగ్రంథ ములయందునుగూడ విభాసించుచు ధీమంతులకు సంతోషదాయక మగుచుండునను నర్థము తెలియఁదగియున్నది.

"హేతు హేతుమతో రైక్యం హేతుంకేచిత్ ప్రచక్షతే"

అనుచంద్రాలోకోక్తివలన—ఇచట పార్వతీకటాక్షప్రభావమను హేతువునకును గీర్విలాసమను హేతుమంతమునకు (కార్యమునకును) ఏకత్వము (కటాక్షబలమే—వాగ్విలాసమని) చెప్పుటవలన నిది హేత్వలంకార మగుచున్నది.

మూ॥ నగాత్మజాయాః కరుణోర్మిశాలీ
దృగన్తసన్తానధునీప్రవాహః।
భీష్మేణ తప్తాన్ భవనామకేన
గ్రీష్మేణ యుష్మాంఛ్ఛిశిరీకరోతు. ౬

'నగరాజతనయకరుణ' అను తరంగములచేత వెలయుచున్న కటాక్షవిస్తారమను నదీప్రవాహము—భీష్మమగు 'భవ'నామకమగు గ్రీష్మముచేత తపెంచుచున్న మిమ్ము శిశిరీకరించుఁగాత!

ప్ర భ:—భీష్మము=భయంకరము. భవనామకము=జననమను పేరుగలది (సంసారము అను పేరుగలది) గ్రీష్మము=నిదాఘము— మండువేసవి. భగవతియగు పార్వతియొక్క కరుణాపూర్ణమగు కటాక్షము. భయంకరమగు సంసారతాపమును తొలఁగించి మిమ్ము సుఖుల నొనర్చుఁగావుతమని తాత్పర్యము. కరుణా— దృగంత సంతానమున— ఊర్మి— ధునీప్రవాహము లారోపితములు. భవమున— గ్రీష్మము ఆరోపితము. భీష్మమను విశేషణము— భవమునందును, గ్రీష్మమునందునుగూడ వర్తించును. తపించుట— సంసారులకు దుఃఖముచేతను, బాటసారులకు ఎండచేతను కలుగును. కావుననిది సావయవమగు రూపకాలంకార మగుచున్నది.

మూ॥ అజస్రమార్ద్రా దయయాఽన్తరఙ్గే
యథాభవో నిమ్నగయోత్తమాఙ్గే।
సన్తాపశాన్తిం భవసున్దరీ మే
కరోతు శీతేన విలోకితేన. ౭

భవుఁడు- ఉత్తమాంగమున గంగచేత- ఆర్ద్రుఁడగునట్లు అంతరంగమున, నెల్లపుడును దయచేత, ఆర్ద్రయగుచుండు భవసుందరి- శీతమగువిలోకితముచేత, నాసంతాపమును శాంతింపఁజేయుఁగాత!

ప్ర భ:-భవుఁడు=శివుఁడు. ఉత్తమాంగము=శిరస్సు. ఆర్ద్రుఁడు=చల్లదనము గలవాఁడు. అంతరంగమున=హృదయమునందు. భవసుందరి=శివప్రియ. శివుని శీర్షమునందు- సంతతమును స్రవించుచున్న గంగ- అతని నచట నార్ద్రుని గావించునట్లు పార్వతిహృదయమునందు- సంతతమును ప్రవహించుచున్న దయ- ఆమెనచట యార్ద్ర నొనర్చుచున్నదని తాత్పర్యము. అలంకారము—ఉపమ.

మూ॥ పుణ్యానదాపీశ్వరవివసక్తా
పతివ్రతా సామ్యమితా తవేక్షా
కులాచలాధీశ్వర కన్యకే మే
సంహారమం హోవిత తేర్విథత్తామ్. ౮

కులాద్రిరాజకన్యవగు దేవీ! నీ యీక్ష (దృష్టి) నిరంతరమును, గూడ పవిత్రము, ఈశ్వరసంగవతి, కావుననే పతివ్రతతోడి సామ్యమును పొందినది., ఆదృష్టి, నాపాపవిస్తృతిని సంహరించుగాత!

ప్ర భ:—పతివ్రత- పతికంటె నితరునియందు చలింపనట్లు, నీదృష్టి- యీశ్వరునుండి తొలఁగదు. కావున పతివ్రతా సామ్యము నొందినదని చెప్పఁబడినది. కావున నిది యుపమాలంకార మగుచున్నది. పతివ్రత- పతికంటె నితరుని జూడకున్నను, తత్ పాతివ్రత్య ప్రభావమున పాపమును సంహరించునట్లు నీయీక్షకూడ యీశ్వరునికంటె నన్యునియందు ప్రసరింపకుండినను, పాపమును సంహరించునని భావము,

మూ॥ శర్వాణ్యరామే నియమేనహీనా
శ్యామా తవేశ్యా గణికాఙ్గనేవ
నీచేఽపి మర్త్యేనిపతత్యనర్ఘా
బిభర్తినాషోడశ యః సువర్ణాన్. ౯

ఓశర్వసుందరీ! శ్యామయగు- నీయాక్ష-గణికాంగనవలె నియ తాచారశూన్యయగుచున్నది. షోడశ- సువర్ణములను ధరించిన నీచుఁ డగుమర్త్యునియందుఁగూడ- అనర్ఘమై ప్రసరించుచున్నది.

ప్ర భ:—శ్యామ=నల్లనిది లేక సౌందర్యముగలది. షోడశసువర్ణములను=పదు నారుసంఖ్యగల అక్షరములను అనఁగా షోడశాక్షరియగు మంత్రమును, లేక పదునారు బంగారునాణెములను, అనర్ఘము=అమూల్యము-గొప్ప వెలగలది. వేశ్యాంగన-స్వర్ణ ధనయుక్తుఁడగు మనుష్యుఁడు నీచుఁడయిననుగూడ వానియందు అనురక్తయగునట్లు నీయాక్ష- షోడశాక్షర మంత్రధరుఁడగు పురుషునియందుఁగూడ అనుగ్రహముగలది యగుచుండునని భావము. శ్లిష్టోపమ-అలంకారము.

మూ॥ పద్మాయతాక్షి! క్షితిధారికన్యే
కటాక్షనామా తవ కాలసర్పః।
యం నస్దశత్యేష జగత్సమస్తమ్
విస్మృత్యచాహో నదధాతి మోహమ్. ౧౦

పద్మాయతాక్షివగు భూధరబాలా! నీకటాక్షమను పేరుగల కాలసర్పము- ఎవనిని బాగుగకఱచునో, వాఁడు- విశ్వమునంతను విస్మ రించినవాఁడయినను మోహమును వహింపఁడు. ఆశ్చర్యము!

ప్ర భ:—పద్మాయతాక్షి=కమలములవలె విశాలములగు నేత్రములు గలది, మోహము=మూర్ఛ. కటాక్ష- కాలసర్పములకు- అభేదానురంజనమువలన రూపక మలంకార మగుచున్నది. మోహముకలుగుటకు కారణమున్నను, కార్యమగుమోహము కలుగనట్లు చెప్పుటవలన విశేషోక్తి యలంకారమగుచున్నది. అవిశేషోక్తి రూపకము చేతఅను ప్రాణితము. కాలసర్పముకంటె కటాక్షము-అధికగుణమని చెప్పబడుటవలన వ్యతిరేకము గమ్యమగుచున్నది. ఇచట రూపక- విశేషోక్తులకుమాత్రము సమాన మగు ప్రాధాన్యముండుటవలన నిది సమప్రధాన సంకరమగుచున్నది.

మూ॥ ఈశద్విషా శైలమహేన్ద్రకన్యే
కరోతి మైత్రీం విషమాయుధేన
ప్రభాషతే పాతకి నశ్చపక్షే
కుతః కటాక్షోఽన తవామ్బ ముగ్ధః. ౧౧

శైలేంద్రకన్యవగు జననీ! నీకటాక్షము- ఈశ్వరద్వేషియగు విషమాయుధునితోడిమైత్రి నొనర్చుచున్నది. పాతకియగు నతనిపక్షమున పరిభాషించుచున్నది. కావున నది ముగ్ధము (మూఢము) కాదా?

ప్రభ:—విషమాయుధుఁడు=సమసంఖ్య గలవి కాని అయిదుబాణములు గల మన్మథుఁడు. పాతకి=పాపముగలవాఁడు. పక్షము=సహాయము. ముగ్ధము కాదా?=మూఢమేయగును. ప్రాణనాయకుఁడగు పరమేశ్వరుని శత్రువునకు పక్షబలమునిచ్చి పాపాత్ముఁడగువానికి సహాయమగుటవలన నీకటాక్షము మూఢమేయని భావము. "నీకటాక్షము-పరమేశ్వర ద్వేషియందుఁగూడ పరమకారుణికము" అనునది స్తుతి పర్యవసాయిని యగునింద యగుచున్నది. "ఉక్తిర్వ్యాజస్తుతి ర్నిన్దాస్తుతిభ్యాం స్తుతినిన్దయోః" నిందచేతస్తుతియు స్తుతిచేత నిందయు చెప్పఁబడినయెడల నది వ్యాజస్తుతియగును. అనులక్షణమువలన నిది వ్యాజస్తుతియను నలంకారమగుచున్నది.

మూ॥ కృపాన్వితః కర్ణసమీపచారీ
శ్రీమాన్ సదా పుణ్యజనానుకూలః
సామ్యం కురూణామధిపస్య శమ్భోః
ప్రాణప్రియే! తే భజతే కటాక్షః. ౧౨

శంభుని ప్రాణప్రియవగు పార్వతీ! నీకటాక్షము- కృపాన్వితము! కర్ణసమీపచారి, శ్రీమంతము, నిత్యము, పుణ్యజనానుకూలము, అగుచు కురుదేశాధిపుఁడగుదుర్యోధనుని సాదృశ్యము నొందుచున్నది.

ప్రభ:—కృపాన్వితము=దయతోఁగూడినది. కర్ణసమీపచారి=శ్రోత్రాంత విశ్రాంతము. శ్రీమంతము=శోభగలది. పుణ్యజనానుకూలము=పావనులకనుకూలము. దుర్యోధనునిపక్షమున మీఁది విశేషణముల యర్థమును క్రమముగా నిట్లుఁగునది. ధనుర్విద్యాచార్యుఁడగు కృపునితోఁ గూడినవాఁడు, కర్ణునిసమీపముననుండువాఁడు, రాజ్యలక్ష్మీయుక్తుఁడు, రాక్షసుల కనుకూలుఁడు, పవిత్రులగు జనుల కనుకూలమగు

కారుణ్యవైభవముగల కటాక్షమునకు దుర్యోధనసామ్యమును వర్ణించుట విరుద్ధము. మీఁది విరోధము మీఁది విశేషణములందున్న శ్లిష్టార్థముచేత పరిహరింపఁబడినది. కావున నిది – విరోధాభాసాలంకార మగుచున్నది.

మూ॥ కర్ణాన్తికస్థోఽపిన ధర్మవైరీ
కృష్ణోఽపి మాతర్నకులం నపాతి
శీతోఽపి సన్దీపయతి స్మరాగ్నిం
హరస్య తే శైలసుతే! కటాక్షః. ౧౩

శైలకుమారివగు జననీ! నీకటాక్షము– 1 కర్ణాంతికస్థము అయినను ధర్మవైరికాదు. 2 కృష్ణమయినను (కృష్ణుఁడయినను) నకులరక్షకముకాదు. 3 శీతమయినను శివునికి స్మరాగ్నిని సందీపింపఁజేయునది.

ప్రభ:—కర్ణాంతికస్థము=కర్ణుని సమీపమునందుండునది, లేక కర్ణముల సమీపమునందుండునది. ధర్మవైరి=ధర్మరాజునకు శత్రువు; లేక శ్రోత్రధర్మమగు శ్రవణమునకు విరోధించునది. కృష్ణము=కృష్ణరూపము, లేక నల్లనిది. న(అ)కులరక్షకము=నకులుని రక్షించునది. లేక అకులమును రక్షించునది. శీతము=చల్లనిది. స్మరాగ్నిని=కామాగ్నిని. సందీపింపఁజేయునది=వృద్ధినొందించునది.

ఇందలి ప్రథమ ద్వితీయవాక్యములయందు శబ్దశ్లేషముచేతను, తృతీయవాక్యమునందు– స్వభావముచేతను, విరోధ–పరిహారములు చెప్పబడుటవలన నిది విరోధాభాసాలంకార మగుచున్నది. ఇందు విరోధమున్నట్లు– ఆభాసించును (తోఁచును) కాని నిజమగు విరోధముండదు. కావున దీనికి విరోధాభాసమను పేరుకలిగినది.

ఇందలి ప్రథమవాక్యమున నీకటాక్షము– దుర్యోధనపక్షపాతియగు కర్ణుని సమీపము నందుండునది యయినను ధర్మరాజునకు విరోధికాదు అని చెప్పబడినది. కర్ణుఁడు ధర్మపుత్రునకు ప్రతిపక్షుఁడనునది ప్రసిద్ధము! కావున నిదియిచట విరోధ మగుచున్నది. శ్రోత్రసమీపము నందున్నను శ్రోత్రధర్మమగు వినికిని ప్రతిబంధించునది కాదు. అను నింకొకయర్థముగూడ మీఁదివాక్యమునకు గలదు. కావున నీయర్థముచేత మీఁది విరుద్ధార్థము పరిహరింపఁబడుచున్నది. ద్వితీయవాక్యమున కృష్ణరూపమయినను పాండవుఁడగు నకులుని రక్షించునది కాదు. అను నితిహాసవిరోధము కలిగినది. నల్లనిదయినను (మాలిన్యముగలదానివలెఁ గనఁబడుచున్నను) అకులమును

రక్షించునది కాదని చెప్పఁబడినది. అనఁగా కులమును రక్షించునదియేయని చెప్పఁబడినది. కావున మీఁదివిరోధము నిది పరిహరించుచున్నది. ఇట్లే రెండువాక్యముల యందును శబ్దశ్లేషమువలన విరోధము పరిహరింపఁబడినది. తృతీయవాక్యమున చల్లనిదయినను కామాగ్నిని సందీపింపఁ జేయునది అని విరోధము చెప్పఁబడినది.(చల్లనిది- అగ్నినివృద్ధినొందించుటవిరుద్ధముగదా! శివునికి కామాగ్నినిసందీపింపఁజేయుప్రవృత్తి- కటాక్షప్రభావమునకు స్వభావసిద్ధమగుటవలన నిది పరిహరింపఁబడినది. ఇట్లు- ఇది విరోధాభాసమగుచున్నది.

మూ॥ అయంకటాక్ష స్తవతోయవాహః
కారుణ్యకాలే పరిజృమ్భమాణః।
గృహేషు లీనాన్ సుఖినో విహాయ
నిరాశ్రియాన్ సిఞ్చతి విశ్వమాతః. ౧౪

ప్రపంచజననీ! ఈ- నీకటాక్షమను తోయవాహము- (నీటిమేఘము) కారుణ్య (వర్షా) కాలమునందంతటను వ్యాపించి, గృహములయందు లీనులగు సుఖవంతులను విడిచి- నిరాశ్రియులను సిక్తులనొనర్చుచున్నది.

ప్ర భ:—తోయవాహము=జలమును వహించుచున్న మేఘము. కారుణ్యకాలము=కరుణాప్రదర్శన సమయము. నిరాశ్రయులను=అనన్యాశ్రయులను. ఇతరమగు నాధారము లేనివారిని, లేక ఆవాసగృహములేక వెలుపలనున్నవారిని. గృహములయందు=భార్యలయందు, లేక నిజగృహములయందు. లీనులు=తగులుకొనినవారు,లేక, మిగుల నడఁగియుండువారు. 'కారుణ్యకాలమునందు' అనుచోట రూపకబలమున వర్షాకాల మాక్షేపింపఁబడుచున్నది. గృహశబ్దముచేత గృహ- పుత్ర- విత్తాదులు గ్రాహ్యములు. గృహ- పుత్ర- ధనాదుల నాశ్రయించి వానిచేత ఆత్మనావరింపఁజేసికొనినవారికి- ఉచిత కాలమున దేవీకరుణాకటాక్షము ఉపస్థితమయినను ఫలప్రదము కానేరదు. ఏవస్తువునుగూడ స్వకీయముగా నాశ్రయింపక నిరావరణులగువారు మాత్రమే నీకటాక్షమున కాస్పదమగుచుందురని భావము. కటాక్ష- తోయవాహములకును, కారుణ్య-వర్షాకాలములకును, అభేదముచేనగురంజనమువలన నిది=రూపకాలంకార మగుచున్నది.

మూ॥ కస్యాపివాచా వపుషాబలేన
సమస్య సర్వైరపి యన్ని దేశాః।
అమ్భోధివేలాస్వపి నస్ఖలన్తి
శమ్భోః ప్రియేఽయం త్వదృక్ ప్రసాదః. ౧౫

శంభుప్రియా! వాక్కుచేతను, శరీరముచేతను, బలముచేతను గూడ సర్వమానవులతోడను సమానుఁడని ఒకానొకపురుషుని శాసనములు-కల్లోలితములగు సముద్రజలములయందుఁగూడ స్ఖలితములు కాకుండుటయనునది నీదృక్ ప్రసాదము. శ్రీరాముఁడు సేతువును బంధించుట. నీప్రసాదముచేతనే అనిభావము.

ప్ర భ:—బలముచేతను=వీర్యముచేతను- మూలమునందలి వేలాశబ్దమునకు-సముద్రజలవికారము, అనగా ఉప్పెనఅని యర్థము. స్ఖలితములు=విఫలములు. దృక్ ప్రసాదము=దృష్టియొక్క అనుగ్రహము. వాక్-శరీర- వీర్యములచేత- తదితర మనుష్యులకు సమానుఁ డగుటవలన బాహ్యదృష్టికి సాధారణునివలెఁ గనఁబడు పురుషుఁడుగూడ నీప్రసాదముచేత కల్లోలితములగు అస్పృశ్యగంభీరసాగరములను నియమించుచుండునని భావము. ఇచట- సేతుబంధాదికము నిదర్శనమైయున్నది.

మూ॥ ద్వారేషు తేషాం విచరన్తి శూరాః
సౌధేషు సారఙ్గదృశస్తరుణ్యః
ప్రగల్భవాచః కవయః సభాసు
శర్వాణి తేయేషు కృపాకటాక్షః. ౧౬

శర్వాణీ! నీకృపాకటాక్షము కలిగినవారియొక్క- గృహద్వారములయందు శూరులును, సౌధములయందు, సారంగనయనలగు తరుణులును, సభలయందు ప్రగల్భవచనులగు కవులును విచరించుచుందురు.

ప్రభ:—కృపాకటాక్షము=కరుణావాహినియగు కడకంటిచూపు. సారంగనయనలు=ఆడులేడి చూపులవంటి చూపులుగల సుందరులు, ప్రగల్భవచనులు=అతిప్రౌఢములగు వాక్కులుగలవారు. కవులు=కావ్యబ్రహ్మలు. ఇందు శూరులగు వారు రాజులనియు, సుందరులుగలవారు శ్రీమంతులనియు, కవులుగలవారు సరసులనియు గ్రహింపనగును. కాళివలన శౌర్యమును, లక్ష్మివలన సంపదయు, సరస్వతివలన విద్యయు క్రమముగా పాత్రమగు [illegible] చెప్పఁబడినవి. ఈ మూడును [illegible]

భవత్కటాక్షవంతుఁడగు పురుషునిచేత లభ్యములగునని యర్థము. ఇట్లనుటచేత— 'శర్వాణీకటాక్షము- కాలీ- లక్ష్మీ- సరస్వతీ విభూతిగర్భితము' అనునంశము గమ్యమగుచున్నది.

మూ॥ యస్త్వామ్బ తే క్వోఽపి కటాక్షలేశః
స దుర్జయః సఙ్గరసీమ్ని శూరః।
పూర్వం దివం పూరయతి ద్విషద్భి
స్తతో యశోభిర్భువ మిన్దుగౌరైః. ౧౭

అమ్మా! అనిర్వచనీయమగు నీకటాక్షలేశము సోకిన మనుష్యుఁడు యుద్ధరంగమున దుర్జయుఁడైన శూరుఁడై మొదటస్వర్గలోకమును శత్రువీరులచేత నిండించి, తదుపరి- భూలోకమును, సితాంశుగౌరములగు యశస్సులచేత పూరించును.

ప్ర భ:—దుర్జయుఁడు=మిక్కిలి శ్రమచేతగాని జయించుటకు వీలుకానివాఁడు. సితాంశుగౌరములు=చంద్రునివలె శుభ్రములు. (తెల్లనివి) కటాక్షవంతుఁడగు జనునికి మహోన్నత శౌర్యప్రాప్తి ప్రస్తావముచేత కటాక్షమునకుగల కాళీ విభూతి చెప్పఁబడినది. మొదట శత్రువులను స్వర్గమునొందించుటయు, తరువాత భూమిని శుభ్రకీర్తులచేత పూరించుటయు, నిచటఁ జెప్పఁబడుటవలన ఇది కార్యము యొక్క- శీఘ్రతాప్రత్యాయనార్థమగు అతిశయోక్త్యలంకార మగుచున్నది.

మూ॥ యం తారకాకాన్త కలాపకాన్తే!
నలోకసేకోఽపి నలోకతేతమ్।
యంలోకసే తేన విలోకితోఽపి
శ్రియం సమృద్ధాం సముపైతిలోకః. ౧౮

చంద్రకలాభూషణుఁడగు శివుని కాంతవగు భగవతీ! నీవు చూడనివానినెవ్వఁడునుగూడ చూడఁడు. (వాడు పేరులేనివాఁడయి, సర్వజనులచేతనుగూడ నుపేక్షింపఁబడును.) నీ వెవ్వనిని విలోకింతువో వానిచేత విలోకింపఁబడినవాఁడుకూడ సమృద్ధమగు సంపదనొందును

పరి భ:—సమృద్ధము=పుష్కలము. నీదృష్టిసంపర్కము సాక్షాత్తగాను, పరంపరగాను కూడ లోకులకుఁ గలుగుచుండును. కావున నీదృష్టినాశ్రయించినవాని

నాశ్రయించినవారికిఁగూడ పుష్కలమగు శ్రీవిభూతి కలుగునని భావము. దీనిచేత కటాక్షమునకుగల లక్ష్మీవిభూతి ప్రస్తుతింపఁబడినది.

మూ॥ సుధాంహసన్తి మధుచాక్షిపన్తి
యశోహరన్తి వనితాధరస్య
పరిష్కరోత్యస్య కవిత్వధారా
ముఖం హరప్రేయసి! లోకసేయమ్. ౧౯

శివప్రేయసీ! నీవు- ఎవనిని వీక్షింతువో, వానిముఖమును- అమృతము నుపహసించునదియు, మధువు నాక్షేపించునదియు, వనితల యధరోష్ఠమునకుఁగల కీర్తినిగూడ నపహరించునదియునగు కవిత్వధార పరిష్కరించును.

ప్ర భ:—మధువు=తేనె, కవిత్వధార=కావ్యసంపాతము. ఆక్షేపించునది= నిషేధించునది. పరిష్కరించును=అలంకరించును. కవిత్వధార- అమృతముకంటెను గూడ నధికమగు నిజోత్కర్షమువలన అమృతమునుజూచి నవ్వుననియు, "సుందరుల కెమ్మోవి- లోభనీయమును శ్రేష్ఠమును అగు మాధుర్యముగలది" అని యధరము నకుఁగల కీర్తినిగూడ నపహరించుననియు, భావము. దీనిచేత "కటాక్షము సరస్వతీ విభూతిమంతము" అనునంశము చెప్పఁబడినది. హసించుట- ఆక్షేపించుట- అపహరించుట— ఉపమావాచకములని యింతకుముందే చెప్పఁబడినవి. ఇందు-ఒక్కటియే యగు కవితాధార కనేకములగు నుపమానములు కాన్పించుటవలన మాలోపమాలంకార మగుచున్నది.

మూ॥ సర్వేన్ద్రియానన్దకరీ పురన్ధ్రీ
విద్యానవద్యా విపులాచ లక్ష్మీః।
ఇయం త్రిరత్నీ పురుషస్యయస్య
దుర్గే! త్వయా దృష్టమిమంతు విద్మః. ౨౦

దుర్గా దేవీ! సర్వేంద్రియానందకరియగు పురంధ్రియు, అనవద్యయగు విద్యయు, విపులయగు లక్ష్మియు, అను నీత్రిరత్ని- ఎవనికిఁ గలదో, ఆపురుషుని నీచేత అవలోకితుఁడని ఎఱుఁగుదుము.

ప్ర భ:—సర్వేంద్రియానందకరి=భోగసాధనములగు నింద్రియములకుసమ్మోదముఁ గూర్చునది. పురంధ్రి=సర్వలక్షణ సంపన్న శరీరాంతరంగములు గలదియుప

రమణి. అనవద్య=నిర్దుష్ట. విపుల=బహుల. త్రిరత్ని=మూడురత్నములకలయిక (రత్నములనఁగా శ్రేష్ఠవస్తువులని యర్థము) అవలోకితుఁడు=బాగుగాఁ జూడఁబడిన వాఁడు. త్వదీయ కరుణాకటాక్షము లేనియెడల ఏయొక్కనికిగూడ నీమూఁడును లభింపవని భావము.

మూ॥ ముధాక్షిపస్యద్రిసుతే! కటాక్షాన్
కైలాసకాన్తార మహీరుహేషు
ఇతః కిరేషత్ తవనాస్తి హానిః,
సిధ్యత్యభీష్టంచ సమస్తమస్య. ౨౧

అమ్మా! పర్వతపుత్త్రి! కైలాసకాంతారమహీరుహములయందు నీదృగంతదృష్టుల నేలవ్యర్థముగా విరియఁజిమ్మెదవు? ఇక్కడవానినించుక ప్రసరింపఁజేయుము, (తన్మూలమున) నీకుహానిలేదు-(సరిగదా) ఈ వ్యక్తియొక్క యభీష్టమంతయును సిద్ధించును.

ప్రభ:-కైలాసప్రాంతమునందలి యరణ్యమునందున్న వృక్షములయందుఁ బ్రసరించి, నీకటాక్షములు వ్యర్థములగుచున్నవి. నీవు నాయందాకటాక్షములను కొంచెముగనైనను ప్రసరింపఁజేయుము. తత్కటాక్షపాతమున నీకేమియు నష్టము లేదు కాని నాకు గొప్పలాభమున్నది. కావున యాచించుచున్నానని తాత్పర్యము.

మూ॥ శీతాచలాధీశకుమారి! శీతః
సంరక్షణే సంశ్రితమానవానామ్
దుర్ధర్షదుష్టాసురమర్దనేషు
నితాన్తముష్ణశ్చ తవావలోకః. ౨౨

శీతాచలాధీశ్వరకుమారీ! నీయవలోకము- సంశ్రితమానవ సంరక్షణమునందు శీతలమును (దయార్ద్రమును) దుర్ధర్ష- దుష్టాసుర మర్దనములందు, మిగుల నుష్ణమును (తాపమునిచ్చునదియు) అగుచున్నది.

ప్రభ:-దుర్ధర్ష- దుష్టాసుర మర్దనములయందు=దుర్జయులును దుష్టులును అగురాక్షసులను మర్దించుటయందు. శీతలము=చల్లనిది. ఉష్ణము=వెచ్చనిది. నిమిత్త భేదమువలన- ఒక్కటియేయగు దృష్టి- శీతలమును, ఉష్ణమునుగూడ నగు

చున్నదని యర్థము. ఇట్లు ఒకేవస్తువును ద్వివిధముగా నుల్లేఖించుటవలననిది ఉల్లేఖా లంకార మగుచున్నది.

మూ॥ రుషాసమేతం విదధాతినాశం
కరోతి పోషం కృపయా సనాథమ్।
అమ్బ్యౌషధస్యేవ తవేక్షితస్య
యోగస్యభేదేన గుణస్య భేదః. ౨౩

జననీ! రుషాసమేతమగు నీ యీక్షితము- నాశమును, కృపా సనాథమగు నీయీక్షితము- పోషమును గావించుచున్నది. ఔషధ యోగముయొక్క భేదముచేత (వాత,పిత్త, కఫ,నాశాది) గుణము భేదించునట్లు నీయీక్షితయోగముయొక్క భేదముచేత (వినాశాది) గుణము భేదించును.

ప్ర భ:-రుషాసమేతము=కోపముతోఁ గూడినది. కృపాసనాథము=దయతో గూడినది. ఈక్షితము-చూపు. (దృష్టిపాతము) యోగము =ప్రమాణవేదాదులచేత సాధింపఁదగిన వస్తువిశేషముల కలయిక, లేక కోపాదులతోడిసంబంధము. గుణము= వాత పిత్త కఫములను పోగొట్టుట మన్నగునది, లేక నశింపజేయుట మున్నగునది. నీయీక్షితము- రోషయోగముచేత, వినాశము నొనర్చును. కృపాయోగముచేత, పోషము నొనర్చును అను నీయర్థమును- 'యోగవిశేషముచేత గుణభేదమువలె' అను నుపమ చమత్కరించు చున్నది. ఇందలి యోగ- గుణ- శబ్దములు శ్లిష్టార్థములు.

మూ॥ నాశాయతులోద్ధతకామలోభ
క్రోధత్రిదోషస్య భవామయస్య
శివప్రియే! వీక్షితభేషజం తే
క్రీణాని భక్త్యావదభోః కియత్యా. ౨౪

శివప్రియవగు దేవీ! సమోద్ధతములగు (సమానముగా గర్వించునవియగు) కామ- క్రోధ- లోభములనెడి త్రిదోషములు(అనఁగా, వాత, పిత్త కఫములు) గల జన్మమను రోగమునకు, నీవీక్షితమను భేషజమును-ఎంతభక్తితో కొనఁగలనో చెప్పుమా!

ప్ర భ:—ఉద్ధతములు=గర్వించినవి, ప్రకోపించినవి. వీక్షితమను భేషజము= నీదృష్టిపాతమను మందు. ఎంత భక్తిమూల్యమునిచ్చిన నీవీక్షితౌషధము లభించునో చెప్పుమని భావము. సమానముగా నుద్ధతములగు కామ- క్రోధ- లోభములు-తుల్యమగు ధాతుప్రకోపము స్వరూపముగాఁగల సన్నిపాతముతోఁగూడిన (వాత, పిత్త, కఫములను) త్రిదోషములుగను, జన్మము- రోగముగను, వీక్షితము- ఔషధముగను, భక్తి- మూల్యముఁ (వెల)గను చెప్పఁబడుటవలన నిది సావయవ తాద్రూప్య రూపకాలంకార మగుచున్నది.

మూ॥ అభిష్టుతాం చారణసిద్ధసఙ్ఘైః
త్రిష్టుబ్విశేషా అపిమర్త్యసూనోః
కృపాకటాక్షైర్వినతాన్ పునానాం
కపర్దినః సమ్ముదయస్వ కాన్తామ్. ౨౫

మానవపుత్రునిచే రచింపఁబడిన త్రిష్టుప్ ఛందః ప్రస్తారగతములగు వృత్తవిశేషములుగూడ-చారణసిద్ధ- సంఘములచేత-అభి-స్తుతయగుచు వినతులగు ఆశ్రితులను పవిత్రీకరించుచున్న శివకాంతను ఆనందింపఁ జేయుఁగాత!

ప్ర భ:—చారణాదులు దేవతలలో నొకతెగకు సంబంధించినవారు- వినతులు=ప్రణతులు. ఈస్తబకమున- ఉపజాతి వృత్తములును ఉపేంద్రవజ్రావృత్తములును నిబంధింపఁబడినవి. ఇవి రెండునుగూడ, త్రిష్టుప్ఛందస్సును ప్రస్తరించుటవలన నేర్పడుచున్నది. కావుననే మూలమున "త్రిష్టుబ్విశేషాః" త్రిష్టుప్ ఛందము నందలి భిన్నవృత్తములని చెప్పఁబడినవి. పాదమునకు పదునొకటి యక్షరములుగల ఛందమునకు త్రిష్టుప్పను పేరుగలదు. పాదపాదమునకునుగూడ మీఁదిసంఖ్యగల యక్షరములచే శ్రవణరంజకములగుచున్న యీవృత్తములు రెండునుగూడ త్రిష్టుప్ ఛందమున నుదయించినవి. కావున నివి- త్రిష్టుప్ఛందః ప్రస్తారగతములగు వృత్తవిశేషములని చెప్పఁబడినవి. పరమేశ్వరి- దేవవిశేషులగు చారణాదులచేత లెస్సగా స్తుతింపఁదగినది. నేను మనుష్యుఁడను. అయినను యీత్రిష్టుబ్వృత్తములచేతఁగూడ నామె స్తుతింపఁబడి యానందింపకపోదను దృఢవిశ్వాసముచే నీయాశంస కావింపఁబడినది.

సవ్యాఖ్యమగు త్రయోదశస్తబకము సమాప్తము.

ఓం నమో భగవతే శ్రీ రమణాయ,
శ్రీ భారతీ దేవ్యై నమః.

# ఉమా సహస్రము.

## చతుర్దశ స్తబకము
(చతుర్థ శతకమున ద్వితీయ స్తబకము)

అవ:- దేశ, కాల, రూప, అవస్థానముల నుపన్యసించుటచేత- యోగానుభవదానదక్షయు, 'కాలి, గౌరి, కుండలిని' అని ప్రసన్నశక్తి యగు దేవి- యీపదునాలుగవ స్తబకమున ప్రస్తుతింపఁబడుచున్నది.

మూ. కారణమఖిలమతీనాం। వారణమన్తర్లసత్ తమసః।
మన్దస్మితం మహేశ్వర। సుదృశో మే శ్రియసే భవతు. ౧

సకలములగు బుద్ధులకు కారణమును, అంతర్వ్యాప్రియమాణమగు తమస్సునకు వారణమును, అగు మహేశ్వరసుందరీమందస్మితము నాకు శ్రేయము నిచ్చుఁగాత!

ప్రతి:- అంతః + వ్యాప్రియమాణము=హృదయమున వ్యాపించియున్నది. తమస్సు=చీకటి, అజ్ఞానము. కారణము=మూలము- వారణము=నివారించునది. సర్వజ్ఞానములకును కారణమగుచున్న మహేశ్వరీమందస్మితము— లోనున్న చీకటినంతి మూలాజ్ఞానమును నివారించునునది యొకటేగదా! కావున-జ్ఞానలాభ—అజ్ఞానధ్వంసములకంటె వేరగు పరమశ్రేయమేదియును లేదు. కావున, తదుభయసాధకమగు మహేశ్వరీమందహసితము- స్తుతింపఁబడినది.

మూ. విశ్వతనుస్తనుగాత్రీ, వజ్రమయీ పుష్పసుకుమారీ
సర్వస్యశక్తిరబలా కాలీగౌర్యమ్బికా జయతి. ౨

అంబిక:- విశ్వశరీరయు-కృశాంగియు, వజ్రమయియు- పుష్ప సుకుమారియు, సర్వశక్తియు- అబలయు, కాలియు గౌరియు అగుచు వెలయుచున్నది.

ప్రతి:- విశ్వశరీర=బ్రహ్మాండమే శరీరము గాఁగలది. కృశాంగి=తనుగాత్రి=అల్పమగు శరీరముగలది. వజ్రమయీ=వజ్రమునలెకఠినశరీరమయినది. పుష్ప

సుకుమారి=పూవువలె మెత్తనిది, సర్వాశక్తి=సర్వమగు పరమేశ్వరునిశక్తి, అబల=బలములేనిది, కాలి=కాలవర్ణముగలది (నల్లనిది) గౌరి=గౌరాంగి (తెల్లనిది). దేవీశరీరము= విశ్వాత్మకము- కావున బృహద్రూపమయినది. ఆమె తనుగాత్రి యను ప్రసిద్ధి యుండుటవలన అల్పమగుచున్నది. వజ్రమువలె దృఢమయినను స్త్రీదేహముగలది కావున కుసుమకోమలయగుచున్నది. సర్వాశక్తియయినను స్త్రీరూపిణి యగుటవలన "అబల" అని ప్రసిద్ధయగుచున్నది. కాలి- గౌరి. అనుప్రసిద్ధివలన శ్యామలయయినను శ్వేతవర్ణయగుచున్నది. ఇట్లు- భగవతియగుదేవి-, అన్యోన్యవిరుద్ధలక్షణయు, అపరిమేయస్వరూపయు నగుచున్నదని భావము. వస్తుతః, ఆమెస్వరూపమునందీవిధమగు విరోధము లేదనునంశము ముందుచెప్పఁబడును. మనకు పూర్వోక్తవిధమున భాషచేతఁ గనఁబడుచున్న విరోధము- పరమేశ్వరి, సర్వవిధములచేతను గూడ విభాసించునది యగుటవలన స్వభావముచేతనే పరిహరింపఁబడుచున్నది. కావున నిది విరోధాభాసాలంకారమగుచున్నది. "అపి" ఇత్యాద్యర్థముగలది "అయినను" ఇత్యాదులచేత నిచటవిరోధము వాచ్యము కాకుండుటవలన నిదివ్యంగ్యమేయగుచున్నదని గ్రహించునది. "శర్వస్యశక్తిః" అను పాఠాంతరము- మూలమునఁ గలదు. 'శివునిశక్తి' అనునది దానియర్థము.

మూ. తామాహుర్జగదమ్బాం గౌరీం కేచిత్ పరేకాలీమ్।

సాగౌరీమహిలాతను రమ్బరతను రుచ్యతేకాలీ. 3

(విద్వాంసులు) కొందఱు- ఆజగదంబను 'గౌరి' అనియు మఱికొందఱు 'కాళి' అనియు చెప్పుదురు. ఆమె మహిలాశరీరయై గౌరి యగుచున్నది. ఆకాశశరీరయై 'కాళి' అని చెప్పఁబడుచున్నది.

ప్రభ:- ఆమె ఉభయవిధములచేతనుగూడ ఒక్కతెయేయగును. కావున నామరూపభేదమున్నను స్వరూపముచేతమాత్రము ఆజగన్మాతకు భేదములేదని భావము.

అవ:- స్త్రీశరీరయగు- జగన్మాత యింతకుముందే స్తుతింపఁబడినది, ఇక్కడ, కాళీతత్త్వమును వ్యాఖ్యానించి- తరువాత-- తద్వైభవమును వ్యాఖ్యానింపనున్నాఁడు.

మూ, పాచకశక్తేః కాల్యాః। కేవలలిఙ్గే నభిద్యతేకాలః।

యత్ పాకతో గభీరాద్ భువనేవర్త్వే పిపతి[illegible] ౪

భూత- భవిష్యద్- వర్తమానరూపమగుకాలము (సంస్కృత భాషయందు) పుంలిఙ్గము. కాలి- స్త్రీలింగము. (ఆ) కాలము- పాచక శక్తియగు కాలికంటె, లింగమాత్రముచేతనే వేరగుచున్నది. గంభీర మగు ఆకాలముయొక్క- పాకమువలన లోకమునందు పరిణామము లన్నియుఁ గూడనగుచున్నవి.

వి వః—పాచకశక్తి=పరిపక్వము నొనర్చువాఁడు పాచకుఁడు- అతఁడే మహాకాలుఁడగు రుద్రుఁడు. వానిశక్తియే పాచకశక్తి. కాలము పుంలింగము- కాలి- స్త్రీలింగము. కావున కాళీ—కాలములకు లింగభేదమే కాని వస్తుభేదము లేదు. పరిణామములనఁగా; పరిపాకములు. అగాధమగు నేకాలముయొక్క- పరిపాకకార్యమువలన లోకమునందలి పరిణామములు (మార్పులు) అన్నియుఁగలుగు చున్నవో, ఆ కాలము- పాచకశక్తియగు కాలికంటె భిన్నము కాదు. లింగభేద మున్నను వస్తుభేదములేదు. కావున, కాలమే కాలియగుచున్నదని భావము. సృజింపఁబడిన సర్వమునకుఁగూడ- ఒకరూపమునుండి వేఱొకరూపముయొక్క- మార్పు కలుగుననియర్థము.

మూ. సర్వభువనాశ్రయత్వాత్ కాలీనామ్నా దిగన్యేన
లోకేతువ్యవహరణం విదుషాం దిక్కాలయోర్భాక్తమ్. ౫

కాళి- సర్వభువనాశ్రయ. కావున నామె యింకొకనామముచేత దిశ (దేశము) అగుచున్నది. లోకమునందలి విద్వాంసులు దిక్- కాల వ్యవహారముల నొనర్చుచున్నారు. కాని యది భాక్తము.(ముఖ్యము కాదు)

ప్ర భః—దిశ=దిక్కు—దేశము. కడచినశ్లోకమున, కాళి- కాలస్వరూపిణి. యని చెప్పఁబడినది. ఈశ్లోకమున నామెయే దేశస్వరూపిణిగాఁ జెప్పఁబడినది అట్లయినచో పండితులచేఁ గాలింపఁబడు దేశ-కాలవ్యవహార మెట్లుకుదురును? అనిన "అవ్యవహారము గౌణమే కాని ముఖ్యము కానేరదు". అనిసమాధానము చెప్పఁబడినది. ఆరెంటికినిగూడ మూలరూపము కాలియే యనుసిద్ధాంతమువలన ఇట్లు దేశకాల వ్యాపారమును వివరించుటచేత- పరమేశ్వరియొక్క- తేజో యనునంశము స్పష్టమగు చున్నది.

మూ. దిగదితిరగాద్యఖణ్డా, పరిణమయిత్రీ స్మృతా కాళీ।
దక్షస్యైకాదుహితా, సాద్వైగుణ్యభేద ముగ్ధదృశామ్. ౧౬

దిశ-అఖణ్డయగు అదితియని చెప్పఁబడుచున్నది, కాళి పరిణామము నొనర్చునదని స్మరింపఁబడినది. ఇట్లు దక్షప్రజాపతియొక్క పుత్త్రియగు సతీదేవి యొక్క తెఱఁగే- గుణభేదజ్ఞానముచేత విమోహితులగు దృష్టులుగలవారికి, అదితి, కాళి, అని యిద్దరగుచున్నది.

ప్ర భ:- "దో అవఖణ్డనే" అనుధాతువువలన నిష్పన్నమగుటవలన దితిశబ్దము ఖండార్థకము. దేశము- వ్యాపకమును, పరిచ్ఛేదము లేనిదియు, నగుటవలన అదితి యను పేరుగలదగుచున్నది. కావుననే అది అఖణ్డయగునదితియని చెప్పఁబడినది. పరిణామము=పరిపాకము, పాచకశక్తియని వెనుక చెప్పఁబడుటవలన కాళి-పరిపాకవిధాత్రియగుచున్నది. ఇట్లు- ఇద్దఱునుగూడ నొక్క తెఱఁగే యగుచున్నను- సర్వమునకును ఆధారమగు స్థైర్యగుణముగలదగుటచేత అదితియనియు సర్వమును పరిణమింపఁజేయుగుణముగలదగుటచేత కాళియనియు దక్షపుత్త్రియగు సతినే ద్వివిధగా మూఢులు తలంతురని భావము.

మూ. దేహే దేహే సేయం కుణ్డలినీనామ జగదమ్బా।
సా స్వపితి సంసృతిమతాం యుఞ్జానానాం ప్రబుద్ధా స్యాత్. ౭

అదితియనియు, కాళియనియు నామభేదముచేఁ జెప్పఁబడిన యీజగదంబ- ప్రతిదేహమునందునుగూడ కుండలినియని ప్రసిద్ధయగుచున్నది. సంసారులగు పామరుల శరీరముల యందా కుండలిని నిద్రించుచున్నది. యోగుల శరీరములయందు మేల్కొనుచున్నది.

ప్రభ:- కుండలినినిగురించి ప్రథమశతకమున వ్యాఖ్యానింపఁబడినది. (చూచునది)

మూ. మూలాధారాదగ్నిర్జ్వలతి శిరస్తః శశీ ద్రవతి।
కుణ్డలినీ మయి మన్యే వీణాశయనాత్ ప్రబుద్ధేయమ్. ౮

ఆధారచక్రము లాఱింటిలోపలను మొదటిదగు మూలాధారమునుండి అగ్ని- ప్రజ్వలించుచున్నది. శిరస్సునందలి సహస్రారమునుండి శశి ద్రవించుచున్నది. (కావుననే) ఈకుండలినీశక్తి- వీణాశయనము నుండి మేల్కొనినదని యూహించుచున్నాను.

ప్ర భ:- శశి=సోమము-అమృతము. సహస్రారము- సోమనిలయమనియు, మూలాధారము- అగ్నికుండమనియు, యోగులయందు ప్రసిద్ధములు. కుండలిని మేల్కొనునప్పుడే యోగియందు- అగ్ని- జ్వలించుటయు, సోమము= స్రవించుటయు సంభవించును. మస్తకము మొదలుకొని మూలాధారమువఱకునుగల అస్థి పంజరిక- వీణాదండమువలె నుండును కావున వీణయని చెప్పఁబడుచున్నది. ఆవీణ యనుశయనము. వీణాశయనమని యిచటఁజెప్పఁబడినది.

"యాతాయాతవిహారే" నృతనుషు విహరన్తీంత్వామ్ (4 స్తబ- శ్లోక-6.7) అనుశ్లోకద్వయమును- వ్యాఖ్యానించునపుడు ప్రథమశతకమునందే యీయంశము ప్రదర్శింపఁబడినది.

మూ. యద్ద్రవతి తత్రకింత్వం కింతత్రత్వమసి యజ్జ్వలతి
కిముతత్రాసి మహేశ్వరి! యదుభయమేతద్విజానాతి.

శిరస్సునుండి ఏది స్రవించుచున్నదో, అచ్చట నీవున్నావా? మూలాధారమునుండి యేది జ్వలించుచున్నదో అచ్చట నీవున్నావా? లేక, ఓమహేశ్వరీ! సోమద్రవణమునకును, అగ్నిజ్వలనమునకును మూలమగుచు, నారెండింటినిగూడ నేది తెలియుచున్నదో అచ్చటనీవున్నావా?

ప్ర భ:—సోమము (అమృతము) శిరస్సునుండి స్రవించుచుండును. అగ్ని మూలాధారమునుండి జ్వలించుచుండును. అధారచక్రముల కన్నిటికిని ఆధారమగుచు, దహరమనుపేరుగల హృదయాకాశమునందు- ఈసోమాగ్నులు ప్రతిష్ఠింపబడినవి. కావున వానికిమూలమగు నీదహాకాశము వాన్నిటి తెలియుచుండును. కావున నీవు సోమమునందున్నావా? అగ్నియందున్నావా? సోమాగ్ని మూలమగు హృదయమునందున్నావా? అని ప్రశ్నింపఁబడినది.

మూ. ఏతావగ్నీషోమౌ జ్వాలాభిశ్చన్ద్రికాభిరప్యా
అవృణుత స్తనుమన యోర్వ్యక్తిత్వం మే పశుత్వభవతు. ౧౦

(త్వగింద్రియముచేతఁ దెలియఁబడుచున్న) ఈయగ్నీషోములు- జ్వాలలచేతను, చంద్రికలచేతనుగూడ శాశ్వతముగా ఆవరించుచున్నారు. ఈయగ్నీషోములకు నావ్యక్తిత్వము- (అహంకారసహితమగు పృథగాత్మత్వము)పశువు అగుగాత. (హింసింపఁదగిన మేకమున్నగుజంతువువంటిది అగుఁగాత!)

ప్రి భ:- అగ్నిషోములు=మూలాధారమునందలి యగ్నియు, సహస్రారమునందలి సోముఁడును, జ్వాలలచేతను=ఉష్ణదీప్తులచేతను, చంద్రికలచేతను=శీతదీప్తులచేతను, మూలాధారమునందలియగ్ని- జ్వాలలచేతను, సోముఁడు- వెన్నెలచేతను యోగినగు నాశరీరము నావరించుచున్నారు. లోకులకందఱకును— "నేను" తదితరులకంటె వేఱగు స్వరూపాదికము గలవాఁడను" అనువ్యక్తిత్వముగలదు. ఇదియే సంసారబంధహేతువు. కావున- ఈవ్యక్తిత్వము నశించుటయే ముక్తియగుచున్నది. కావున నావ్యక్తిత్వము- అగ్నిషోములకు పశువగుగాతయని కోరఁబడినది- యజ్ఞమునందుక పశువును చంపుదురు. ఇట్లు చంపుటకు ఆలంభము అనిపేరు. "జ్యోతిష్టోమేన స్వర్గ కామో యజేత" అగ్నిష్టోమమున (అగ్నికిని సోమునకును సంబంధించిన యజ్ఞమునందు) పశ్వాలంభమొనర్చెదరు. మానవునియందుఁగల వ్యక్తిత్వము పశువువంటిది. కావున, అగ్నిష్టోమమునందొనర్పఁబడు పశ్వాలంభము— వ్యక్తిత్వనాశనమునకు చిహ్నమని తెలియవలయును. ప్రథమస్తబకమున దక్షయాగకథయొక్క- రహస్యము తెలుపఁబడినది. ఇచట కవి స్వానుభవమును ప్రసంగించి అగ్నిష్టోమముయొక్క- యాథార్థ్యమును వ్యాఖ్యానించెనని గ్రహించునది. (యజ్ఞమునందొనర్పఁబడు పశ్వాలంభము- వ్యక్తిత్వనాశమే అని తెలియనపుడదిస్వర్గకామమును సంపాదించునని తెలియునది.)

మూ. అగ్నిస్త్వం సోమస్త్వం త్వమధోజ్వలసి ద్రవస్యూర్ధ్వమ్ ।
అమృతమనయోః ఫలంత్వం తస్యచభోక్త్రీచిదమ్బ త్వమ్.౧౧

అమ్మా! అగ్నివినీవు, సోముఁడవు నీవు. నీవుక్రిందినుండి(మూలాధారమునుండి) జ్వలించుదానవు. నీవుమీఁదినుండి (సహస్రారమునుండి) ద్రవించుదానవు. నీవు అగ్నిషోమకార్యములగు జ్వలనద్రవణములకు ఫలమును భోగ్యమును అగు నమృతముకూడ నీవే. ఆయమృతమును భుజించునదియగు చిత్తు (చితి) కూడ నీవే.

ప్ర భ:- ఇట్లు భోక్త్రియగుచిత్తు, భోగ్యమగు అమృతము, జ్వలన- ద్రవణాత్మకయగు- భోగక్రియ, భోగకరణభూతులగు అగ్నిషోములు, అనుసర్వమునుగూడ నీవే యగుదువని భావము.

మూ. కిన్ను సుకృతంమయాకృతే మఖిలేశ్వరి! కింతప స్తప్తమ్ ।
క్రీడయసి మాం ప్రతిక్షణ మానన్దసుధానిధావన్తః. ౧౨

నేను ఏమి సుకృతము నొనర్చితినో, ఏతపము నాచరించితినో నన్ను ప్రతిక్షణమునందును ఆనందామృత సాగరాంతరమున క్రీడింపఁ జేయుచున్నావు.

ప్ర భ:- సుకృతమనగా; సత్కర్మానుష్ఠానము. తపమనఁగా: కాయక్లేశ జనకమగు చాంద్రాయణాదివ్రతముగాని, అనన్యవిషయమగు ధ్యానముగాని యగును. విచ్ఛేదము లేకుండ, ప్రతిక్షణమునందును నన్నానందసుధానిధియం దోల లాడించుచున్నావు. నేనొనర్చిన యేసుకృతమునకు లేక యేతపమునకు ఫలముగా, నాయందీయసాధారణమగు ప్రసాదము నొనర్చుచున్నావో నేనెఱుఁగనని భావము.

మూ. క్షాన్తంకిం మమదురితం, శాన్తంకిం దేవి! తే స్వాన్తమ్।
అనుగృహ్ణాసివిచిత్రం మామప్యపరాధినాం ప్రథమమ్. ౧౩

దేవీ! నాపాపము- క్షాంతమయినదా? నీస్వాంతము శాంతమ యినదా! అపరాధులలో ప్రథముఁడనగు నన్నుఁగూడ అనుగ్రహించు చున్నావు. ఆశ్చర్యము!

ప్ర భ:- క్షాంతము=సహింపఁబడినది. స్వాంతము=మనస్సు, శాంతము= శాంతినొందినది. నాపాపములను సహించి, తొలగించి నన్ను క్షమించి ప్రసన్ను రాలవైతివా? అనిభావము. అమ్మా! దోషులలో మొదటివాఁడనగు నన్నుఁగూడ అనుగ్రహపాత్రు నొనర్చుచున్నావు. ఇది యాశ్చర్యదాయకమగుచున్నది. కావున నిన్ను ప్రశ్నించుచున్నాను. "నీవు నాపాపము లను క్షమించి, వానిని తొలగించి, నన్నుక్షమించి ప్రసన్నురాలవైతివా?"

ప్రశ్న —అయ్యా! ఉమాసహస్రకర్తయగు మహాకవి- ఇచట- అపరాధు లలో తానేప్రథముఁడనని యేల చెప్పెను?

ఉత్తరము—లోకమందలి పాపము సమస్తమును స్వీయమే (తనదే) అని అభి మానించి— నేనే పాపాత్ములలో నగ్రగణినని చెప్పుచున్నాఁడు. కావుననే- యిం దలి ప్రథమశబ్దము ప్రథమగణ్యత్వమును స్ఫురింపఁజేయుచున్నది.

దానిచేత—"ఉదారచరితానాంతు వసుధైవ కుటుమ్బకమ్" ఉదారమగు ప్రవర్తనగలవారికీజగత్తే కుటుంబము. అనుసూక్తిననుసరించి, ఇచట నీకవియొక్క- "మహాసత్త్వత" వ్యంజింపఁజేయఁబడుచున్నది

మూ. కాలేకాలే సన్ధ్యారూపా నోపాసితా భవతీ।
విచ్ఛిన్నః స్మార్తాగ్ని స్త్రేతాకుతవవవహ్నీనామ్. ౧౪

శ్రౌత- స్మార్త కర్మానుష్ఠానములకు విధివిహితములగు కాలములయందు సంధ్యారూపయగు పరమేశ్వరినుపాసింపనయితిని. స్మార్తాగ్నినికూడ విచ్ఛిన్న మొనర్చితిని. (దాక్షిణాత్య-గార్హపత్య ఆహవనీయములను) అగ్నిత్రేత (త్రియము) యింకెక్కడ? అదియు విచ్ఛిన్నమే యయినది.

ప్ర భ:—శ్రౌతకర్మలనగా, శ్రుతిరూపమగు వేదమునందుఁ జెప్పఁబడిన కర్మలు. స్మార్తకర్మలనఁగా స్మృతిరూపములగు ధర్మశాస్త్రములయందుఁ జెప్పఁబడినకర్మలు. సంధ్యారూప=అహోరాత్రముల సంధియందుదయించిన కాలముసంధ్య అదియే। రూపముగాఁగల పరమేశ్వరి- సంధ్యారూప. "నేను- సాయంప్రాతస్సంధ్యావందనమునుగూడ చేయుటలేదు. వివాహమయినతరువాత నుంచఁబడి విచ్ఛిన్నమయిన, ఔపాసనాగ్నియగు స్మార్తాగ్నినిగూడ- మరల సంధింపనయితిని. స్మార్తాగ్నియే విచ్ఛిన్నమగునపుడు శ్రౌతాగ్ని= విచ్ఛిన్నమయినదని వేఱుగా చెప్పనక్కఱయేలేదుగదా:- ఇట్లు విధివిహితములగు శ్రౌత- స్మార్త కర్మల నొనర్పకున్నను, నాయందనుగ్రహించుచున్నావని భావము.

మూ. దాతుం నార్జితమన్నం బహుదేవేభ్యశ్చ భూతేభ్యః
యత్కిఞ్చిదార్జితం వా కలత్రపుత్రాన్వితోఽశ్నామి. ౧౫

దేవతలకొఱకును, భూతములకొఱకును ఇచ్చుటకు బహులమగు నన్నము నార్జింపనయితిని. ఏ కొంచెమో సంపాదించినను దానిని కలత్రపుత్ర సహితుఁడనై నేనే భుజించుచున్నాను. (అనుభవించుచున్నాను.)

ప్ర భ:- గృహస్థులకు కర్తవ్యములగు పంచమహాయజ్ఞములు- దేవ- పితృ- భూత- బ్రహ్మ- మనుష్య యజ్ఞములు.

"పూజా- సపర్యాఽధ్యయనం బ్రహ్మయజ్ఞస్తుతర్పణమ్।
హోమో దైవో బలిర్భౌతో నృయజ్ఞోఽతిథిపూజనమ్."

నేను వేదపాఠ పితృతర్పణములను విడిచి యితరములగు యజ్ఞములను అనఁగా వైశ్వదేవమును, భూతబలిని, అతిథిపూజనమునుగూడ చేయని స్వార్థపరుఁడనయితినని భావము.

మూ. కశ్చిదపిపాపహారి నపురశ్చరితశ్చ తే మన్త్రః
కం గుణ మభిలక్ష్యమము ప్రబుద్ధ్యసేఽ న్తర్జగన్మాతః. ౧౬
పాపహారియగు నీయొక్కమంత్రమును దేనినిగూడ పునశ్చ
రణము నొనరింపనయితిని. (యథోక్తసంఖ్యలచే జపింపనయితిని.)

జగజ్జననీ! నాయందుఁగల యేగుణము నభిలషించి (వీక్షించి) నాలో మేల్కొనుచున్నావు?

(ప్రభ:— పాపహారి=పాపములనునశింపఁజేయునది. పునశ్చరణము= ఒకానొకమంత్రమును దేనినయినను శాస్త్రోక్తమగు సంఖ్య ననుసరించి జపించుట. నేను మంత్రములనేకముల నెఱుఁగుదును. అయినను తంత్రశాస్త్రములయందుఁ జెప్పఁబడిన విధిననుసరించి జప పురశ్చర్యను గావింపనయితిని. నాయందెట్టి సుగుణమును గాన్పింపకున్నను నీవు నాహృదయమున మేల్కొనుచునే యున్నావు. ఇది యాశ్చర్యము గానున్నదని భావము.

మూ. తవమయి పృథక్ తనూజప్రేమాచేత్ పక్షపాతోఽయమ్।
అథవా సతాంనిసర్గః సోఽయంత్వయిచామ్బ! సమ్భావ్యః. ౧౭
అమ్మా! నీకు- నాయందు ప్రత్యేకమగు పుత్రప్రేమ యుండిన యెడల నది పక్షపాతము కావలయును. లేక (పక్షాంతరమున) సజ్జనుల కది స్వభావము కావచ్చును. (కావున) ఆపక్షపాతము నీయందుఁగూడ సంభవింపవచ్చును.

ప్రభ:— అమ్మా! లోకమునందున్నవారలందఱును నీకుదయించినవారే అయినను నీవు నాయందు విశేషించి ప్రీతిగలిగియుండుటకు పక్షపాతమే హేతువు కావలయును. అందఱకునుగూడ నీవొక్కతెవేగదా తల్లివి? (అనిచెప్పి) ఒకవేళ పక్షపాతముగూడ దోషము కాకపోవచ్చును. లోకమునందున్న సజ్జనులకుఁగూడ తమకుఁగల యనేక పుత్రులలో నొకనియందు పక్షపాతము కాన్పించుచున్నది, కావున నది నీయందును సంభావ్యమేయగునని యర్థాంతరన్యాసము చేయఁబడినదని గ్రహించునది.

ఇప్పుడు నేననుభవించుచున్న యత్యద్భుతమగు నీయోగానుభవ విశేషమునకు హేతువు- నీకు నాయందుఁగల పక్షపాతమేగాని, నాయొక్క- గుణ- కర్మాది- యోగసాధనవిశేషములు (హేతువు) కావనిభావము.

మూ. లక్ష్యం వినైవమన్త్రః కిం సిద్ధ్యతి కోటిశోఽప్యుక్తః
దధ్మస్తద్యదిలక్ష్యం తవరూపం గలతిహా! మన్త్రః. ౧౭

ఒకమంత్రము కోటిమార్లు జపించినను గూడ ధ్యానగమ్యమగు నాకానొకలక్ష్యమును విడిచినయెడల నేమిసిద్ధించును. ఆకారణమువలన లక్ష్యమగు నీరూపమును మనస్సుచేత ధరించితిమా! అయ్యో! (జప్యమానమగు) మంత్రమే తొలగిపోవుచున్నది.

ప్ర భ :— వెలుపలనున్న దేవవిగ్రహాదులయందుఁగాని, లోనున్న, ఆధారచక్రాదులయందుఁగాని ధ్యానముచే నెఱుఁగఁదగిన లక్ష్యమేదో యొకదానిని గుర్తింపక, ఊరకమంత్రమును వల్లెవేయుటవలన లాభములేదు. (లక్ష్యములేనిదే మంత్రసిద్ధి కలుగదు) అలాగని నీరూపమగు నాలక్ష్యమునే మనస్సుచేత ధ్యానించునెడల, జపించుచున్న మనస్సుచేత మంత్రము విడువఁబడుచున్నది. ఇది మహత్తరమైన కష్టమగుచున్నది.

మూ. సఙ్కల్పానాం వాచామనుభూతీనాం చయమూలమ్।
యత్రప్రాణోబద్ధస్తల్లక్ష్యం దేవి! తేరూపమ్. ౧౮

దేవి! సంకల్పములకు- వాక్కులకు- అనుభూతులకు- మూలము (ఉదయస్థానము) ఏదో, ఎక్కడ ప్రాణము బంధింపబడినదో, ఆ నీరూపము- (ధ్యానగోచరమగు) లక్ష్యము.

ప్ర భ:— వాక్, ప్రాణ, మనోఽనుభూతులకు మూలస్థానమగు నీరూపమే గమ్యస్థానమగు లక్ష్యభావము.

మూ. నైసర్గికస్వవృత్తే రహఙ్కృతేర్మూల మన్విష్య
త్వాంకిల సాక్షాత్కురుతే రమణమహర్షేరియందృష్టిః. ౨౦

స్వాభావికియగు ఆత్మీయవృత్తిగల అహంకృతియొక్క మూలమును- అన్వేషించి, చిత్స్వరూపిణివగు నిన్ను సాక్షాత్కరించుకొనెనట! ఇది (నాయొక్కగురుఁడగు)రమణమహర్షియొక్క దృష్టి(సాక్షాద్దర్శనము)

ప్ర భ:— స్వాభావికి=స్వభావసిద్ధము. ఆత్మీయవృత్తి=నిజవ్యాపారము. మూలము=ఉత్పత్తిస్థానము. అన్వేషించి=వెదకి. అహంకార మూలాన్వేషణమువలన మూలస్వరూప సాక్షాత్కారము కలుగుననునది శ్రీరమణమహర్షియొక్క స్వాను

భవ పూర్వకమగునుపదేశమని భావము. భగవానుండగు రమణమహర్షి ఉపదేశసార నందిట్లు ప్రవచించియున్నాడు.

> అహమయం కుతో భవతి చిన్వతః
> అయిపతత్యహం నిజవిచారణమ్.
> అహమ పేతకం నిజవిభానకమ్
> మహదిదంతపో, రమణవాగియమ్.

**మూ॥ మన్యేపర్వతకన్యే, మరుసేయమహాఙ్కృతిర్మహతీ**
**అవతరతా వర్షగణై - రపి తన్మూలం నలబ్ధమహో. ౨౧**

**పర్వతకుమారీ! ప్రస్తుతమగు ఈనాయహంకారము- బలిష్ఠమని తలంచెదను. ఏల? అనిన; బహువర్షములనుండియు శిరస్సునుండి హృదయమునకు అవతరించుచున్ననుగూడ నాకాయహంకృతిమూలము లభించినది కాదు. ఆశ్చర్యము! లేక లోకాంతరమునుండి యవతరించి ఎన్నోసంవత్సరములనుండియు ప్రియత్నించుచున్నను నా కాయహంకృతిమూలము లభింపకున్నది. ఆశ్చర్యము!**

ప్ర భ:— మనోవృత్తిస్థానమగు శిరస్సునుండి హృదయమునకుఁ యోగము చేత) పలువర్షములనుండియు అవరోహించుచున్నాను (లేక) వేఱొకలోకమునుండి యిచ్చటికివచ్చి చాలకాలమునుండియు ప్రియత్నించుచున్నాను, అయినను నాకాయహంకృతిమూలము లభించినది కాదు. కావున నాయహంకారము బలిష్ఠమయినదని భావము. "క్షీణేపుణ్యేమర్త్యలోకం విశన్తి" అని చెప్పుదురు. స్వర్గమునందున్నవారు- అహంకృతి మూలస్వరూపజ్ఞానమువలన మోక్షమునొందుటకు మానుష జన్మము నొందుదురనునది తత్త్వరహస్యము కావుననే శ్రుతియిట్లనుచున్నది.

"ఇహ చేద వేదీదథ సత్యమస్తి నచేదిహావేదీన్మహతీ వినష్టిః"

ఈ మనుష్యజన్మమునందే తెలిసికొన్నయెడల సత్యము లభించును. అట్లు తెలిసికొననియెడల గొప్పవినాశము కలుగును.

"మధ్యేవామనమాసీనం విశ్వేదేవా ఉపాసతే."

"శరీరమునందున్న హృదయమునందాసీనుఁడయిన వామనుని (పరమాత్మను) అందఱు దేవతలును గూడ ఉపాసించెదరు." కావున అహంకారమూలమును బడయుటకు పరలోకమునుండి నేనీలోకమున మానుషజన్మమునందితిని. ఇట్లవతరించినను ఇంతకాలమునకుఁగూడ అహంకారమూలస్వరూపము నొందనయితినని తాత్పర్యము.

మూ. ఏష ప్రౌఢో భగవతి! బహులం గర్జత్యహఙ్కారః।
ఏతస్మిన్నయి కాలే భవతీ చాబోధి కుణ్డలినీ. ౨౨

భగవతీ! మిగులబలిసిన నాయీయహంకారము- అధికముగా గర్జించుచున్నది. తల్లీ! ప్రౌఢమగు నహంకారము గర్జించుచున్న యీ సమయమునందు కుండలినీశక్తివగునీవుకూడ మేల్కొనుచున్నావు.

ప్ర భ:- గర్జించుచున్నది. దర్పముతో శబ్దించుచున్నది, ప్రౌఢము= ప్రవృద్ధము. మిక్కిలిబలిసినది, కుండలిని- ప్రబుద్ధమగునపుడు- అహంకారమునకు ప్రాబల్యముండఁగూడదు. అయినను అది- ప్రబలమేయగుచున్నది- కావున నది హంతవ్యమని ముందు చెప్పనున్నాఁడు.

మూ. తవ పశ్చాత్ సముత్థితిం జానాతి నసోఽయమద్యాఽపి
ప్రాగివ గర్జతి ధీరం బిభేతి మృత్యోర్న నేదిష్ఠాత్. ౨౩

ఆ యీ యహంకారము- నీపశ్చాత్ ప్రాదుర్భావమును (నీవు తరువాత ప్రాదుర్భవించుటను) ఇప్పటికిని తెలిసికొనకున్నది. కావుననే పూర్వమునందువలెనే ధీరముగా గర్జించుచున్నది. అత్యంతసమీపమగు మృత్యువువలనఁగూడ భయపడకున్నది.

ప్ర భ:— యోగసాధనమున పశ్చాన్మార్గమనియు, పురోమార్గమనియు- రెండుత్రోవలు రాజయోగసారమను గ్రంథమునఁ బ్రతిపాదింపఁబడినవి. "అంశే నావిశ్యాదౌ" 'యాతాయాతవిహారే' అను ఉమాసహస్ర ప్రథమశతకమునందలి నాల్గవస్తబకమునందున్న 5, 6వ శ్లోకములయందుఁగూడ- ఈపశ్చాన్మార్గ- పురోమార్గద్వయము విస్తరింపఁబడినది. (ఈయంశమును ప్రథమశతకమునఁ జూచునది.) అహంకారము తెలివిలేనిది. కావున తనవెనుక నీవావిర్భవించుచున్నావని యది యెఱుఁగదు. (అహంకారము నశించినతఱువాతనే కుండలినీప్రాదుర్భావము పూర్ణమగునని యర్థము.) అహంకారము ముందుండఁగా, భగవతియగు కుండలిని వెనుక మేల్కొని ప్రకాశించును. ఇదియే కుండలినివగు నీయొక్క పశ్చాత్ప్రాదుర్భావము. ఈనీ ప్రాదుర్భావమును- ముందుండిగర్జించుచున్న యహంకారమెఱుఁగదు. కావుననే వెనుక గర్జించినట్లే యిప్పటికిని గట్టిగా గర్జించుచున్నది. మృత్యువు తన్ను మిక్కిలియు సమీపించినదను భయముగూడ దానికిఁగలుగుటలేదు. (దానికి మృత్యుభీతికూడ లేదు) అని తాత్పర్యము. కావుననే నీకాయహంకారమును బలిగా నిచ్చెదనను చున్నాఁడు.

మూ. అతిపుష్టమహఙ్కారం పశుమేతం తుభ్యమర్పయతే
ప్రమథపతిప్రాణేశ్వరి! గణపతిరేకాన్త భక్తోఽయమ్. ౨౫

ప్రమథగణపతిప్రాణేశ్వరివగుజననీ! ఏకాంతభక్తుఁడగు ఈగణపతి- నీకొఱకు- అతిపుష్టమగు (బాగుగాబలిసిన) ఈయహంకారపశువును సమర్పించుకొనుచున్నాఁడు.

ప్ర భ:— ప్రమథగణములనఁగా, భూతసమూహములు. వానిప్రభువగు నీశ్వరుని ప్రాణములకు నీవీశ్వరివి. "నేను వేఱొకదేవతను విశ్వసింపని నీయంతరంగభక్తుఁడను. తెగబలసిన యీ నాయహంకారపశువును నీకు బలిగానిచ్చుచున్నాను. బలిసినపశు వేగదా? హోమమున కుపయుక్తమగు ద్రవ్యము. ఈబలిని స్వీకరించి కర్తవ్యమును నిర్వహింపుము" అని భావము.

మూ. ఉపగీతయోగణపతేః, ఉపతిష్ఠన్తామిమాః ప్రీత్యా।
ఉత్సవసహస్రలోలా ముకారవాచ్యస్యగృహనాథామ్. ౨౬

గణపతి కవికృతములగు- ఈ యుపగీతులు:—

ఉత్సవసహస్రలోలయు, ఉకారవాచ్యుఁడగు శివునియొక్క- గృహిణియునగు పార్వతిని ప్రీతితో సమీపించి సేవించుఁగాత!

ప్ర భ:—ఉపగీతులు=ఉపగీతివృత్తరచితములగు స్తుతులు. ఉత్సవసహస్రలోల=కుండలినీశక్తియొక్క- సంతతములగు విలాసములు- ఉత్సవసహస్రములు (ఉత్సేకములు) వానియందు చలించునది. ఉకారవాచ్యుఁడు ఉకారపదముచేఁ దెలియఁదగిన స్వరూపముగఁ గలవాడు.

ఇది సవ్యాఖ్యమగు చతుర్దశ స్తబకము.



ఓం నమో భగవతే శ్రీ రమణాయ,

శ్రీ భారతీ దేవ్యై నమః.

# ఉమా సహస్రము.

## పంచదశ స్తబకము

(చతుర్థ శతకమున తృతీయ స్తబకము)

అవ:— పదునైదవదియగు నీ స్తబకమున దేవీవైభవమును ప్రసంగించి ఇపుడు– తద్ధ్యాన ప్రకారమును ప్రస్తావించు చున్నాఁడు. [ఈయంశములు– శ్రీగణపతిమునీంద్రుల స్వానుభవములని తెలియునది]

మూ. ఆపదామపహరన్తు తతింనః
సమ్పదామపి దిశన్తు సమృద్ధిమ్ ।
దన్త కున్దరుచి దత్తబలాని
వ్యోమకేశ సుదృశో హసితాని.

శివుఁడు వ్యోమకేశుఁడు. ఆవ్యోమకేశుని కాంత– పార్వతి. మల్లెపూవులనుబోలినదంతముల కాంతులుగల శ్రీపార్వతీహసితములు మా యాపదలనన్నిటిని తొలఁగించుఁగాక! సంపదలనన్నిటిని సంఘటించుఁగాక!

ప్ర భ:– వ్యోమమనఁగా, ఆకాశము. ఆకాశమే జుట్టుగాఁగల శివుఁడు వ్యోమకేశుఁడు. ఆవ్యోమకేశుని కాంతయగు ఉమాదేవి దంతములు మల్లెపూవుల వలె నుండును. ఆదంతముల కాంతులు మాకు బలమునిచ్చునని చెప్పుటచేత– ఆహసితములు– శుభ్రములనియు, శోభావహములనియు, స్ఫురింపఁజేయఁబడుచున్నవి. "హసితములు" అనుచోటనున్న బహువచనముచేత– అవి క్షణక్షణమునందును వికసిల్లుచుండుటయు, మందములగుచుండుటయు, ధ్వనితము. ఆపదలనునివారించి, సంపదలను సంఘటించునవియగు దేవీమందహసితములు– ఈస్తబకముయొక్క ప్రారంభమునందుఁగూడ నిట్లుస్తుతింపఁబడినవని తెలియునది.

మూ. అల్పమప్యధికశక్తి సమృద్ధమ్
మన్దమప్యధిక సూక్ష్మవిసారమ్।
సుస్మితం స్మరవిరోధి రమణ్యాః
కల్పతాం మమకులస్య శుభాయ. ౨

అల్పమయినను- అనల్పశక్తిసమృద్ధమును, మందమయినను- అధికసూక్ష్మ విసారమును, అగు కామారిరమణీ సుస్మితము- మాకుల మునకు శుభము నొసఁగుఁగాత!

ప్రభ:-అనల్పశక్తిసమృద్ధము=అనల్పమగు=ఎక్కువయగు శక్తిచేత, పూర్ణము మందము—అలసము. అధికసూక్ష్మవిసారము=మిక్కిలి సూక్ష్మమగుచున్నను ప్రబల మగు వేగముచేత స్థూలదృష్టికిఁగూడ గోచరమగు ప్రసారముగలది. కామారిరమణీ, సుస్మితము=కామునకు శత్రువగు శివునియోషయగు పార్వతియొక్క సుస్మితము= శోభనమందహసితము. అల్పమయినను-అనల్పశక్తిగలదియు, మందమయినను అమం దమయిన ప్రసారముగలదియు అగుచు సకలకుల మంగలాధాన సమర్థమగు దేవీమం దస్మితము ప్రార్థింపఁబడినది. ఆసుస్మితము- కామ- విరోధికిఁగూడ-కామాధాయిని యనునర్థమువలన మూలమునందలి 'స్మరవిరోధిరమణీ' పదము (కామారి రమణిఅగు పదము) సాభిప్రాయమగుచున్నది. ఇట్లు- అంతటనుగూడ అన్యోన్యవిరోధమే చెప్పఁబడినది. మీఁదివిరోధము- సుస్మితప్రభావమువలన పరిహరింపఁబడుచున్నది. కావున నిది విరోధాభాసాలంకారమగును.

"హేతూనామసమగ్రత్వే కార్యోత్పత్తిశ్చసామతా"

సంపూర్ణమగుహేతువులేకున్నను కార్యముకలిగినట్లు చెప్పబడినయెడల నది కూడ విభావనయేయగును." అను చంద్రాలోకలక్షణము ననుసరించు నెడల నిది విభావనాలంకారమగును.

మూ. పుష్కరాద్ రవిమణ్డలభువమేతాం
భూమితశ్శశధరం క్రమమాణా
నైవముఞ్చతిపదం బతపూర్వం
నోత్తరం వ్రజతి నేశపురన్ధ్రీ.

ఈశ్వర పురంధ్రియగు జగన్మాత- పుష్కరమునుండి (పరమ వ్యోమమునుండి) సూర్యమండలమునకును సూర్యునినుండి భూమికిని

భూమినుండి చంద్రమండలమునకును పాదముచేత వెళ్లుచున్నను ముందుంచిన పదమును విడువనే విడువదు. ఉత్తరపదమునకు వెళ్ళకమానదు. ఇది యాశ్చర్యమగుచున్నది.

ప్ర భ:—పరమేశ్వరి- సృష్టికాదియగు పరమాకాశమునుండి బయలువెడలి సూర్యునియందు పాదమునుంచును. అక్కడనుండి భూమియందు పాదమునుంచి అచ్చటనుండి చంద్రునియందు పాదన్యాసము నొనర్చుచుండును. ఇట్లు పాదవిక్షేపము నొనర్చునపుడు, మొదట రవియందుంచిన పదమును విడువకయే, ఉత్తరపాదమును భూమియందుంచుచున్నది. ఈరెంటియందును ఉంచిన పదక్రమమును విడువకయే యెల్లప్పుడును చంద్రమండలమునందుఁగూడ పాదన్యాసము నొనర్చుచుండును. లోకులందఱును పూర్వపదమును విడిచియే ఉత్తరపదము నుంచుదురు- పరమేశ్వరి- అసాధారణమగు పదక్రమము కలది. కావున మాకాశ్చర్యము నుదయింపఁజేయుచున్నదని భావము. "భగవతి- ఒకవస్తువును సృజించి, ఇంకొకవస్తువును సృజించునపుడు పూర్వపూర్వసృష్టిని విడువదు. ఉపేక్షింపదు. అది యామహేశ్వరియొక్క అసామాన్యమగు విభూతి" అని తాత్పర్యము.

మూ. భూషణేష్వివ సవిత్రి! సువర్ణం
మృత్తికామివ ఘటేష్వఖిలేషు
విశ్వవస్తుషు నిరస్తవిశేషాం
దేవి! పశ్యతి సతీంవిబుధస్త్వామ్. ర

దేవీ! సవిత్రీ! భూషణములయందు సువర్ణమునువలెను, ఘటములయందు మృత్తికనువలెను; సర్వవస్తువులందును నిరస్తవిశేషవగు (నిర్విశేషవగు) నిన్ను- పండితుఁడు- సతినిగా (అభిన్నమగు సత్తామాత్రముచేత నున్నదానిగా) చూచును.

ప్రి భ:—హార- కేయూరాద్యులగు నాభరణములకు సువర్ణమే స్వరూపమగునట్లు, ఘటాదులకు మన్నే స్వరూపమగునట్లు 'సతి' అను పేరుగల నీవే సర్వమునకును గూడ స్వరూపమైయున్నావు. "వాచారమ్భణం వికారో నామధేయం మృత్తికేత్యేవసత్యమ్" "కుండ, మొదలగు వస్తువులన్నియు వికారములు. అవి మట్టియొక్క పరిణామములు. కావున నవియన్నియు వాక్కుచేఁ దెలుపఁదగిన నామములేకాని సత్యములు కావు. వానికి మూలమగు మట్టియే సత్యమయినది" అని ఛాందోగ్యోప

నిషత్తు వాకొనుచున్నది. కావున విశ్వమునందలి వస్తువులన్నియుఁగూడ సతి(సత్తా రూపిణి) వగుటవలన సర్వమయివగు నీకంటె వేఱుకానేరవు. కావున పండితుఁడు నిన్ను భేదములేనిదానవగు సతివని తెలియునని భావము. "విశ్వవస్తుషు నిరస్త విశేషః" అను వేఱొక పాఠముగూడ గలదు. సర్వవస్తువులయందును నిరసింపఁబడిన భేదముగల (అభేదము నవలోకించు) పండితుఁడు- సతిగా, అనఁగా. తానికియే స్వరూపముగాఁగలదానినిగా నిన్ను సాక్షాత్కరింపఁజేసికొనుననిదాని యర్థము.

మూ. కిట్టభూత మఖిలేశ్వరజాయే!
దృశ్యజాతమఖిలం నిజపాకే
ప్రాణ- బుద్ధి- మనసా మిహావర్గః
సారభూత ఇతి సూరిజనోక్తిః. ॥౫॥

సర్వేశ్వర సహధర్మిణివగుజననీ! స్వీయమగు (నీచేఁ జేయఁ బడుచున్న) పచనక్రియా (వంట) యందు- దృగ్గోచరమగు స్థూలవస్తు జాతమంతయుఁగూడ కిట్టభూతము (అసారాంశభూతమగు మలమువలె నున్నది) అగుచున్నది. ఇచట, ప్రాణ- బుద్ధి- మనోవర్గము- సార భూతము అని పండితవచనముగలదు.

ప్రి భ:—"కిట్టభూతము" "కిట్టం మలేఽస్త్రియామ్" అని యమరము. కావున కిట్టమనగా మలము. భూతపదమిచట స్వరూపవాచకముకాని సాదృశ్య పరముకాదు. కావున కిట్టభూతమనఁగా మలమువలె నున్నది అనియర్థము. ప్రాణ- బుద్ధి - మనోవర్గము = ప్రాణముల యొక్కయు, బుద్ధుల యొక్కయు, మనస్సులయొక్కయు సమూహము. సారభూతము = సారత్వమునొందినది. స్థూలమగు వస్తువంతయుఁగూడ—సారాంశము నావరించి మలమువలె నుండుచున్నది. దానిని వండునపుడు ఒక్కొక్కవస్తువునుగూడ, దానియందలిసారమును విసర్జించు చుండును. స్థూలము—మలమువంటి స్వరూపముగలదనియు, దానికంటె సూక్ష్మ మగునది తత్సారమనియు నభిప్రాయపడియిట్లు శ్రుతులుద్ఘోషించుచున్నవి. కావుననే మూలమున "సూరిజనోక్తిః" (పండితవచనముగలదు) అని చెప్పఁబడినది.

అదెట్లనిన:—

"పృథివ్యా ఓషధయః, ఓషధీభ్యోఽన్నం, అన్నాత్ పురుషః స వా ఏష పురుషోఽన్నరసమయః" "పృథివినుండి, దానిసారమగు ఓషధులును, ఓషధుల నుండి తత్సారమగు అన్నమును, అన్నమునుండి తత్సారమగు పురుషుఁడును, విస

ర్శింపఁబడుచున్నారు. ఆ యీ పురుషుఁడు- అన్నరసమయుఁడు'' అని తైత్తిరీయశ్రుతి యందు పురుషునకు సారభూతత్వము జెప్పఁబడినది. పృధివ్యా ఆపోరసః అపా మోషధయోరసః, ఓషధీనాం పురుషోరసః పురుషస్యవాగ్రసః, వాచఋుగ్ రసః,ఋుచః సామరసః సామ్న ఉద్గీథోరసః'' పృథివికి సారము- జలము.జలమునకు సారము- ఓషధులు. ఓషధులకుసారము- పురుషుడు. పురుషునకుసారము-వాక్కు- వాక్కునకుసారము-ఋుక్కు. (స్తుతి) ఋుక్కునకుసారము సామము (అనుభూతి ప్రకటనసమర్థమగు గానము) సామమునకు సారము- ఉద్గీథము, అని ఛాంధోగ్యము నందలి ఉద్గీథవిద్యాప్రస్తావమునఁ జెప్పఁబడినది. దీనివలన స్థూలమునుండి సూక్ష్మమును, సూక్ష్మమునుండి సూక్ష్మతరమును, సారాంశమను నంశము శ్రుతి ప్రోక్తమగుచున్నది. "అన్నమశితం త్రేధావిధీయతే'' అని యుపక్రమించిన ఛాం దోగ్యమునందలి ఆరవప్రపాఠకమున అన్నముయొక్క సారాంశము మనస్సనియు, జలముయొక్క సారాంశము ప్రాణమనియు, తేజస్సుయొక్క సారాంశము వాక్కు నియుఁ దెలుపఁబడినది. దృశ్యమగు నీబ్రహ్మాండమంతయుఁగూడ మనస్సూక్ష్మ దృష్టికి స్థిరమగువస్తువువలె భాసించుచున్నను, సర్వేశ్వరియగు మహాశక్తిచేత పరిపచ్య మానమై స్వసారమగు ప్రాణాదిరూపమున పరిణమించుచునే యుండుననునది కవి హృదయమని గుర్తించునది.

మూ. సారమీశ్వరి! తిలేష్వివ తైలం
విగ్రహేషు నిఖిలేషునిగూఢమ్
యేధియా మథనతోవిదురేకం
తే భవన్తి విబుధాస్త్వయిలీనాః. ॥౬

ఈశ్వరీ! తిలలయందు (నూవులయందు) తైలమువలె సకల శరీరములయందును, నిగూఢమగు (అంతర్గతమగు) సారమును అనఁగా, స్థిరాంశమగురసమును సూక్ష్మమగుబుద్ధిచేత మథించుటవలన తెలిసి కొనిన విద్వాంసులు- నీయందులయించి, నీస్వరూపమునొందుచుందురు.

ప్రభ:—నిగూఢము=గుప్తము, దాచబడినది. తిలేషుతైలం, దధనీవసర్పి, రాపఃస్రోతస్వరణీషుచాగ్నిః ఏవమాత్మాఽత్మని గృహ్యతేఽసౌసత్యే నైనంతపసా యోఽనుపశ్యతి॥ (శ్వేతాశ్వతరోపనిషత్ 1 అ 15 శ్లో)

నువ్వులయందు నూనెవలెను, పెరుగునందు నేయివలెను, నదులయందు జల ములవలెను, అరణులయందు అగ్నిహోత్రమువలెను, ఎవ్వఁడు ఈయాత్మను

(తన్ను) సత్యము చేతను, తపస్సు చేతను, చూచుచుండునో, వానిచేత నీయాత్మ-
తనదేహమునందే యీవిధమున గ్రహింపఁబడును. తనశరీరమునందే, అన్నమయమును
ప్రాణమయమునందును, ప్రాణమయమును మనోమయమునందును, మనోమయమును
విజ్ఞానమయమునందును విజ్ఞానమయమును ఆనందమయమునందును (ప్రవిలాపమును, ఉప
సంహారమును) చేయుటవలన పూర్ణానందరూపమయిన స్వాత్మరూపము తెలియఁబడు
చుండును. మనస్సునకును- ఇంద్రియములకునుగూడ ఏకాగ్రత కలుగుటయే తపము.
యథార్థము, ప్రాణిహితమునగువచనము సత్యము - ఈతపమును, సత్యమునుగలవాఁడే-
తనశరీరమునందే ఆత్మసాక్షాత్కారమును బడయునని తెలియునది.

మూ. ఆయసం త్రిభువనేశ్వరి! పిణ్డమ్
వహ్నినేవ తపసా తను పిణ్డమ్।
యస్య చిజ్జ్వలన జాలమయం స్యాత్
తప్తమస్య! స తవాలయ భూతః. ॥౧౨॥

త్రిభువనేశ్వరి! అగ్నిచేత తప్తమగు అయఃపిండమువలె, తపస్సుచే
త తప్తమగునెవ్వని తనుపిండము- చిదగ్నిజాల (సమూహ) మయమగు
చుండునో, వాఁడు, నీకు- ఆవాసస్థానమగును.

ప్ర భ:—అయఃపిండము=ఇనుపగుండు, తనుపిండము=శరీరమను ఘనపదా
ర్థము. చిదగ్నిజాలమయము=చైతన్యమనునగ్ని సంహతియొక్క వికారము. అగ్ని
జ్వలితమగు లోహపిండము- జ్వలనమయమగునట్లు తపస్తప్తమగు యోగిశరీరము-
జ్ఞానజాలమయమగును. ఏయోగికి- ఇట్లు జ్వలితమగు చిన్మయశరీరముండునో
అతఁడే ధన్యుఁడై, నీకు- ఆవాసస్థానమగునని తాత్పర్యము.

మూ. యోఽరణేర్మథనతోఽతి పవిత్రమ్
వీతిహోత్రమివ వీతకలఙ్కః।
ప్రాణముజ్జ్వలయతి స్వశరీరాత్
త్వామసావభయ దేహఽతియష్టుమ్. ॥౧౩॥

అభయప్రదవగు దేవీ! అపహతకళంకుఁడగు నేపురుషుఁడు-
అరణిని మథించుటవలన- అతిపవిత్రమగు అగ్నినివలె, స్వశరీరము
నుండి (జీవనహేతువగు) ప్రాణమును, మీఁదికి జ్వలింపఁజేయుచుండునో,
అతఁడు- నిన్ను యజించుటకు (పూజించుటకు) అర్హుఁడగుచుండును.

ప్రశ:—యజమానుఁడు— అరణిని మధించి, అగ్నినుజ్జ్వలింపఁజేసి, యజ్ఞము నొనర్చుటకు- అర్హుఁడగునట్లు- యోగి— తపోబలమువలన శరీరమునుండి ప్రాణమునుజ్జ్వలింపఁజేసియే నిన్ను పూజించుట కర్హుఁడగునని తాత్పర్యము- ఇదియే అంతర్యాగము. భగవతియగు నీశ్వరి- ఈయంతర్యాగముచేతనే సమారాధింపఁదగినదని ప్రతిపాదింపఁబడినది. శరీరమే— అరణి. తపోధ్యానాదికమే-మధనము. కుండలినీప్రేరితమగు ప్రాణజ్వాలయే- అగ్ని అని- ఉపమానోపమేయముల నెఱుఁగునది.

స్వదేహమరణిం కృత్వాప్రణవంచోత్తరారణిమ్
ధ్యాననిర్మథనాభ్యాసాద్దేవం పశ్యే న్నిగూఢవత్ ॥

(శ్వేతాశ్వతరోపనిషత్తు 1-14)

"విద్వాంసుఁడగుయోగి- తనశరీరమును- అధరారణిగాను, వేదాదియందును, వేదాంతమునందును ప్రతిష్ఠితమగు ఓంకారమును- ఉత్తరారణిగాను, చేసి, ధ్యానమను మధనముయొక్క అభ్యాసముచేత, అరణియందు గూఢమగు అగ్నినివలె, ఆత్మస్వరూపమును సమీక్షింపవలయును."

మూ. ప్రాణతా శ్వసిత మేవవిచార్యమ్
కుర్వతా కరణమేవ నిభాల్యమ్
గచ్ఛతా గమన మేవ విశోధ్యమ్
త త్తనా మథన మాగమ బోధ్యమ్. ౯

ప్రాణనమునొనర్చుచున్న (శ్వాసమునొనర్చుచున్న) జనుఁడు. (యోగి) శ్వసితమునే (ఊర్పునే) విచారించునది. పనిచేయుచున్నవాఁడు- పనినే సమీక్షించునది. గమించుచున్నవాఁడు- గమనమునే పరీక్షించునది. ఇదియే- (ప్రాణన- కరణ- గమనవిచారణమే) శరీరమునందు- ఆగమబోధ్యమగు మథనమగును. [ఊపిరితీయునపుడు- ఊపిరిని, పనిచేయునపుడు పనిని, నడచునపుడు నడకను, పరీక్షించుటయే- వేదోక్తమగు యోగమథనము]

ప్ర భ:—పూర్వశ్లోకమునందు మథనప్రసక్తి కలిగినది, కావున దానిస్వరూపమీశ్లోకమున వ్యాఖ్యానింపఁబడినది. ఊపిరిగొనునపుడు ఎట్లుశ్వసించుచున్నాను? ఊర్చుచున్నవాఁడెవ్వఁడు? అని విచారింపవలయును. ఇట్లే, పనిచేయుచున్నపుడు- ఎవఁడు పనిచేయుచున్నాఁడు= ఎట్లుచేయుచున్నాఁడు? అని బుద్ధిచేత నెఱుఁగ

వలయును. నడచునపుడు- ఎవఁడు గమించుచున్నాఁడు? ఎట్లుగమించును? అని యాలోచింపవలయును. ఈ మూడింటినిగూడ నిట్లు పరీక్షించుటయే దేహమున ప్రాణము నుజ్జ్వలింపఁ జేయునదియగు మథనమగునని నిగమాగమతాత్పర్యము. ఇది యొక్కటి గుర్తింపఁదగియున్నది. ఒకఁడు- పనిచేయుచున్నను, ఎచటికినిపోవుచున్నను గూడ- ఊపిరిపీల్చుట మానఁడు. ఊరక యున్నప్పుడుగూడ ఊర్పును సమీక్షించుచుండుట మథనమేయగును. కావున, ఊరకయున్నప్పుడును, పనిచేయుచున్నప్పుడును పోవుచున్నప్పుడునుగూడ- సర్వవిధములచేతను మథనము నొనర్పవలయునని భావము.

మూ. యోరసం పిబతి మూర్ధసరోజాత్
సోమపోఽయమనఘః ప్రియతాత్మా
అగ్నిహోత్రిమఖిలేశ్వరి! నిత్యం
మూలకుణ్డ దహనస్థితి రస్య. ॥౧౦౦॥

ఏ యోగి- శిరస్సునందున్న సహస్రారకమలమునుండి స్రవించుచున్న రసమును- ఆస్వాదించునో, ప్రియతాత్ముఁడగు నాయోగి యనఘుఁడు- సోమపుఁడు (సోమరసపాయి) అగుచున్నాఁడు. అఖిలేశ్వరీ! ఈసోమపునకు- మూలాధారమను కుండమునందలి యగ్నిస్థితి- నిత్యమగుటవలన నితఁడు- నిత్యాగ్నిహోత్రుఁడగును.

ప్ర. భ:— ప్రయతాత్ముఁడు=నియతమగు, అంతఃకరణము లేక, స్వభావము లేక శరీరముగలవాఁడు. అనఘుఁడు=పాపములేనివాఁడు. సోమపుఁడు=సోమమను రసము త్రాగువాఁడు. (లోకమునం దొనర్పఁబడు బహిర్యాగమున- నియతకాలము నందు, పరిశుద్ధమగు నాచారముగల యజమానుఁడు. కుండమునందలి యగ్నివలన సోమమునువండి- దాని నాస్వాదించి సోమపుఁడై పవిత్రుఁడగును. ఈయంతర్యాగమున మాత్రము కాలనియమములేక మూలాధారమను కుండమునందలి యగ్ని (ప్రాణాగ్ని) నిత్యముగ జాగరూకమై యుండుటవలన- యజమానుఁడగుయోగి ముందే పవిత్రుఁడై, శిరస్సునుండి స్రవించుచున్న సోమరసము నాస్వాదించి, సోమపుఁడగునని భావము.)

మూ. చిన్మయీ పిబసి సోమమిమం కిమ్
సోమ ఏవ కిము సా వసి మాతః!
పీయసే పిబసి చ స్వయమేకా
పేయపాత్రయుగలం కిము భూత్వా. ౧౧

మాతా! చిన్మయివై (భోక్త్రివై) నీవు ఈసోమమును ద్రావుచున్నావా? (లేక, త్రాగఁబడుచున్న యీసోమమే నీవా? ఒక్కతెవే యగు నీవు స్వయముగా పేయమవై (త్రాగఁబడు రసమై) త్రాగఁబడుచు, పాత్రివై (త్రాగుదానవై) త్రాగుచు, ఉన్నావా? (నీవు త్రాగుదానవా? త్రాగఁబడురసమవా? లేక రెండును నీవా?)

ప్ర భ:—సోమము=సహస్రారమునుండి స్రవించుచున్న రసము. (నీవే పాత్రివి', 'పేయమవు' అనుచు ఉభయధర్మము నవలంబించుచున్నావా?) చిన్మయి వగు నీకొక్కతికే భోక్తృత్వము-భోగ్యత్వము కలుగుచున్నదా? అనిభావము.

మూ. తైజసం కనక మగ్నివితప్తం
తేజ ఏవ కనకాఙ్గి! యథా స్యాత్
మోదరూపకలయా తవ తప్తం
తన్మయం భవతి మోదజ పిణ్డమ్. ౧౨

కనకాంగీ! అగ్నిచే విశేషించి తప్తమైన తైజసమగు (తేజోమయమగు) కనకము— తేజమే యగునట్లు— నీ యానందస్వరూపాంశముచేత తప్తమగు (తపస్సుచేత సాధింపఁబడి సంస్కరింపఁబడిన) **ఆనందజాతశరీరము— ఆనందమయమే యగును.**

ప్ర భ:—గనియందు పుట్టిన తేజస్సే- కనకమని చెప్పుదురు. కావున తైజసమగు కనకము అగ్నిచేత బాగుగా కాల్పఁబడి (మరల) తేజస్సే యగునట్లు—

"ఆనన్దాద్ధ్యేవ ఖల్విమాని భూతాని జాయన్తే"

"ఆనందమునుండియే యీప్రాణులు పుట్టుచున్నారు" అను శ్రుతివలన, ఆనందమునుండి జనించినశరీరము— నీయానందకలచేతనే సంస్కరింపఁబడి ఆనందమయమే యగునని తాత్పర్యము. (యోగానుభవ సంపన్నుఁడగు మహాకవి పూర్వోక్తశ్లోకములందువలె నిందును, మీఁదిశ్లోకముల యందునుగూడ స్వానుభూతిని ప్రదర్శించుచున్నాఁడని తెలియునది. ఇదియంతయు యోగిదృష్టమే యగును.

మూ. కాఽపి మోదలహరీ తవ వీచి
ర్నిర్గతా దశశతారసుధాబ్ధేః
పూరయత్యఖిలమమ్బ! శరీరం
నేహ వేద్మి పరమే జడభాగమ్. ౧౩

ఉత్తమురాలవగు నో అమ్మా! (దశశతారసుధాబ్ధినుండి) సహస్రారమను సుధాసాగరమునుండి వెలికివచ్చిన నీయొక్క ఆనందలహరియొకటి, నాకానొకతరంగము- (నా) శరీరము నఖిలమును కూడ (ఆత్మచేత) నిండించుచున్నది. నేను- ఈదేహమునందు జడమగుభాగమును (అచేతనాంశమును) తెలిసికొనకున్నాను.

ప్ర భ:—దశశతారసుధాబ్ధి=సహస్రారమను నమృతసముద్రము. సహస్ర + అర + కమలము=పదివందల రేకులు గలది. ఆసహస్రారకమలమునుండి నిర్గమించి, నాశరీరము నంతనుగూడ ఆత్మచేత నింపుచున్న నీ యానందసుధావీచికవలన_ 'నా శరీరమంతయు చిన్మయమే' అను అనుభవముకలిగించు అనిర్వచనీయమగు దశ-నాకు గలిగినదని భావము. (సహస్రారచక్రమునుండి ఇట్టిదని చెప్పుటకు వీలుపడని యేదోయొక ఆనందతరంగము నాశరీరమునంతను స్వరూపానందముతో నింపుచున్నపుడు అమృతానంద ప్రపూర్ణమయిన యీశరీరమునందు- ఏదిజడమో, ఏది చేతనమో, తెలిసికోరాని తన్మయస్థితి గలుగుచున్నదని భావము)

మూ. సేయ ముత్తమతమా నిపతన్తీ
శీతలాద్ దశశతార పయోదాత్
ప్రేరితాదఖిలరాజ్ఞి! భవత్యా
బుద్ధిసస్యమవతాద్రసవృష్టిః. ౧౪

అఖిలరాజ్ఞి! నాచేత నిప్పుడనుభవింపబడుచున్న ఉత్తమోత్తమ మగు రసవృష్టి- భగవతివగు నీచేత ప్రేరణముచేయబడినదై, శీతలమగు సహస్రారపయోదమునుండి క్రిందికి ప్రసరించుచున్నది. ఈ రసవృష్టి- బుద్ధిసస్యమును (బోధమనుధాన్యమును) రక్షించుగాత!

ప్ర భ:—శరీరమను క్షేత్రమునుండి యుదయించిన జ్ఞానమనుసస్యమును, సహస్రారమేఘమునుండి నిపతితమగుచున్న రసమనువర్షము- కాపాడుంగాక యని యర్థము.

శరీరమును క్షేత్రముగాను, జ్ఞానమును సస్యముగాను, రసమును వర్షముగాను జెప్పుటవలన నిందు రూపకము స్పష్టమగుచున్నది.

మూ. దుగ్ధ సిన్ధు మథనా దమృతంవా
శబ్దసిన్ధు మథనాత్ ప్రణవోవా
లభ్యతే సుకృతిభి స్తవవీచి
ర్మూర్ధకఞ్జమథనాద్రసవేషః. ॥౧౫॥

క్షీరసాగర మథనమువలన అమృతముపలెను శబ్దసాగరమథనమువలన ప్రణవమువలెను శిరః కమల మథనమువలన నీయానందవీచి యగు ఈరసము, పుణ్యవంతులకు లభించుచున్నది.

ప్ర భ:—శిరఃకమలము = సహస్రారము. క్షీరసముద్ర మథనమువలన, తత్సారభూతమగు నమృతము లభించునట్లును, శబ్దసమూహపరిశోధనమువలన తత్సారమగు ఓంకారము లభించునట్లును, సహస్రారమథనమువలన నీయానందకలయగు సోమరసము లభించునని భావము.

మూ. అస్థిషుప్రవహతిప్రతివేగం
మజ్జసారమమృతం విదధానా
బిభ్రతీమదమనుష్ణ మదోషం
మూర్ధకఞ్జ నిలయే తవధారా. ॥౧౬

శిరఃకమలనిలయవగు జననీ! నీసోమరసధార— అస్థులందున్న మజ్జసారమగు (ఎముకలయందలి సారమగు నేయియొక్క సారమగు) అమృతమును విస్తరింపజేయుచు, అనుష్ణమును, అదోషమును అగు మదమును (బోధవిశేషమును) ధరించుచు, ప్రతివేగమునందును ప్రవహించుచున్నది.

ప్ర భ:— శిరఃకమలనిలయ = సహస్రారమను కమలమున నివసించునది. మజ్జనశబ్దము నకారాంతమును, ఆకారాంత స్త్రీలింగమునుగూడ నగుచున్నది. మజ్జత్యస్థిషు ఇతి మజ్జా=అస్థిసారః' అనునదివ్యుత్పత్తి. "మదము"=బోధవిశేషము, లేక మత్తు. లోకసామాన్యమగుమదము— మరపునుకలిగించుట యను దోషముతోఁ గూడినదియు, తాపమును గలిగించునది యగు ఉష్ణము (వేడి)తోఁ గూడినదియు

నగుచున్నది. యోగాభ్యాసమువలన కుండలినీశక్తి-ప్రబోధింపఁబడినప్పుడు, సోమరసధారాసముదితమగు మదము— ఒకానొకజ్ఞానవిశేషమై యున్నది. కావున నది-దోషయుక్తముగాని, ఉష్ణసహితముగాని కానేరదు. కావున [illegible] శ్లోకము నిట్లెఱుంగునది. "నీయానందాంశమగు నీసోమరసధార- తాను ప్రవహించుచున్నంత కాలమును మజ్జయొక్క సారభూతమగు నమృతమును [illegible]జేయును, నిర్మలమును, సుశీతలమును నగుచు, బోధవిశేషరూపమగు మదమును ప్రవహింపఁ జేయుచుండును."

మూ. తైత్తిరీయకథితో రసలాభః
సోఽయమేవ సకలాగమవర్ణ్యే!
ఏతదేవ శశిమణ్డలనాథే!
తన్త్రభాషితపరామృతపానమ్. ॥౧౨॥

సర్వవేదస్తుత్యవగు జననీ! ఇదియే (ఇప్పుడనుభవింపఁబడుచున్నదియు, మజ్జయందు ప్రవహించుచున్నదియునగు సహస్రారసోమమే) తైత్తిరీయశ్రుతియందు కథితమగు రసలాభమగుచున్నది. ఓసోమమండలనాయికా! ఇదియే- తంత్రశాస్త్రములయందుఁ దెలుపఁబడిన, శ్రేష్ఠమగు అమృతపానమైయున్నది.

ప్ర భ:- తైత్తిరీయోపనిషత్తునందు, "రసోవైసః, రసంహ్యేవాయం లబ్ధ్వాఽఽనన్దీభవతి" "రసమే-పరబ్రహ్మము. ఈపురుషుఁడీరసమునే పొంది యానందముగలవాఁడగుచున్నాఁడు" అని చెప్పఁబడిన రసము- సహస్రారమునందలి సోమరసమే అని తెలియునది. ఈసోమరసాస్వాదనమే రసలాభమనియు సోమరసాస్వాదియగు పురుషుఁడే- ఆనందియనియు తెలియవలయును. వైదికులు- బహిర్యాగమున-సోమమనులతను దంచి, ఆ సోమరసమును పానము చేయునట్లు, తాంత్రికులలో నొకతెగకు సంబంధించినవారగు కౌలాచారులు- దేవికి, బహిర్నివేదితమగు సురామృతమును(కల్లును) పానము చేయుదురు. లోకమునందిట్లు వైదికులు యజ్ఞమునందు చేయుచున్న సోమరసపానమును, కౌలాచారులు చేయుచున్న దుష్టమగు సురాపానమును, తాత్త్వికములు (పారమార్థికములు) కావు. ఈరెంటియొక్కయు తత్త్వము-ఆదోషమును, అనుష్ణమునుఅగు, మదమనుఆనందలహరినిప్రవహింపఁజేయునదియగు సహస్రారమునందలి సోమరసముయొక్క ఆస్వాదనమే యనునది సిద్ధాంతము.

మూ. మూర్ధసోమమజరామర రూపే
యుక్తవీక్షణకరేణనిపీడ్య
శమ్భు సున్దరి! సునోమిధినోమి
త్వాం ప్రదీప్తకులకుణ్డ నిశాన్తామ్ ౧౮

అజరామరరూపిణీ! శివసుందరీ! (రసవంతమగు) శిరస్సునందలి సోమమును, యోగస్థితమగు వీక్షణమను హస్తముచేత పిండి—సవమును (యజ్ఞమును) చేయుదును. ప్రదీప్తమగు కులకుండాగ్నియందు నివసించుచున్న నిన్ను తృప్తినొందఁజేయుదును.

ప్రి భ:—(సవము) "సూయతే సోమోఽస్మిన్నితిసవః" దీనియందు సోమము తడుపఁబడును—గావున యజ్ఞము—సవమని చెప్పఁబడును. కులకుండాగ్ని=మూలాధారమునందలి యగ్ని. యజమానుఁడు—యాగము నొనర్చునపుడు, అభిషవణఫలకమునందు (సన్నికంటియందు) సోమమును నూరి, రసమునుపిండి— సవము (యజ్ఞము) నొనర్చునట్లు, నేను శిరస్సునందలి సోమమును యోగదృష్టిచేత గదలించి. తదుపరి రసమునుగొని, సవమునొనర్చి, మూలాధారస్థితవగు నిన్నుతృప్తినొందింతునని భావము. హస్తము బహిర్యాగమున నిష్పీడనసాధనమగునట్లు యోగదృష్టి—యీ యంతర్యాగమున నిష్పీడనసాధనమగుచుండును. ఇట్లు— అగ్నీషోమీయమను అంతర్యజ్ఞము—నాచేఁ గావింపఁబడుచున్నదని తాత్పర్యము.

మూ. దృష్టిరేవ రవిదీధితి రుగ్రా
శీర్ష కఞ్జ శశినం ప్రవిశన్తీ
శీతలామృతమయీఖలుభూత్వా
యోగినోద్రవతి మోదకలా తే. ౧౯

యోగదృష్టియను ప్రచండమగు సూర్యదీధితి— సహస్రారకమలస్థుఁడగు సోమునియందు ప్రవేశించి శీతలామృతమయియై నీ యానందకళయగుచు స్రవించుచుండును.

ప్ర భ:—దీధితి=కాంతి. చంద్రునకు స్వయంప్రకాశము లేదు. ఉష్ణమగు సూర్యకాంతియే, చంద్రబింబమునందు ప్రతిఫలించి శీతలమై వెన్నెలయగుననునది—జ్యోతిశ్శాస్త్రసిద్ధాంతము. దేవియే— మొదట యోగియొక్క— యోగదృష్టియై సహస్రారమునందుఁ బ్రవేశించి, తరువాత, శీతలామృతమయి యగు ఆనందలహరిని ధరింపఁజేయునని భావము.

మూ. మూర్ధని ద్రవసి యోగ యుతానాం
చక్షుషి జ్వలసి శఙ్కరభామే!
తిష్ఠసిస్థిరపదాకులకుణ్డే
బాహ్యతఃస్ఖలసి నైవ కదాఽపి. ౨౦

ఓశివప్రియా! యోగయుతుల (నిత్యయోగుల) శిరస్సున(సోమ స్వరూపిణివై ద్రవించుచుందువు. వారిదృష్టియందు(దృష్టివై) జ్వలించుచుందువు. కులకుండమునందు స్థిరపద్రవైయుందువు.

(ఈ స్థానములకంటె) వెలుపల నెప్పుడునుగూడ చ్యుతినొందవు.

ప్ర భ:- స్థిరపదవై=స్థిరమగు స్థానముగలదానవై, కులకుండము=మూలాధారము, చ్యుతినొందవు=తప్పివసించవు. నిత్యయోగుల శిరోఽక్షి మూలాధారములయందు స్థిరపడిన నీవు వానినుండి యెన్నడును తొలగవని భావము.

మూ. సాయదిద్రవతి మోదకలాస్యాత్
సాయది జ్వలతి చిత్ కలికాస్యాత్
సాపరాస్థిరపదా యదితిష్ఠ
త్యక్షరా భవతి కాచనసత్తా. ౨౧

ఆదేవి- ద్రవించునెడల ఆనందకలయగును. ఆదేవి- జ్వలించు నెడల చిత్ కలిక యగును. ఆపరదేవత- స్థిరపద యగునెడల అక్షర యగు నొకానొక సత్తయగును.

ప్ర భ:—ఆనందకల=ఆనందాంశము- ఆనందమయి. చిత్ కలిక=చిత్తేయగుకలిక- చిన్మయి. సత్తా=ఉనికిగలది. సతి. ఒక్క తెరయేయగు పరమేశ్వరి సోమాత్మికయై- ఆనందమయి, తేజోరూపిణియై చిన్మయి, అక్షరస్థితియై సతి, అగునని, క్రియా-స్థాన భేదముచేత త్రిత్వము చెప్పఁబడినను- చిదానందమయియగుసతి- సర్వమునుగూడ తానేయగునని భావము.

మూ. పశ్యతా నయన మణ్డలవృత్తిం
గృహ్యతే త్వ మచలాధిప కన్యే!
జానతా దశశతార విలాసం
స్పృశ్యసే విదితమమ్బ! రహస్యమ్. ౨౨

అచలేంద్రకుమారీ! మండలాకారములగు నేత్రములప్రవృత్తిని (దర్శనక్రియను)చూచుచున్న యోగికి నీవు లభించుచుందువు. (రసవర్ణాత్మకమగు) దశశతార విలసితమును (సహస్రార విలాసమును) గ్రహించుచున్న యోగి నిన్ను స్పృశించును. అమ్మా! రహస్యము తెలిసినది!

ప్ర భ:—రసవర్ణాత్మకము=సోమరసమును వర్షించుట స్వరూపముగా, గలది. దశశత + అర + విలసితము=పదినందల దళములుగల సహస్రారముయొక్క విలాసము. దృష్టికి ద్రష్టయగు యోగికి నీవులభింతువని యర్థము. దృష్ట్యుపాసనము చేత చిన్మయివగు నీయొక్క సాక్షాత్కారమును, సహస్రారామృతదానముచేత ఆనందమయివగు నీయొక్కప్రాప్తియు, యోగికి సిద్ధించును. ఈ రహస్యమును నే నిప్పుడెఱిఁగితినని భావము.

మూ॥ వ్యాప్తశక్త్యసుబలేన లసన్తీ
భానుబిమ్బనయనేన తపన్తీ
చన్ద్రబిమ్బమనసా విహరన్తీ
సాపునర్జయతి మూర్ధ్నివసన్తీ. ౨౩

వ్యాపించిన శక్తియగు ప్రాణబలముచేత వ్యాపారము నొనర్చునదియు, భానుబింబమగు నేత్రముచేత తపము నొనర్చునదియు; చంద్రబింబమగు మనస్సుచేత విహారము నొనర్చునదియు నగు దేవి– మరల దేహమునందలి సహస్రారమున వసించుచు జయించుచున్నది.

ప్ర భ:—పరమేశ్వరికి బ్రహ్మాండమున వ్యాపించిన శక్తియే– ప్రాణము. సూర్యుఁడే–కన్ను. చంద్రుఁడే–మనస్సు. "చన్ద్రమా మనసోజాతః చక్షోః సూర్యో అజాయత" అను శ్రుతిచేత, సూర్యుఁడు నయనస్వరూపుఁడనియు, చంద్రుఁడు మానసస్వరూపుఁడనియుఁ దెలియుచున్నది. ఏతత్ కవికూడ స్వవిరచితమగు శివ శతకము నందియంశము నిట్లు తెలిపియున్నాఁడు. "సౌరం మణ్డలముజ్జ్వలంతవతపః, శ్వాసశ్చరన్ మారుతః." సూర్యమండలము– ఉజ్జ్వలమగు నీతపస్సు. చరించుచున్న వాయువు - నీశ్వాసము. ఆదిత్యుఁడు–తపస్సు– చక్షుస్సు– కూడ నగునను అంశము శ్రుతియందుఁగూడ ప్రతిపాదింపఁబడినది. ఇట్లు– బ్రహ్మాండశరీరయగు భగవతి పిండాండమగు సహస్రారమునందుఁగూడ విలసిల్లు చుండునని భావము.

మూ. స్వాగతం సకలలోకనుతాయై
స్వాగతం భువనరాజ మహిమ్నై
స్వాగతం మయిభృశం సదయాయై
స్వాగతం దశశతార మితాయై. ౨౮

సకల జగద్ వందితయగు దేవికి- స్వాగతము. సర్వేశ్వరత్వాద యేశ్వరికి_స్వాగతము. నాయందు సదయమగు పరమేశ్వరికి- స్వాగతము. సహస్రారనివాసినియగు జననికి- స్వాగతము.

ప్ర భ:—స్వాగతము= (మహాదేవియొక్క శుభాగమన విజయము గోరునది యగు ప్రీతిగౌరవవచనము) దయచేయుము అను గౌరవము. సదయా=కరుణతోఁ గూడినది. ఈదృశములగు యోగానుభూతుల ననుగ్రహించి స్వీయకృపను ప్రద ర్శించిన పరమేశ్వరికి స్వాగతము అని యర్థము. సర్వలోక సంస్తుతయు, సర్వేశ్వర నాయికయునగు పరమేశ్వరియే నాయందు దయబూని, నాసహస్రారమున విల సిల్లుచు, విజయము నొందుచున్నదని భావము. యోగియగుకవి పరమేశ్వరి- తన యందు శాశ్వతముగా నిలుచుట కీస్వాగతవచనమును స్తబకమును ముగించునపుడు సమర్పించెనని తెలియునది.

మూ. సత్కవిక్షితిభుజో లలితాభిః
స్వాగతాభి రనఘాభి రిమాభిః
స్వాగతం భణితమస్తు భవాన్యై
ఖేలనాయ శిర ఏతదితాయై. ౨౯

సత్ (ప్రశస్త) కవి లోకరాజునకు సంబంధించిన దోషరహితలు, లలితలునగు ఈ స్వాగతలచేత ఈశిరస్సు (సహస్రారకమలము) నం దాడుకొనుటకు వచ్చిన భవానికి స్వాగతము చెప్పఁబడుఁగాత!

ప్ర భ:—దోషరహితలు - దోషములేనివి, లేక లక్షణసంపన్నలు, లలితలు= కోమలపదములు లేక సుందరగాత్రులు. స్వాగతలు=స్వాగతవృత్తములు లేక అన యాసముగా వచ్చిన స్త్రీలు. ఇచట ప్రకృతార్థపరములగు పదములచేత సూచ్యార్థ మగు స్తబకవృత్తమును సూచించుటవలన ఇది శ్లేషోత్థాపితమగు ముద్రాలంకార మగుచున్నది.

ఇది సవ్యాఖ్యమగు పంచదశ స్తబకము.

ఓం నమో భగవతే శ్రీ రమణాయ,

శ్రీ భారతీ దేవ్యై నమః.

# ఉమా సహస్రము.

## షోడశ స్తబకము

(చతుర్థ శతకమున చతుర్థ స్తబకము)

అవ:- పదునారవదియగు, కుమారలలితావృత్తనిబద్ధమును, అగు స్తబకము- ప్రారంభింపఁబడుచున్నది. యోగానుభవమునకు అనురూపమగు స్తుతి- పూర్వ స్తబకమునందువలె యిచ్చటను గావింపఁబడుచున్నది.

మూ॥ మహోవిహతమోహం మహేశమహిలాయాః

స్మితం వితనుతాన్మేగృహేషు మహమగ్ర్యమ్. ౧

తేజస్సుచేఁ దొలఁగింపఁబడిన మోహముగలదియగు మహేశ్వరీ మందహసితము- నాగృహములయందు ప్రశస్తమగు నుత్సవమును విస్తరింపఁజేయునుగాత!

ప్ర భ:- మోహము-అనాత్మయందగు నాత్మాభిమానము-అసత్యమగుజ్ఞానము, గృహములయందు' అనుచోనున్న బహువచనమువలన "నేను ఎచ్చటనెచ్చట వసించుచుందునో, అక్కడ నక్కడ, మోహమును తొలగించునదియగు మహేశ్వరీ మందహసితముయొక్క కార్యమగు మహోత్సవము నాకు లభించునుగాత" అను భావ మేర్పడుచున్నది. నాయందు ప్రసరించిన మహేశ్వరీమందస్మిత విలసితముచేత దూరీకృత మోహమగు మహోత్సవము నేనున్న స్థలములందంతటను గూడ ప్రచలితమగుఁగాత మనునర్థము గమ్యమగుచున్నది.

మూ॥ ఇయద్బహులగోలం జగల్లఘుదధానా

సితామహముఖైరప్య ఖణ్డితవిధానా. ౨

ఇట్లు- ఇంతబహుళగోళమగు జగత్తును తేలికగా భరించుచున్నదియు, పితామహాదుల (బ్రహ్మాదుల)చేతఁగూడ ప్రతిహతము

కాని కార్యవిధానములుగలదియు (అగు ఉమాదేవి– నాకు చాలినంత బలమునిచ్చుఁగాక !) అని అయిదవశ్లోకముతో నన్వయించునది.

ప్రి భ:—'విశాలదృష్టితో హస్తనిర్దేశముచేత ప్రదర్శించి 'ఇంత' అని చెప్పుచున్నాఁడు' అని గ్రహించునది. ఆకాశమున నక్షత్రములవలెఁ గనఁబడుచు, లెక్కకురానన్ని భువనగోళములుగల యీజగత్తునంతను శ్రమలేకుండ భరించుచు, బ్రహ్మాదులగు నధికారులచేత నాటంకము చేయఁబడని శాసనముగల మహేశ్వరి నాకు చాలినంత వీర్యము నొసఁగుఁగాత! అనియర్థము.

మూ॥ అదుష్టచరితేభ్యః, శుభాన్యభిదధానా
కులాని మలినానాం హతాని విదధానా. 3

దోషదూషితములుకాని యాచారములుగల శిష్టులకు మంగళములను వచించునదియు, పాపాత్ముల కులములను నశింపఁజేయునదియు, (అగు నుమ–నాకు చాలినంత బలమునిచ్చుగాత !)

ప్రి భ:—'వచించునది' అనగా సంఘటించునది యనియే యర్థముగ్రహింపవలయునుగాని చెప్పునదియని గ్రహింపఁగూడదు.

మూ॥ దుకూలమరుణాంశుప్రిభం పరిదధానా
హరస్య రజతాద్రిక్షితీశితురధీనా. ౪

బాలసూర్యకాంతి సదృశమగు(ప్రాతస్సంధ్యారాగరంజితమగు) దుకూలమును ధరించి రజతగిరి (కైలాస) నాథునకధీనమైన ఉమ నాకు చాలినంత బలమునిచ్చుగాత!)

ప్రి భ:—రజతాద్రి (వెండికొండ) నేలుచున్న తెల్లనిమేనుగల హరునికి రాగము నుదయింపఁజేయుటకు— అరుణవసనము సమర్థమగును. కావునమీఁదిశ్లోకమునందలి– రజత– అరుణపదప్రయోగము– ఔచిత్యప్రకర్షకమని తెలియునది.

మూ॥ మునీంద్రకృతతన్త్రప్రసిద్ధ బహుదానా
ఉమాబలకలావ న స్తానోత్వతులమానా. ౫

ఋషిశ్రేష్ఠులచేత విరచితములగు తంత్రశాస్త్రములయందు ప్రసిద్ధమగు, అమితదానముగలదియు, సరిలేని పరిమాణము గలదియు (అప్రిమేయయు) అగు ఉమ– నాకు చాలినంత బలమునిచ్చుగాత!

ప్ర భ:—మునీంద్రుల వాక్కులు వ్యర్థములు కావు. వారు రచించిన తంత్రశాస్త్రగ్రంథముల యందీయుమ- భక్తుల యభీష్టములనెల్ల నొసఁగునను నంశము ప్రసిద్ధమైయున్నది. ఈ యుమాస్వరూపమును నిశ్చయించుటకు వీలుపడదు. కావున సంపూర్ణశక్తియగు ఆపరమేశ్వరి ఉమ- నాకు బలమును సంఘటించుగాత! 2, 3, 4 శ్లోకముల యర్థముతోఁ జేర్చి యీ అయిదవ శ్లోకమునందలి యర్థమును సమన్వయింపవలయును.

మూ॥ నిరస్తవిషయాం యద్ దధాతిమతికీలామ్
సమస్తజగదీశే ధృతిస్తవమతేయమ్. ౬

సమస్తభువనేశ్వరీ! శబ్దాదివిషయములను నిరసించునట్టియగు బుద్ధిజ్వాలను ధరించుటయే- నిన్ను ధరించుట. (నీయొక్క-ధృతి) అని మతము.

ప్ర భ:—శబ్ద- స్పర్శ- రూప- రసగంథములు 5ను విషయములని చెప్పఁబడును. నిరసించుట యనగా, నిరాకరించుటయని యర్థము. నిర్విషయమగు బుద్ధిని విరామము లేకుండునట్లు ధరించుటయే పరమేశ్వరిని ధరించుట అని తాత్పర్యము.

మూ॥ శ్రుతా ప్రవణచిత్తం స్మృతా నరమపాపమ్
ధృతాహృది విధత్సే గతస్వపరభావమ్. ౭

నీవు- శ్రుతవై - మనుష్యుని ప్రవణచిత్తునిగను స్మృతవై, పాపరహితునిగను, హృదయమునందు ధృతవై, స్వ-పరభావశూన్యునిగను చేయుచుందువు.

ప్ర భ:—"నిన్ను గురించి వినువాఁడు- నీయందాసక్తుఁడును, నిన్ను స్మరించువాఁడు- నిరాకృతపాపుఁడును, నిన్ను హృదయమున ధ్యానించువాఁడు- తాను-పరుఁడు అను భేదబుద్ధిని విడుచువాఁడును అగును" అని భావము.

మూ॥ అహంమతితటిన్యాః సతామవని! మూలమ్
త్వమేవకిల సేయం మహర్షిరమణోక్తిః. ౮

సజ్జనపాలనీ! అహంమతియను సరిత్తుకి మూలము నీవేయగుదువట ! ప్రసిద్ధమగునిది- మహర్షి రమణోక్తి.

ప్ర భ:—'నేను' అనుబుద్ధి యుదయించుచోటు చిత్ స్వరూపము- అని అస్మద్గురువు రమణమహర్షి యుపదేశము. స్రవంతికి (నదికి) జన్మస్థానము- అచలమే (కొండయే) యగును. కావున స్రవంతీ శబ్దసామర్థ్యమువలన అహంకారమూలము- అచలము (చలింపనిది) అనునర్థము- ఆక్షేపింపఁబడుచున్నది. అహంమూలాన్వేషణమువలననే జ్ఞానప్రాప్తి కలుగునని భావము. "అహమితిస్ఫురతిః క్వానువిభాసతే ఇదమనుస్మరణ, సపదిలీయతే" అని రమణోపదిష్టముగదా!

మూ. అహం మతిలతాయా స్త్వయీశవధు కన్దే।
స్థితోఽన్మ్బ! భువనస్య ప్రవిన్దతి రహస్యమ్.        ౯

ఈశ్వరకాంతవగు నంబా! అహంమతియను లతకు కందమగు (దుంపవగు)నీయందు వసించుయోగి-ప్రపంచరహస్యమును దెలిసికొనును.

ప్ర భ:—అహంమతి='నేను' అనుబుద్ధి. అదియే లతగా రూపింపఁబడినది. కందమనఁగా, దుంప, లేకమూలము, అనునర్థములు గలవు, నేననుబుద్ధికి మూలము చిత్ స్వరూపమగు నీవే యగుదువు. చిత్స్వరూపమగు నీయందున్నయోగికి లోకము యొక్క వాస్తవమగు తత్త్వము తెలియునను నీయర్థము- అహంధీ-లతలకును-అంబా-కందములకునుగల తాదూప్యము చేతఁ దెలియఁ జేయఁబడినది.

మూ. యదేత దఖిలామ్బ! ప్రసిద్ధమివదృశ్యమ్
త వైవకేలజాలం గతోభణతి మూలమ్.        ౧౦

సకలజననీ! ప్రసిద్ధము (నిశ్చితము) వలె దృశ్యమగుచున్న యీప్రపంచమును, అహంమతిమూలమును సాక్షాత్కరించుకొనిన యోగి- నీకు సంబంధించినదేయగు జాలమని (జాలవిద్యయని, మాయయని) చెప్పుచున్నాఁడు. (కావుననే యతఁడు ప్రపంచరహస్యమును దెలిసినవాఁ డగుచున్నాఁడు.

ప్ర భ:—నేను అనుబుద్ధికి మూలమగు స్వరూపమునొందిన యోగి, ఈదృశ్యమంతయు నిశ్చితసత్యమువలె భాసించుచున్నను- ఇది కేవలమును మాయికమే యని తెలిసికొనుచుండును. కావుననే యట్లుచెప్పుచున్నాఁడు. కావుననే "ప్రపంచ రహస్యమును తెలిసికొనును. అను పూర్వశ్లోకార్థమును దీనితో నన్వయింపవలయును.

మూ. ప్రపశ్యతి పరాచీ జగద్ వివిధభేదమ్ ।
స్వాతః కిమపినాన్యత్ ప్రతీచిస్ఫురతస్తే. ౧౧

అమ్మా! నీవు బహిర్ముఖివై, జగత్తును వివిధభేదముగా వీక్షించుచున్నావు. ఓ యంతర్ముఖీ! నీయెదుట– నీకంటె (స్వరూపము కంటె– ఆత్మకంటె) ఇతరమేదియు లేదు.

ప్ర భ:— నీవు పరాగ్దృష్టివై (వెలుపలఁ జూచుదానవై) నానారూపమగు భేదమును జూచుచున్నావు. కావుననే ప్రపంచస్థితి కలుగుచున్నది. అంతర్దృష్టి (లోచూపుగలదాన) వగునపుడు సర్వమును నీవే యగుచున్నావు. నీకంటె వేరయిన వస్తువేదియు లేదని భావము.

మూ. స్తుతా భవసి శశ్వత్ స్మృతా చ భజనే త్వమ్
ధృతా భవసియోగే తతా భవసి బోధే. ౧౨

నీవు భజనమునందు స్తోతలచే స్తుతవును, ఎల్లప్పుడును ధ్యాతలచే స్మృతవును, యోగమునందు యోగులచే ధృతవును, జ్ఞానమునందు జ్ఞాతలచేత తతవును, అగుచున్నావు.

ప్ర భ — స్తుతవు = వినుతింపఁబడిన దానవు.
స్మృతవు = స్మరింపఁ బడినదానవు.
ధృతవు = ధరింపఁబడిన దానవు.
తతవు = వ్యాపించిన దానవు.

అవ:— మీఁదఁ దెలుపఁబడినస్తుతి– స్మృత్యాదులవలనఁ గలుగు ఫలమిఁక క్రిందిశ్లోకముచేఁ జెప్పఁబడుచున్నది.

మూ॥ స్తుతా దిశసి కామం
స్మృతా హరసి పాపం
ధృతాఽస్యధికశక్త్యై
తతా భవసి ముక్త్యై. ౧౩

స్తుతవై యభీష్టము నిచ్చెదవు.
స్మృతవై పాపమును హరించెదవు.

ధృతస్సై అధికశక్తి నొసంగెదవు.
తతస్సై మోక్షమును ఘటించెదవు.

ప్రభ:—నిన్ను స్తుతించిన స్తోతకు గోరికను దీర్చెదవు. నిన్ను ధ్యానించిన ధ్యాతను పవిత్రీకరించెదవు. యోగముచేత నిన్ను ధరించినయోగికి సమృద్ధమగు శక్తిని ఘటించెదవు. జ్ఞానసిద్ధికై వ్యాకించుదానవై జ్ఞాతకు మోక్షమును సాధించెదవు. స్తోత్రము-అభీష్టదము. ధ్యానము-పాపఘ్నము. యోగము- శక్తిదము. జ్ఞానము-ముక్తిప్రదము. అనునది ఫలితార్థము. (ఉమాదేవిని స్తుతించినవారికి కోరికలు ఫలించును. ధ్యానించినవారికి పాపములు తొలఁగును. ఉమాస్వరూపమును ధరించినవారికి గొప్పశక్తులు కలుగును. వ్యాప్తమగు ఉమాస్వరూపము నెఱిఁగినవారికి మోక్షము కలుగును. అని తెలియునది.)

మూ॥ విశుధ్యతి యతాశీ, ప్రమాద్యతి నశుద్ధః
ప్రమాదరహితస్య స్ఫుటేలసనికఞ్జే. ౧౪

ఆహారనియమముఁగలవాఁడు- విశుద్ధుఁడగును. అట్లు విశుద్ధుడగువాఁడు ప్రమాదము నొందఁడు. ప్రమాదరహితుని సహస్రారకమలము వికసించును. ఆకమలమునందు నీవు లసింతువు (క్రీడింతువు)

ప్రభ:—నియతమగు నాహారమువలన విశుద్ధియు, విశుద్ధివలన అప్రమాదమును, అప్రమాదమువలన సాధకుని సహస్రారకమలమున దేవి లసించుటయు, అని యిచట గృహీత- ముక్తరీతి ననుసరించి వస్తుస్తోమము వర్ణింపఁబడినది. కావున "గృహీత- ముక్తరీత్యార్థ శ్రేణిరేకావలిర్మతా" అను లక్షణమువలన నిది యేకావళియను నలంకార మగుచున్నది.

మూ॥ స్ఫుటం యది సరోజం నటీవ పటు నాట్యమ్
కరోషి యతబుద్ధేర్జగజ్జననిశీర్షే. ౧౫

జగజ్జననీ! సహస్రారకమలము- స్ఫుటమగునపుడు (వికసించునపుడు) యతబుద్ధియగు (మనస్సును వశీకరించుకొనిన) యోగియొక్క శీర్షమున (రంగస్థలమున) నటివలె నిపుణముగా నటించుచుందువు.

మూ॥ శిరోగతమిదం నః ప్రఫుల్లమివపద్మమ్
అనల్పమకరన్దం త్వమమ్బ! భవ భృఙ్గీ. ౧౬

ఓయమ్మా! నామస్తకమందున్న ప్రఫుల్లమగు ఈ పద్మము అనల్పమగు మకరందము గలదై యున్నది. నీవు మధుకరివి కమ్మా!

ప్ర భ:—అనల్పమగు మకరందము=దట్టమయిన తేనె. నీవాపద్మమునందుండి దానిరసము నాస్వాదింపుమని ప్రార్థించుచున్నాఁడు.

**మూ॥ సరోజమతుద స్తి పిబామ్బ! మకరన్దమ్**
**మహామధుకరి! త్వం భజేర్మదమమన్దమ్. ౧౭**

**అమ్మా! నీవు- ఆసరోజమును పీడింపకుండ, మధురసమును గ్రోలుము. మహామధుకరీ! (తదాస్వాదనముననీవు) అధికమగు మదమును (బోధవిశేషమును) బొందుము.**

ప్రి భ:—అమ్మా! ఆకమలము- కోమలము. కావున మధువు నాస్వాదించునపుడు- అది లులితము కాకుండునట్లు నిపుణతమ భృంగివగు నీవు రసమునఁ గ్రహింపఁగలవు. మఱియు మధువునంతనుగూడ నీవు గ్రహింపగలవు అనునర్థమును మహామధుకరీశబ్ద స్వారస్యమువలన నెఱుఁగునది.

యోగానుభవ విశేషప్రాదుర్భావదశలయందు యోగికి శరీరవ్యథలుకలుగును. కావుననే కోమలమగు కుసుమమును పీడింపకుము'' అని రూపకముచేత మీఁది యర్థము అనుప్రాణితము.

**మూ॥ అమఙ్గలమితః ప్రాఙ్మయేశవధు! భుక్తమ్**
**ఇతః పరమమేయే! సుఖాన్యనుభవత్వమ్. ౧౮**

**ఈశ్వరప్రియా! అమేయా! ఇంతకుముందు నేను దుఃఖము ననుభవించితిని. ఇఁకమీఁద నీవు సుఖముల ననుభవింపుము.**

ప్రి భ;—నీసుఖముకొఱకు దుఃఖములన్నియు నేననుభవించితిని. నీవానందమయివి. కావున సుఖముల ననుభవింపుమని భావము. జ్ఞానముకలుగుటకు ముందు అజ్ఞానియగు భోక్త చేత కష్టమంతయు ననుభవింపఁబడును. జ్ఞానము కలిగినపిమ్మట భోక్తృత్వము నశించును, అపుడు పరమేశ్వరియే భోక్త్రియగునని భావము. మూలశ్లోకమున 'మయా' అనుటకు బదులు 'మయి' అను పాఠభేదము కాన్పించుచున్నది. 'మయి' అను పాఠమును స్వీకరించునపుడు క్రిందిభావ మేర్పడుచున్నది.

"నీవు నాయందింతకుముందు-అమంగళము ననుభవించితివి. ఇంకమీఁద సుఖముల ననుభవింపుము. జ్ఞానోదయము కలుగకముందును, కలిగిన తరువాతనుగూడ వే భోక్త్రివి. కావున నాదుఃఖము నీవే యనుభవించితివి.

మూ॥ అహఙ్కృతి వశాన్మచిదీశ్వరి! పురాభూత్
తవా భవ దిదానీం మమాస్తి నవిభుత్వమ్. ౧౯

ఈశ్వరీ! ఈదృశమగుజ్ఞానము కలుగుటకు ముందు త్వదీయమగుచిత్తు అహంకృతివశమువలన మదీయమై యుండెను. ఇప్పుడది త్వదీయమైనది. కావున నాకు (చిద్) విభుత్వములేదు.

ప్ర భ:—బోధము కలిగినపిమ్మట మదీయమగు చిత్ ప్రభుత్వము త్వదీయమే యయినదని భావము.

మూ॥ యదాఽభవదియంమే తదాస్వభవ దార్తిస్
తవేశ్వరి! భవ త్వస్తి భునక్తు శమిదానీమ్. ౨౦

ఎప్పుడీచిత్తు- అహంకారవశమువలన మదీయమై యుండెనో అప్పుడు వ్యథననుభవించినది. ఈశ్వరీ! ఇప్పుడు త్వదీయమై సుఖము ననుభవించుగాత !

ప్ర భ:—మమత్వమున దుఃఖముకలుగును. నిర్మమత్వమున సుఖముకలుగును అనునది ప్రసిద్ధమగు సర్వసిద్ధాంతసారము.

మూ! శిరోత్రీయమహన్తా వివాదమధునాఽపి
తథాఽపి పురతస్తే మహేశ్వరి వివీర్యా. ౨౧

మహేశ్వరీ! ఈ యహంత (అహంభావము) ఇప్పటికినిగూడ వివాదమును (వ్యవహారమును) చేయనీ. అట్లొనర్చినను గూడ నీముందిది- వివీర్యము కాకమానదు.

ప్ర భ:—వివాదము=వివిధమగువాదము. వివీర్యము=పోయిన బలముకలది. (విగతమగు వీర్యముగలది) ఈ యహంతయెక్కడ? నీవెక్కడ? నీయెదుటనిది నిలువఁగలదా? అని భావము.

మూ॥ ఇయంచ తవబుద్ధేర్యాతో భవతి వృత్తిః
ఇమామపి కురుస్వాం క్షమావతి! విరోషా. ౨౨

ఈ బుద్ధివృత్తికూడ త్వదీయమే యగును. కావున క్షమావతీ! ఈవృత్తినిగూడ విరోషవై (శాంతవై) స్వీకరింపుము.

ప్ర భ:—ఈ బుద్ధివృత్తి నీయదియే. దీనిని శాసించుదానవు నీవే. కావున దీనినిగూడ నంగీకరింపుమని భావము.

మూ॥ సుధాబ్ధిరిహ మాతః! తరఙ్గశతమాలీ
చిదభ్రిపురమత్రి ప్రభాపదమదభ్రిమ్. —౨౩

మాతా! ఇక్కడ (ఈశరీరమునందు) సుధాసముద్రము తరంగ శతమాలియై శతసంఖ్యాకములగు అనగా అసంఖ్యాకములగు తరంగపంక్తులు గలదై యున్నది. ఇక్కడ (ఈశరీరమునందు) అనల్పమును సర్వతేజో మూలపదమును అగు చిదాకాశపురము (కూడ) ఉన్నది.

ప్ర భ:—సుధాసముద్రమనఁగా సహస్రారమే. తంత్రిశాస్త్రములయందు సహస్రారము సుధాసముద్రమని వర్ణింపఁబడినది. "తరంగశతమాలి" అనుపదము చేత- సహస్రారముయొక్క విలాసవిభూతిపరంపర చెప్పఁబడుచున్నది. చిదాకాశ పురమనఁగా, బయలుకంటి చైతన్యమే యగుపట్టణము. 'దహరము' అను నామమున శ్రుతిప్రసిద్ధమగు బ్రహ్మపుర మిదియేయని తెలియునది. ఇదియే శాస్త్రములయందు సూర్యమండలముగా నుపదేశింపఁబడిన హృదయమని గ్రహించునది. ఆహారమునకై, సుధాసముద్రమునుండి యమృతమును, నివాసమునకై దహరాకాశమువలన నవకాశ మును గలుగుచుండును. కావున దేవీ! విజయము నొందుము! అని భావము.

మూ॥ కురుత్వమిద మేకం నిజాలయశతేషు
సవిత్రి! విహారాస్మిన్ యథేష్టమయి దేహే. —౨౪

సవిత్రి! నీ నివాసభవనశతములయందు నా యీ శరీరము నొకదానినిగూడ పరిగణింపుము. ఈదేహమునందు యథేష్టముగా విహరింపుము.

ప్రి భ:—నీ నివాస గృహములయందీ నాశరీరమునుగూడ లెక్కించి దీని యందుఁగూడ స్వచ్ఛందమగు విహారము నొనర్పుమని భావము,

మూ॥ కుమారలలితానాం కృతిర్గణపతీయా
కరోతు ముదమేషా కపర్దిదయితాయాః. —౨౫

గణపతీయమగు సుకుమారలలితావృత్తరచితస్తుతిరూపకృతి-
పరమేశ్వరప్రేయసికి ప్రీతినొసఁగుఁగాత!



ఇతి శ్రీమహర్షి భగవత్పాదాన్తే వాసినో వాసిష్ఠస్య
నరసింహసూనోః కృతావుమాసహస్రే
షోడశః స్తబకః సమాప్తః
సమాప్తంచ చతుర్థం శతకమ్.



ఇది- శ్రీమహర్షి- రమణభగవత్పాదశిష్యుఁడు శఠమర్షణసగోత్రుఁడు
శ్రీమత్ పంతుల పేరయశాస్త్రి పౌత్రుఁడు వేంకటరామ
బుధేంద్రపుత్త్రుఁడు లక్ష్మీనారాయణశాస్త్రిచే నాంధ్రీక
రింపఁబడిన ఉమాసహస్రమను స్తోత్రకావ్యమున
పదునారవస్తబకము (నాలుగవశతకము)

ఓమ్, తత్, సత్,

[ఇది - ద్వితీయ భాగము]

# "శ్రీ బాలసరస్వతి" ప్రచురణములు.

## —: పంతుల లక్ష్మీనారాయణ శాస్త్రి కృతులు :—



| | | | |
|---|---|---|---|
| ౧. | ఆంధ్రధ్వన్యాలోకము | ప్రథమభాగము | 3—0—0 |
| ౨. | " | ద్వితీయభాగము | 4—0—0 |
| ౩. | " | తృతీయభాగము | (అచ్చులో) |
| ౪. | ఈశావాస్యోపనిషత్తు ... [ఆంధ్రపద్యానువాద, పదవిభాగ, ప్రతిపదార్థ, త్రిమత సంబంధి షోడశ భాష్యార్థ, తద్విమర్శన సమ్మిళిత స్వాభిప్రాయ, సమన్వితము] | | 2—8—0 |
| ౫. | ఉమాసహస్రము ... | ప్రథమభాగము | 1—8—0 |
| | శ్రీ కావ్యకంఠ గణపతిముని కృత మూల శ్లోకములు [సాంధ్రపద్య-తాత్పర్య-వివరణములు-ద్వితీయభాగము-శతకత్రయము] | | 3—0—0 |
| ౬. | అధ్యాత్మోపనిషత్తు ... ఆంధ్ర పద్య వివరణ సమన్వితము. | | 1—0—0 |
| ౭. | ఆంధ్రకాఠకోపనిషత్తు ... పద్యానువాద సమన్వితము | | 0—10—0 |
| ౮. | వేదాంతడిండిమము ... గేయానువాదము. | | 0—8—0 |
| ౯. | భామతి [నవ్యకావ్యము] | | (అచ్చులో) |
| ౧౦. | శ్రీ గీతా సుధాంజలి | | (ఉచితము) |

ప్రాప్తిస్థానము:—

**పంతుల లక్ష్మీనారాయణశాస్త్రి, అధ్యాపకుఁడు**

మహారాజ సంస్కృత కళాశాల—పత్తిపాటివారివీధి

విజయనగరము.